# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 7 సంచిక : 6 హైదరాబాద్ 95 జూన్ 2009 పేజీలు : 60 రు. 10

* ఫోకస్ : కొత్త ప్రభుత్వం - ప్రజల ఆకాంక్షలు
* ఎన్నికల ఫలితాలపై విశ్లేషణలు
* శ్రీలంక తమిళులపై హత్యాకాండ
* భోలక్‌పూర్‌లో పాలకుల వైఫల్యం
* పష్తూన్ జాతీయ విమోచనోద్యమం
* గ్రామీణాభివృద్ధి - గ్రామీణ ఉపాధి పథకం

వీక్షణం మీరు చదువుతున్నారా?వెంటనే చందాదారులు కండి !
మీరు చందాదారులేనా? కనీసం మరొకరి చందా చేర్పించండి!

మీ గ్రంథాలయానికి, కార్యాలయానికి, మీకు తెలిసిన ప్రజాసంఘాలకు వీక్షణం ను పరిచయం చేయండి, వీక్షణం మీ పత్రిక, ప్రజల పత్రిక నాలుగు కాలాలు నడిచేలా చూసే బాధ్యత మీదే

మీరు తప్పనిసరిగా తెలుసుకోవలసిన సమస్త సామాజిక, రాజకీయార్థిక విషయాలను సమగ్రంగా, స్పష్టంగా వివరిస్తాయి **వీక్షణం** వ్యాసాలు

## విడి ప్రతి కేవలం రు.10 మాత్రమే

## చందా వివరాలు

| | |
|---|---|
| సంవత్సర చందా | రు. 120 |
| మూడు సంవత్సరాల చందా | రు. 350 |
| ఐదు సంవత్సరాల చందా | రు. 550 |
| పది సంవత్సరాల చందా | రు. 1000 |

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495,
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, reachcdrc@yahoo.com
సర్క్యులేషన్ మేనేజర్ : 9949391028

# వీక్షణం 95

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

జూన్ 2009
సంపుటి : 7
సంచిక : 6


## సంపాదకీయం

# రాష్ట్రంలో ఎన్నికల ఫలితాలు

రాష్ట్ర శాసనసభకూ, లోక్‌సభకూ జరిగిన 2009 సార్వత్రిక ఎన్నికల ఫలితాలు కొందరికి ఆశ్చర్యాన్నీ, కొందరికి నిరాశనూ కలిగించాయి. మన పార్లమెంటరీ ప్రజాస్వామ్యంలో ఎన్నికలు లాటరీలా, జూదంలా మారిపోయాయి గనుక ఫలితాలు ఇలా అనూహ్యంగా, మన కోరికలకు భిన్నంగా ఉండక తప్పదు. ప్రజా వ్యతిరేకులు గెలుస్తున్నట్టు, ప్రజల నిజమైన ఆకాంక్షలను ఫలితాలు వ్యక్తం చేయలేకపోతున్నట్టు కనిపించక తప్పదు. ఎన్నికలలో వ్యక్తమయ్యేదంతా ప్రజాభిప్రాయమేనని అమాయకంగా నమ్మేవాళ్లకు ఈ ఫలితాలు నిరాశనూ ఆశ్చర్యాన్నీ కలిగిస్తాయి. అయితే వాస్తవ సామాజిక స్థితిని నిశితంగా పరిశీలించినవారికి, వాస్తవం తమ కోరికల ప్రకారం ఉండదనీ దాని వస్తుగత నియమాలు దానికి ఉంటాయనీ అవగాహన ఉన్నవారికి ఈ ఫలితాలలో ఆశ్చర్యకరమైనదీ, నిరాశాపూరితమైనదీ ఏమీ లేదు. మొట్టమొదట మన సమాజంలో ఎన్నికలు పూర్తిగా ప్రజాభిప్రాయానికి సూచికలు కావనీ, దానిలో ప్రజాభిప్రాయం వ్యక్తం కావడానికి ఉన్న అవకాశం తక్కువ అనీ గుర్తుంచుకోవాలి. నిజంగా తమ అభిమతాన్ని ఓటు రూపంలో వ్యక్తం చేయాలని ఎవరయినా అనుకున్నా కూడ ఎన్నిక కోసం తమముందు నిలబడిన అభ్యర్థులలో ఏ ఒక్కరినీ నమ్మలేని, ఏ ఒక్కరినీ ఎన్నుకోవడానికి వీలు లేని స్థితే ప్రజలకు ఉంది. ఆయా అభ్యర్థులు ఏ పార్టీకి చెందినవారయినప్పటికీ, ఏ నినాదాలు, వాగ్దానాలు చేస్తున్నప్పటికీ వారందరివీ ఒకే రకమైన సామాజిక రాజకీయార్థిక విధానాలేనని ప్రజలకు ఎప్పుడో అర్థమయిపోయింది. ఇప్పుడు ప్రత్యర్థులుగా పోటీ చేస్తున్న అభ్యర్థులూ, రాజకీయ పక్షాలూ అన్నీ ఏదో ఒక సమయంలో అధికారం చలాయించి ప్రజావ్యతిరేక విధానాలను అమలు చేసినవారే. ప్రతిపక్షంలో కూచున్నప్పుడు కూడా వాగాడంబరపు వ్యతిరేకత తప్ప ఆచరణాత్మకమైన వ్యతిరేకత చూపినవారు ఎవరూ లేరు. మరోమాటల్లో చెప్పాలంటే పైకి ప్రత్యర్థులుగా కనబడుతున్న వాళ్లందరూ నిజానికి ఒకే పాలకవర్గంలో భిన్న స్వార్థ ప్రయోజనాలు గల ముఠాలే. ఒకే తానులో ముక్కలే. ప్రజాప్రయోజనాల కొరకు రాజకీయాలు నడపదలచుకున్న వారు కాదు. ఈ సంగతి ప్రజలకు స్పష్టమయినందువల్లనే ఎన్నికలపట్ల ప్రజలలో నిరాసక్తత, నిర్లిప్తత కనబడుతున్నాయి. కనుక మారవలసింది ఎన్నికలలో అభ్యర్థులో, నినాదాలో, రాజకీయపక్షాలో కాదు. మౌలికంగా ఎన్నికల స్వభావమే మారాలి. అంటే పునాదిగా ఉన్న వ్యవస్థ మారాలి. వ్యవస్థ మార్పు గురించి, కనీసం రాజ్యాంగబద్ధ ఆదర్శాల గురించి ఏమాత్రం ఆలోచనలేని రాజకీయ పక్షాలు ఎన్ని మారినా, ఎవరు గెలిచి ఎవరు ఓడినా మారబోయేది ఏమీ ఉండదు. అందువల్ల ఎవరో ఓడారనీ, ఎవరో గెలిచారనీ నిరాశపడడం, ఆశ్చర్యపోవడం అమాయకత్వమే. రాష్ట్రం వరకే చూస్తే గత పది సంవత్సరాలలో రెండు ప్రధాన రాజకీయపక్షాలూ చెరి ఐదు సంవత్సరాలు పాలించాయి. ఆ రెండు పాలనలలోనూ చెప్పుకోదగిన మార్పేమీ లేదు. రెండు పక్షాలూ ప్రజావ్యతిరేకంగానే పాలించాయి. రెండు పక్షాలూ పేదల భూములు లాక్కుని పెద్దలకు పందారం చేశాయి. రెండు పాలనలూ వేలాది మంది రైతుల ఆత్మహత్యలకు కారణమయ్యాయి. రెండు పాలనలలోనూ వేలాది మంది కార్మికులు ఉపాధి కోల్పోయారు. ఒకరు ముదిగొండ కాల్పులు జరిపితే మరొకరు బషీర్‌బాగ్ కాల్పులు జరిపారు. ఇద్దరు పాలకులూ ప్రజాఉద్యమాలను, ప్రజల న్యాయమైన ఆకాంక్షల వ్యక్తీకరణను ఉక్కుపాదంతో అణచివేశారు. రెండు పాలనలలోనూ ప్రజాజీవితం ఇంకా దిగజారింది కాని జరిగిన మెరుగుదలేమీ లేదు. అంటే రెండు పక్షాలలో ఎవరు గెలిచినా తమకు ఒరగబోయే మేలేమీ లేదని ప్రజలు గుర్తించారు. కనుక ఇద్దరిలో ఏ ఒక్కరికీ ప్రజలు ఇష్టపూర్వకంగా ఓటు వేసే అవకాశమే లేదు. ప్రజలను తాత్కాలికంగా ఆకర్షించి ఓట్లు వేయించుకుని, ఏ ముప్పై శాతం ఓట్లతోనో అధికారానికి వచ్చి ఐదు సంవత్సరాలపాటు ప్రజావ్యతిరేక పాలన జరపడమే మన ఎన్నికల అంతరార్థం అయిపోయింది. అందువల్ల ఎన్నికలలో వ్యక్తమయ్యేది ఆ తాత్కాలిక ఆకర్షణల ప్రభావమే తప్ప ఆయా రాజకీయ పక్షాల పట్ల ప్రేమాభిమానాలు కాదు. నిరంతర జాగరూకతే ప్రజాస్వామ్యానికి మూల్యం అంటారు. ఇది ప్రజాస్వామ్యం అయినా కాకపోయినా ప్రభుత్వాల పట్లా ప్రతిపక్షాల పట్లా అసలు రాజకీయాల పట్లనే నిరంతరం జాగరూకంగా ఉండవలసినది ప్రజలేనని ఈ ఎన్నికల ఫలితాలు మరొకసారి రుజువు చేస్తున్నాయి. కొత్తగా అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ ప్రభుత్వం ఈ ఫలితాల విజయగర్వంతో తన ప్రజావ్యతిరేక విధానాల అమలును మరింతగా పెంచుతుంది. జాగరూకత వహించవలసినది ప్రజలే.

---

తాజా కలం : కొత్త ప్రభుత్వం ఇంకా పూర్తిగా ఏర్పడకముందే, హోంశాఖకు ఎవరు ఆధిపత్యం వహిస్తారో కూడా తేలకముందే కాంగ్రెస్ ప్రభుత్వపు ఎన్‌కౌంటర్ హత్యలు మొదలయ్యాయి. భారత కమ్యూనిస్ట్ పార్టీ (మావోయిస్ట్) కేంద్ర కమిటీ సభ్యుడు, కేంద్ర మిలిటరీ కమిషన్ సభ్యుడు పటేల్ సుధాకర్ రెడ్డిని, మరొక నాయకుడు కానుగుల వెంకటయ్యను మే 23న మహారాష్ట్రలోని షిర్డిలో అరెస్ట్ చేసి, మే 24 తెల్లవారుఝామున వరంగల్ జిల్లా తాడ్వాయి సమీపంలో ఎన్‌కౌంటర్‌లో చనిపోయినట్టుగా కట్టుకథ ప్రకటించారు. ప్రభుత్వం ఉన్నా లేకపోయినా, పనిచేసినా చేయకపోయినా ప్రజల మీదా, ప్రజానాయకుల మీదా పోలీసు దమననీతి మాత్రం యథావిధిగా సాగుతుందని మరొకసారి రుజువైంది.

వీ


గౌరవ సంపాదకులు :
**వి. హనుమంతరావు**

సంపాదకులు :
**ఎన్. వేణుగోపాల్**

సహాయ సంపాదకులు :
**డి.వి.రామకృష్ణారావు**

కరస్పాండెంట్ /
సర్క్యులేషన్ మేనేజర్ :
**వై. రామచంద్రం**
**9949391028**

కరస్పాండెంట్/సబ్‌ఎడిటర్ :
**సి. రాజశేఖర్**

సబ్‌ఎడిటర్ :
**పి. గాయత్రీ ప్రసన్న**

ఆఫీస్ అసిస్టెంట్ :
**ఎస్. వెంకటేష్**

**వీక్షణం చందా వివరాలు**

| | | |
|---|---|---|
| సంవత్సర చందా | రు. | 120 |
| 3 సంవత్సరాల చందా | రు. | 350 |
| 5 సంవత్సరాల చందా | రు. | 550 |
| 10 సంవత్సరాల చందా | రు. | 1000 |

**'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం**
రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక
మైత్రి రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
reachcdrc@yahoo.com

డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజన్సీస్**, హైదరాబాద్.
ఫోన్ : 98484 28516
98482 49695

ప్రింటర్స్
**చరితా ఇంప్రెషన్స్,**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

# కేంద్రంలోనూ అంతే

**కాం**గ్రెస్ నాయకత్వంలోని యునైటెడ్ ప్రొగ్రెసివ్ అలయన్స్ (యుపిఎ) ఏమి ఒరగబెట్టిందని ప్రజలు దాని చేతికి తిరిగి అధికారం ఇచ్చారు? అసలు ఇది ప్రజలు యుపిఎ విధానాలను ఆమోదించి ఇచ్చిన అధికారమేనా? లేక ప్రతి నియోజకవర్గంలోనూ ఓట్లను ప్రత్యర్థులు భారీగా చీల్చుకోవడంతో యుపిఎ భాగస్వామ్య పక్షాలకు ఆధిక్యత దక్కిందా? లేక ప్రధాన ప్రత్యర్థిగా నిలిచిన ఎన్‌డిఎ అధికారానికి వస్తే మోడీ మార్కు మతోన్మాద హింసా రాజకీయాలు ఆధిపత్యంలోకి వస్తాయనే భయంతో యుపిఎకు ఆధిక్యత దక్కిందా? 'ఈ పరిస్థితి బాగులేదు సరేగాని, మరొకరిని ఎన్నుకుంటే పరిస్థితి మరింత అధ్వాన్నమవుతుంది' అనే ఆలోచనతోనే ఓటర్లు ఇలా ప్రవర్తించారా? ఇద్దరూ దొంగలే అయినప్పుడు, చంపి దోపిడీ చేసే దొంగకూ, ప్రాణాలు మాత్రం మిగిల్చి దోపిడీ చేసే దొంగకూ మధ్య ఎంపిక చేసుకోమని భారత రాజకీయాలు సవాలు విసిరినప్పుడు ప్రజలు ఇక దిక్కులేక యుపిఎ ను ఎంచుకున్నారా? తమ భూమినీ, ఉపాధి అవకాశాల్నీ, బతుకునూ బలిగొన్న ప్రత్యేక ఆర్థిక మండలాల విధానాన్ని ప్రజలు ఆమోదించారా? అమెరికా పాలకులకు, బహుళజాతి సంస్థలకు అడుగులకు మడుగులొత్తుతూ వారి ప్రయోజనాల కోసం దేశాన్ని, దేశ వనరులను, ప్రజల జీవనోపాధిని తాకట్టుపెట్టే మాజీ ప్రపంచబ్యాంక్ ఉద్యోగి పాలనను ప్రజలు ఆమోదించారా? సామ్రాజ్యవాద యుద్ధ పరిశ్రమకు మన వనరులు కొల్లగొట్టి పెట్టడానికి మనమీద రుద్దిన అణు ఒప్పందాన్ని భారత ఓటర్లు ఆమోదించారా? సిద్ధాంతాలూ సూత్రాలూ విలువలూ లేని, అధికారమే, అక్రమ సంపాదనే పరమావధి అయిన కప్పలతక్కెడ రాజకీయాలను ప్రజలు ఆమోదించారా? లేక ఇలా ఆమోదించినట్టు కనబడడానికి మరేదన్నా కారణముందా? కసాయి వాడి కత్తి కింద మెడ ఉన్నప్పుడు మేక కూడ ప్రతిఘటించడానికి ప్రయత్నిస్తుందే, చైతన్యయుతమైన మనుషులు ఎందువల్ల ఈ కసాయి పాలకులను ఇంతగా నమ్ముతున్నారు? మళ్లీ మళ్లీ తమ మెడలను తామే వాళ్ల కత్తికింద ఎందుకు పెట్టుకుంటున్నారు? బహుశా ఎన్నికలలో ప్రజలు స్వేచ్ఛగా, ఇష్టపూర్తిగా తమ ప్రతినిధులను, ప్రభుత్వాలను ఎన్నుకోగల స్థితి ఉందని నమ్మడంలోనే పొరపాటు ఉన్నదేమో. లేకపోతే ఇంత నిర్హేతుకమైన, అసంబద్ధమైన ఫలితాలు రావడానికి అవకాశమే లేదు. ప్రజావ్యతిరేకులుగా అనేకసార్లు రుజువైన వాళ్లు మళ్లీ అందలమెక్కడానికి వీలే లేదు. సుస్థిరత కోసమో, తీవ్రవాదం మీద యుద్ధం కోసమో, అభివృద్ధి కోసమో, సంక్షేమ పథకాల కోసమో ఈ ప్రభుత్వాలను మళ్లీగద్దెనెక్కించారనే వాదనకు అర్థమే లేదు. సుస్థిరత వల్ల ప్రజలకు ఒరిగినదేమీ లేదు. ఈ అరవై ఏళ్లలో కనీసం నలభై ఏళ్ల పాటు కాంగ్రెస్ సుస్థిరంగానే పాలించింది. ప్రజల మౌలిక అవసరాలు తీర్చే ప్రయత్నమేదీ చేయలేదు. ఆ అవసరాలు తీరని ప్రజా అసంతృప్తి నుంచే తీవ్రవాదమనబడేది తలెత్తింది గనుక దాన్ని అరికట్టడం ఈ పాలకులకు సాధ్యమేకాదు. అభివృద్ధి పేరు మీద జరుగుతున్నదంతా ప్రజలను భ్రమల్లోముంచే, పాలకులకూ ఆశ్రితులకూ మరింత సంపద సమకూర్చిపెట్టే పథకాల పటాటోపమే తప్ప, నిజంగా ప్రజల అభివృద్ధి కాదు. ప్రజాజీవితంలో వచ్చిన అభివృద్ధి ఏమిటో ఇప్పటికీ కొనసాగుతున్న దారిద్ర్యం, అవిద్య, నిరక్షరాస్యత, అనారోగ్యం, కులవివక్ష, మతవిద్వేషాలు చూపుతాయి. ఆ దుస్థితి వల్లనే ఒక అతుకుగా, తాత్కాలిక ఉపశమనంగా సంక్షేమ పథకాలు ప్రకటించవలసి వస్తోంది. కనుక ఈ ఎన్నికలు ఒక మాయగా, కనికట్టుగా, వంచనగా మాత్రమే జరుగుతున్నాయని మరొకసారి తేలిపోయింది. వాటి ఫలితాలను ఒక భ్రమాజనిత మానసిక స్థితికి ప్రతిఫలనాలుగా తప్ప మరొకరకంగా చూడడం సాధ్యం కాదు.

# ప్రభాకరన్ యుగం ముగిసిందా?

**శ్రీ**లంక తమిళ ప్రజాఉద్యమాల చరిత్రలో ఒక వీరోచిత పోరాట యుగం విషాదకరంగా ముగిసింది. ఎల్‌టిటిఇ స్థావరాలుగా ఉండిన కిల్లినొచ్చి, ముల్లైతీవు ప్రాంతాలమీద నిర్విచక్షణగా బాంబుదాడులు చేసి, అధినేత ప్రభాకరన్‌తో సహా ముఖ్య నాయకులను చాలామందిని, వేలాది మంది సాధారణ తమిళ ప్రజానీకాన్ని ఊచకోత కోసి శ్రీలంక సైన్యం తమిళ ఈలం పోరాటాన్ని అణచివేశానని విర్రవీగుతున్నది. తమిళజాతి ఆకాంక్షలను మట్టుపెట్టగలిగానని సింహళ జాతి దురహంకారం కొలంబోలో వికటాట్టహాసం చేస్తున్నది. దేశదేశాలలో ప్రజాపోరాటాల పట్ల సానుభూతి, సంఘీభావం ఉన్న కోట్లాది ప్రజలను ఈ దారుణ మారణకాండ నిరాశలో, విషాదంలో ముంచివేసింది. అయితే ప్రజల పక్షాన నిలబడి, ప్రజల ఆకాంక్షల సాధనకోసం పోరాడిన ప్రజాయోధుల సుదీర్ఘ చరిత్రలో ప్రభాకరన్ గానీ ఎల్‌టిటిఇ గానీ మొదటివారూ కాదు, చివరివారూ కాబోరు. తోటి బానిసల విముక్తి కోసం బానిస యజమానుల మీద తిరుగబడి వందలాది మంది సహచరులతో సహా శిలువ ఎక్కిన స్పార్టకస్ నాటి నుంచి, నిన్నా ఇవాళా ప్రభుత్వ బలగాల చేతిలో హతమైపోయిన వీరయోధుల దాకా కోట్లాది మంది ప్రజాపోరాట మార్గంలో ఒరిగిపోయారు. కాని వారి మరణం వల్ల ఆ మార్గం ఆగిపోలేదు. అధికార వర్గాలు వారిని హత్య చేయగలిగాయేమోగాని వారు ఏ ఆశయం కోసం తమ ప్రాణాలను అర్పించారో ఆ ఆశయాన్ని రద్దుచేయలేకపోయారు. స్పార్టకస్‌ను హత్యచేసిన తర్వాత ఎన్నో సంవత్సరాలకు కూడా బానిస విధానం మీద పోరాటం కొనసాగింది. బానిస యజమానుల రాజ్యం కుప్పకూలిపోయింది. భగత్‌సింగ్‌ను ఉరితీసిన తర్వాత భారతీయులలో వలసవాద వ్యతిరేకత విజృంభించింది. బ్రిటిష్ పాలనే అంతరించిపోయింది. ఇప్పుడు ప్రభాకరన్ అనే వ్యక్తి లేకపోవచ్చు. ఎల్‌టిటిఇ అనే సంస్థ పేరు శ్రీలంక ఉత్తర, తూర్పు ప్రాంతాలలో వినిపించకపోవచ్చు. కాని శ్రీలంక తమిళుల మీద సింహళ అగ్రజాతి దురహంకారం, వివక్ష కొనసాగినంతకాలం, వాళ్లలో స్వేచ్ఛాకాంక్ష వెల్లివిరుస్తూనే ఉంటుంది. ఆ స్వేచ్ఛాకాంక్ష ఏదో ఒక నిర్మాణ రూపం తీసుకుంటుంది. వ్యక్తిగా ప్రభాకరన్ మరణించి ఉండవచ్చు. శక్తిగా, ప్రభావంగా, ప్రేరణగా ప్రభాకరన్ చిరకాలం జీవించే ఉంటాడు. లోకంలో దోపిడీ పీడన అసమానతలు ఉన్నంతకాలం వాటిని రద్దుచేయడానికి జరిగే ప్రయత్నాలు, ప్రయోగాలు, పోరాటాలు ఉంటూనే ఉంటాయి. ఆ దోపిడీ పీడనలవల్ల ప్రయోజనం పొందే వర్గాలు ఆ ప్రయత్నాలను అరికట్టగలిగామని ఎప్పటికప్పుడు తాత్కాలిక శునకానందాలు పొందుతూనే ఉంటాయి. వీ

# లోపలి పేజీల్లో...

## ఫోకస్ : కొత్త ప్రభుత్వం - సొంత ఎజెండా - ప్రజల ఆకాంక్షలు

ఈ ఎన్నికలు ప్రజాసంక్షేమాన్ని బలపరిచాయి. ప్రజలు తాము పొందిన ఉపశమనానికి పాలకపార్టీకి మద్దతునిచ్చారు. కాని ఇది ప్రపంచీకరణకు, నూతన ఆర్థిక నమూనాకు, సంస్థల విధ్వంసానికి, విలువల దిగజారుడుకు, అహంకారానికి, వ్యక్తిస్వామ్యానికి ఓటు కాదు. పాలకుల బహిర్గత ప్రకటనలకు, అంతర్గత ప్రయోజనాలకు మధ్య ప్రజలు బంధించబడ్డారు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రపంచీకరణను మరింత పెద్ద ఎత్తున ప్రజల మీద రుద్దబోతున్నాయి. ఈ ఆర్థిక నమూనా ప్రజల జీవనాన్ని విధ్వంసం చేయకుండా ముందుకు పోదు. ఎన్నికల రాజకీయం చాటున దాగిన పాలకవర్గ ప్రయోజనాలను ప్రజలకు మరింత స్పష్టంగా చెప్పవలసిన బాధ్యత ప్రజా ఉద్యమాల మీద ఉంది. తస్మాత్ జాగ్రత్త!




'వీక్షణం'లో అచ్చువుతున్న రచనలలో వ్యక్తమైన అభిప్రాయాలన్నిటితో సంపాదకులకు ఏకీభావం ఉండనవసరం లేదు. 'వీక్షణం'ను నిజమైన ప్రజాపక్ష రాజకీయార్థిక, సామాజిక విశ్లేషణా వేదికగా తీర్చిదిద్దడంలో అన్నిరకాల అభిప్రాయాలకు, భిన్నాభిప్రాయాల ఛాయలకు స్థానం కల్పించాలని సంపాదక వర్గం భావిస్తోంది.


### రచయితలకు సూచన

ఏ పత్రికయినా తాను అచ్చువేసే రచనలు తనకే ప్రత్యేకంగా ఉండాలని కోరుకుంటుంది. 'వీక్షణం' కూడా అలానే భావిస్తోంది. ఇటీవల కొందరు రచయితలు తమ రచనలను ఒకేసారి అనేక పత్రికలకు పరిశీలన కోసం పంపుతున్నారు. 'వీక్షణం' పరిశీలనలో ఉన్న రచనలు, రాబోయే సంచికలలో అచ్చుకోసం ఎంపిక చేసి పెట్టుకున్న రచనలు ఇతర దినపత్రికలలోనో, వార పత్రికలలోనో వెలువడడం మా దృష్టికి వస్తోంది. ఇతర పత్రికలకు పంపిన రచనలను 'వీక్షణం'కు పంపించగూడదని రచయితలకు విజ్ఞప్తి చేస్తున్నాము.

– సంపాదకులు

### చందాదారులకు విజ్ఞప్తి!

ఇటీవల కొంతమంది చందాదారులకు వీక్షణం సక్రమంగా అందడం లేదని ఫిర్యాదులు వస్తున్నాయి. వీక్షణం ప్రతినెల 29వ తేదీన మరుసటి నెల సంచిక పోస్ట్ అవుతుంది. ఏ కారణం చేతనైనా మీకు వీక్షణం మొదటివారంలోపు అందనట్లయితే, వెంటనే ఆ విషయం మాకు తెలపగలరు.

మీ చిరునామా వివరంగా రాయండి. పిన్‌కోడ్ రాయడం మరిచిపోకండి. పత్రిక వచ్చిందా రాలేదా పోస్ట్‌మాన్‌తో నిర్ధారించుకోగలరు.

– సర్క్యులేషన్ మేనేజర్
9949391028







- **నిరంతర జ్వలనశీలి – జ్వాలాముఖి – జ్ఞాపకాలు** – చూపు, కామారెడ్డి అధ్యయన వేదిక ప్రచురణ – 56 పేజీలు, 1/4 క్రౌన్, రు.20, ప్రతులకు : వి.ఆర్. శర్మ, ఇ.నెం. 102, సాయిబాలాజి అపార్ట్‌మెంట్స్, విద్యానగర్, కామారెడ్డి, సెల్ : 94402 11708; దిశ, సహచర, నవోదయ, విశాలాంధ్ర, ప్రజాశక్తి – హైదరాబాద్, మణి బుక్‌స్టాల్ – నెల్లూరు; మైత్రి బుక్‌హౌస్, విజయవాడ
- **విశ్వనరుడు జాషువా** – జీవితం – సాహిత్యం – బహుజన కెరటాలు ప్రచురణలు – 74 పేజీలు, 1/8 డెమీ, రు. 15, ప్రతులకు : కడియం నాగమణి, C/o. ఎస్.ఆర్. పల్నాటి, రాజగృహ, 4/15, ఆర్.టి.సి. స్టాఫ్ కాలనీ, సత్యన్నారాయణపురం, ఒంగోలు – 2, ప్రకాశం జిల్లా, సెల్ : 9849944170
- **ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు విద్రోహ చరిత్ర** – తెలంగాణ హిస్టరీ సొసైటీ ప్రచురణ – 128 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : తెలంగాణ హిస్టరీ సొసైటీ, ఫ్లాట్ నెం. 305, హిమగిరి ఎవెన్యూ, 13-6-434/బి/38, ఓంనగర్, మెహదీపట్నం రింగ్‌రోడ్, హైదరాబాద్ – 500 008, సెల్ : 9849220321
- **తెలంగాణ** – రాజకీయ, ఆర్థిక, సామాజిక వ్యాసాలు – శ్రీధరరావు దేశ్‌పాండే – తెలంగాణ విద్యావంతుల వేదిక ప్రచురణ, 162 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : దిశ పుస్తక కేంద్రం, సహచర బుక్ మార్క్, నవోదయ బుక్ హౌస్ – హైదరాబాద్
- **నేనే తస్లీమా నస్రీన్ని!!!** – విరబూసిన అగ్నికణం – సంకలనకర్త-సంపాదకులు : క్రాంతికార్ – మానవ వికాస ప్రచురణలు – 168 పేజీలు, 1/8 డెమీ, రు. 70, ప్రతులకు : క్రాంతికార్, మానవ వికాస ప్రచురణలు, బుద్ధ భవన్, 11-1-88, లెనిన్ నగర్, ఖమ్మం – 507 001, ఫోన్ : 08742 – 223788
- **పొలిమేర** – నవల – గూడ అంజయ్య – హేమనళిని – 114 పేజీలు, 1/8 డెమీ, రు. 40, ప్రతులకు : గూడ అంజయ్య, ఇం.నెం. 1-9-19/152, కార్తీక్ అపార్ట్‌మెంట్ ఎదురుగా, రాంనగర్, హైదరాబాద్ – 500 048, ఫోన్ : 040 – 27620869, 9246270911; నవోదయ బుక్‌హౌస్, తెలుగు బుక్‌హౌస్, ప్రజాశక్తి బుక్‌హౌస్, సమాంతర బుక్‌హౌస్, దిశ బుక్‌హౌస్, విశాలాంధ్ర బుక్‌హౌస్
- **ఏజన్సీ ప్రాంత వనరుల పరాయీకరణ – ఆదివాసీల నిరాశ్రయత** – పల్లా త్రినాథరావు – రిసోర్స్ ఫర్ లీగల్ ఏక్షన్ ప్రచురణ – 210 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు : రిసోర్స్ ఫర్ లీగల్ ఏక్షన్, 78-10-4/3, ఎస్.బి.ఐ. కాలనీ, శ్యామలా నగర్, రాజమండ్రి – 3, ఫోన్ : 0883 – 2445983
- **మూగవాని పిల్లనగ్రోవి** – డా. కేశవరెడ్డి – హైదరాబాద్ బుక్‌ట్రస్ట్ – 132 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు : హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ఫ్లాట్ నెం. 85, బాలాజీనగర్, హైదరాబాద్ – 500 067, ఫోన్ : 040 – 23521849
- **చీకటి నుంచి స్వప్నం దాకా** – వ్యాస సంపుటి – డా. తక్కోలు మాచిరెడ్డి – అభ్యుదయ రచయితల సంఘం ప్రచురణ – 153 పేజీలు, 1/8 డెమీ, రు. 80, ప్రతులకు : డా. తక్కోలు మాచిరెడ్డి, 5/39-2, ముత్తరాసుపల్లె, కడప – 516 002, విశాలాంధ్ర బుక్‌హౌస్, ప్రజాశక్తి బుక్‌హౌస్
- **సమ్మె** – సింగరేణి కథలు – శ్రమజీవి ప్రచురణలు – 213 పేజీలు, 1/8 డెమీ, రు. 30, ప్రతులకు : బి.ఎస్.ఎ. సత్యనారాయణ, 2-2-1121/3/ఇ, నల్లకుంట, హైదరాబాద్; అన్ని ప్రముఖ పుస్తక కేంద్రాలలో







ఏప్రిల్ సంచికలో వివిగారు రాసిన 'సమస్యలు నక్సలైట్లవా? ప్రజలవా?' అన్న వ్యాసం విశ్లేషణాత్మకంగా ఉంది. పాలకవర్గాల ద్వంద్వనీతిని ఓవైపు ఎండగడుతూ, మరోవైపు నక్సలైట్ల నిబద్ధతను తేటతెల్లం చేస్తోంది. నక్సలైట్ల పట్ల పెదవి విరిచే కుహనా మేధావులకు కనువిప్పు కలిగించేదిగా ఉంది.

**– ఆజాద్**
హైదరాబాద్

'వీక్షణం' ఏప్రిల్ సంచికలో వచ్చిన రచయితల సమావేశం వివరాలు బాగున్నాయి. వారి సలహాలూ, సూచనలూ పాటిస్తే పాఠకులకు చాలా విషయాలు తెలియడానికి అవకాశం ఉంది. జిల్లాల్లో వీక్షణం ఆధ్వర్యంలో సెమినార్స్ లాంటివి నిర్వహిస్తే ఆ ప్రాంత ప్రజలకు సామాజికపరమైన విషయాల పట్ల అవగాహన పెంపొందడానికి అవకాశం ఉంటుంది.

**– టి. రమేష్**
కరీంనగర్

గత రెండు సంచికలలో వచ్చిన కృష్ణా భరద్వాజ్ గారి వ్యాసం ఒకటికి రెండు సార్లు చదివినా అర్థం కాలేదు. చెబుతున్న విషయం బాగుందనిపించింది గాని, అనువాదం మరింత సరళంగా ఉంటే బాగుంటుంది.

**– లక్ష్మీకాంత్**
కర్నూలు

మీరు వీక్షణం రచయితలను, అసహజ మరణాల రిపోర్టర్స్‌ను సమావేశపరిచి సమీక్షలు నిర్వహించే ఉన్నత సంప్రదాయం మొదలుపెట్టినందుకు చాలా సంతోషం. పత్రికను మరింత పదును పెట్టడానికి ఇలాంటి ప్రయత్నం అవసరం. పత్రికలోని అసహజ మరణాల సూచిలో స్త్రీలపై కొనసాగుతున్న అణచివేతలో భాగంగా జరుగుతున్న హత్యలు, ఆత్మహత్యలను విడిగా ఓ కాలమ్‌లో నమోదు చేయాల్సిన అవసరం ఉంది. అలా నమోదు చేయడం ద్వారా పితృస్వామిక అణచివేత తీవ్రతను అర్థం చేసుకోడానికి దోహదం చేస్తుంది. రిపోర్టర్స్‌తో నిర్వహించిన సమీక్షల్లో కూడా ఈ కోణం ప్రస్తావనకు రాకపోవడం నన్ను నిరుత్సాహపరిచింది. ఇప్పటికైనా ప్రయత్నించగలరని ఆశిస్తున్నాను. పత్రికను తెలుగు సమాజంలో ఉన్నత స్థాయికి తీసుకెళ్లడానికి మీరు చేస్తున్న ప్రయత్నం విజయవంతం అవుతుందని ఆశిస్తున్నాను.

**– ఎ. కొండయ్య**
డిస్ట్రిక్ట్ జైల్, తుమకూరు, కర్ణాటక

మే సంచికలో ప్రచురించిన ప్రత్యేక తెలంగాణపై వరవరరావు, ఎ. భూమయ్య, ఎం. కోదండరాం, ఎన్. వేణుగోపాల్ వ్యాసాలు మార్గదర్శకంగా, అర్థవంతంగా ఉన్నాయి. రిజర్వేషన్ల వర్గీకరణ, మాదిగ సాహిత్యం మొదలగు వ్యాసాలన్నీ చక్కగా ఉన్నాయి. వీక్షణం పాఠకుల సమావేశానికి ఇతర కార్యక్రమాల వల్ల రాలేకపోయాను. రాజకీయార్థిక వ్యవస్థలు పునాది అయినప్పటికీ, 21వ శతాబ్దంలో కూడా మనిషి మెదళ్లను మతతత్వం, కులతత్వం, మూఢ విశ్వాసాలు, ఆచారాలు పట్టి పల్లారుస్తున్నాయి. జాతీయంగా, అంతర్జాతీయంగా ఆ మతోన్మాద దృక్కోణంతో యుద్ధాలు, సంఘర్షణలు, బాంబుపేలుళ్లు, మానవ బాంబులు నేటి మన జీవితంలో నిత్యకృత్యమయ్యాయి. ఈ సంఘటనలు మీడియా బట్టబయలు చేయాల్సిన అవసరం ఉంది. 'వీక్షణం' పత్రికా రంగంలో విలక్షణంగా ఉండాలి. సామాజిక, రాజకీయార్థిక తాత్వికపరంగా ఉండాలి. అది కేవలం ముంబాయి నుంచి వెలువడే 'పొలిటికల్ అండ్ ఎకనమిక్ వీక్లీ'గానే కాకుండా, కోల్‌కతా నుంచి వెలువడుతోన్న 'ఫ్రాంటియర్', ముంబాయి నుంచి వెలువడుతున్న 'కమ్యూనలిజం కంబాట్' పత్రికల పాత్రను పోషించాల్సిన బాధ్యత కూడా ఉంది. కుల, మత, వర్గ సంఘర్షణలను విశ్లేషించేదిగా, మార్గదర్శనం చేసేదిగా ఉండాలి. ఈనాడు మనం బాంబుపేలుళ్ల మోతలో, మానవబాంబుల మారణహోమంలో నివసిస్తున్నాం. ముఖ్యంగా మధ్య ఆసియా, దక్షిణాసియా విముక్తి పోరాటాలను, ఇరాన్ విముక్తి పోరాటం ఏ విధంగా ఇస్లామీయ విముక్తి పోరాటంగా మారింది? అక్కడి అభ్యుదయ, వామపక్షశక్తులు, అయతుల్లా గెరిల్లా శక్తులతో కలిసి ఎందుకు పోరాడాయి? వాటి పర్యవసానం విశ్లేషించే వ్యాసాలు రావాలి.

**– క్రాంతికార్**
లెనిన్‌నగర్, ఖమ్మం

పాఠకుల ఆలోచనా ధోరణులలో మార్పు తీసుకువచ్చే రచనలు చేయడంలో వీక్షణంకు సాటి అయిన పత్రిక వేరేదీ లేదని నిశ్చయం. ఏప్రిల్ సంచికలో ప్రచురించిన 'ఈ ఎన్నికలు ఎవరికోసం' వ్యాసంలో కిరణ్‌గారు చేసిన రచనలో పస, పటుత్వం లోపించినట్లు కనబడుతోంది. ఇలా రచనలు చేసేవారు పత్రికల్లో వచ్చిన సమాచారాన్ని యథాతథంగా సేకరించి రాయకుండా కొంచెం విశ్లేషణలతో రచన చేస్తే బాగుంటుంది. అట్లాగే వీక్షణంలో 'నేటి ప్రపంచీకరణ నేపథ్యంలో మార్క్సిజం' పై విశ్లేషణతో కూడిన వ్యాసాలు ప్రతినెలా ప్రచురిస్తే బాగుంటుందని భావిస్తున్నాను.

**– జి. యాదగిరి**
హైదరాబాద్

స్విస్ బ్యాంకులలో భారతీయుల అక్రమ ఖాతాల గురించి తెలుగులో మొట్టమొదట వెలుగులోకి తెచ్చిన పత్రిక వీక్షణమే. ఆ తరువాత గత రెండు మూడు నెలల్లో అనేక మంది రాజకీయ నాయకులూ, వ్యాఖ్యాతలూ ఈ సమాచారాన్నే వాడుకున్నారు. ఇటువంటి అవసరమైన సమాచారం అందించవలసిందిగా విజ్ఞప్తి. అయితే ఒకే సంచికలోని వేరు వేరు వ్యాసాలలో ఒకే విషయం రిపీట్ అవుతోంది. అటువంటి రిపిటేషన్లు లేకుండా జాగ్రత్త పడండి. వీలైతే ఎడిట్ చేయండి.

**– కె. సుభాషిణి**
కర్నూలు

వీక్షణం రచయితల, అభిమానుల సభ జరిగినట్టు చదివాను. ఇక్కడ – విశాఖ జిల్లా ఎలమంచిలిలో 'అవగాహన' భవనంలో అటువంటి సభ ఒకటి జరగాలని కోరుకుంటున్నాను. అందుకు పూర్తి సహకారం ఇవ్వగలను.

**– డా. మానేపల్లి**
ఎలమంచిలి, విశాఖపట్నం

'వీక్షణం' మే 2009 సంచికలో 'నలభై సంవత్సరాల ప్రత్యేక తెలంగాణ

*(... మిగతా 48వ పేజీలో)*

## పతంజలి కోసం

కె.ఎన్.వై. పతంజలి కనుమరుగై అప్పుడే 90 రోజులు గడిచిపోయాయి. ఈ 90 రోజులు మామూలు రోజులు కావు. ఇప్పుడు తనుంటే అని ఎప్పటికప్పుడు అనుకుంటూనే ఉంటాం. తన ముద్ర స్పష్టంగా ఎప్పటికీ చెరిగిపోకుండా నిలిచే పత్రికా రంగంలో అక్షరాన్ని అనన్య సాధనంగా చేసుకుని విజృంభించిన మార్తాండుడు; తాపంతో పాటు అపారమైన జాలీ, కరుణలతో పాఠకులను అమృతులుగా చేసాడు. 'పతంజలి స్పర్శ సోకిన సందర్భాలెన్నో' కొండంత వాడికి కొండంతలు సమర్పించలేం. కొండ అద్దంలో కొంచెంగానే ఉన్నా, కొండ కొండే – లాంఛనంగా కాదు, కచ్చితంగా; అంతరంగాల్లో చెలరేగిన అలజడికి సమాధానంగా మీరు ఆయనను గురించి రాసిన పంక్తులను పదిలం చేసే ముద్రణాసన్నాహంలో మేమున్నాం. మర్యాద కోసం కాదు. మనసు మళ్లీ మళ్లీ ప్రశ్నించకుండా, సమగ్రంగా ఉండేందుకు ఆయన్నెరిగిన వాళ్లు ఆయన అనుబంధాలను అక్షరాల్లో నింపి పంపండి.

**విశ్వేశ్వరరావు**

**సాహితీ మిత్రులు**
28–10–26, మసీదు ఎదుట
అరండల్‌పేట, కారల్ మార్క్స్ రోడ్
విజయవాడ – 520 002
ఫోన్ : 0866 2433359, సెల్ : 94906 34849

## ఇంటర్మీడియట్ ఫలితాలు

ఈసారి రాష్ట్రవ్యాప్తంగా 8,40,010 మంది విద్యార్థులు ఇంటర్మీడియట్ ద్వితీయ సంవత్సరం పరీక్షలు రాసారు. ఏప్రిల్ 24న ఫలితాలు వెలువడ్డాయి. మొత్తం 60.15 శాతం విద్యార్థులు ఉత్తీర్ణులయ్యారు. పరీక్షలు రాసినవారిలో రెగ్యులర్ విద్యార్థులు 6,60,341 మంది, ప్రైవేట్ విద్యార్థులు 1,79,669 మంది ఉన్నారు. రెగ్యులర్ విద్యార్థుల్లో 3,97,170 మంది ఉత్తీర్ణులయ్యారు. ఫలితాల్లో కృష్ణా జిల్లా 74 శాతంతో అగ్రభాగాన నిలువగా, మహబూబ్‌నగర్ జిల్లా 43 శాతంతో చివరన నిలిచింది. ఉత్తీర్ణులయిన వారిలో బాలికలు 62 శాతం, బాలురు 58 శాతం మంది ఉన్నారు.

## అటవీ భూముల పంపిణీకి తొలిగిన అడ్డంకి

కేంద్ర ప్రభుత్వం తీసుకువచ్చిన అటవీ హక్కుల చట్టం ద్వారా అర్హులైన గిరిజనులకు పట్టాలు పంపిణీ చేయవచ్చునంటూ మే 1న రాష్ట్ర హైకోర్టు ఆదేశాలను జారీచేసింది. చట్టపరమైన అడ్డంకులు తొలిగిపోవడంతో పోడు వ్యవసాయ భూములు, చేపల చెరువులపై గిరిజనులకు వ్యక్తిగతంగా, సామూహికంగా హక్కులు సంక్రమించనున్నాయి. కోర్టు నిర్ణయంతో 1.14 లక్షల క్లయింలలో సుమారు నాలుగు లక్షల ఎకరాలను పంపిణీ చేయడానికి మార్గం సుగమమయింది.

## మండుతున్న బియ్యం ధరలు

రాష్ట్రంలో సాధారణ వరిసాగు విస్తీర్ణం 115.39 లక్షల హెక్టార్లు. 2007-08 లో సాగైన వరి విస్తీర్ణం 119.68 లక్షల హెక్టార్లు కాగా, ఉత్పత్తి అయిన ధాన్యం 198.17 లక్షల టన్నులు. అలాగే 2008-09 లో 123.21 లక్షల హెక్టార్లలో వరిసాగవ్వగా, ఉత్పత్తి అయిన ధాన్యం 204.15 లక్షల టన్నులు. రాష్ట్రంలో సాధారణ ఉత్పత్తి (160.17 లక్షల టన్నులు)కన్నా ఈ దిగుబడులు ఎక్కువే. అయితే బియ్యం పొరుగు రాష్ట్రాల కు అక్రమంగా తరలిపోవడంతో ఇక్కడి ధరలు మండిపోతున్నాయి.

## ఎన్నికల ఫలితాలు

రాష్ట్రంలో 294 శాసనసభ స్థానాలకూ, 42 లోక్‌సభ స్థానాలకూ ఏప్రిల్ 16, 23 తేదీలలో రెండు విడతలుగా ఎన్నికలు జరిగాయి. రాష్ట్రంలో ఈసారి జరిగిన శాసనసభ, లోక్‌సభ ఎన్నికలలో మునుపెన్నడూ లేనివిధంగా 75.5 శాతం పోలింగ్ నమోదయింది. 2004 ఎన్నికలతో పోలిస్తే ఇది 2.5 శాతం ఎక్కువ. మే 16న ఫలితాలు వెలువడ్డాయి. 13వ శాసనసభకు పార్టీల వారీగా గెలిచిన శాసనసభ స్థానాలు : కాంగ్రెస్ - 157 (2004 ఎన్నికలలో 185 సీట్లు); టి.డి.పి.-91 (47); టి.ఆర్.ఎస్. - 10 (26); పి.ఆర్.పి. - 18 (పార్టీ లేదు); బి.జె.పి. - 2 (2); సి.పి.ఐ. - 4 (6); సి.పి.ఎం.-1 (9); లోక్‌సత్తా - 1 (పార్టీ లేదు); ఎం.ఐ.ఎం. - 7 (5); ఇతరులు-3 (14). 15వ లోక్‌సభకు మన రాష్ట్రం నుంచి పార్టీల వారీగా గెలిచిన సీట్లు : కాంగ్రెస్ - 33 (2004 ఎన్నికలలో 29 సీట్లు); టి.డి.పి.-6 (5); టి.ఆర్.ఎస్. - 2 (5); ఎం.ఐ.ఎం. - 1 (1); సి.పి.ఐ. - 0 (1); సి.పి.ఎం. - 0 (1). రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ అధికారంలోకి వచ్చింది. డా. వై.ఎస్. రాజశేఖర రెడ్డి వరుసగా రెండవ సారి ముఖ్యమంత్రిగా ఎన్నికయ్యారు. మే 20న ప్రమాణ స్వీకారం చేశారు.

## పోలేపల్లి సెజ్ బాధితుల ప్రతాపం

మహబూబ్‌నగర్ జిల్లా జడ్చర్ల మండల పరిధిలోని పోలేపల్లి ఫార్మా సెజ్‌లో భూములను కోల్పోయిన పోలేపల్లి రైతులు సరైన పునరావాసం కోసం రెండేళ్లుగా పోరాటం చేస్తున్నారు. ప్రభుత్వం పట్ల నిరసనతో ఈసారి మహబూబ్‌నగర్ పార్లమెంట్‌కు 15 మంది స్వతంత్ర అభ్యర్థులుగా పోటీ చేశారు. ఇటీవల శాసనసభ ఉప ఎన్నికలలో కూడా పోటీ చేశారు. సెజ్ బాధితుల్లో సత్యమ్మ, రంగమ్మ, ఎట్టి చిన్న వెంకయ్య, ఎట్టి లింగయ్య, కందూరు కుర్మయ్య, కర్రె జంగయ్య, గంగాపురి రవీందర్ గౌడ్, గజ్జె నర్సింహులు, ఎం.ఎ. జబ్బార్, దేపల్లి మైసయ్య, దేపల్లి సాయన్న, కందూరు నర్సింహులు, బుడగజంగం లక్ష్మమ్మ, మాల జంగిలమ్మ, సీనయ్యగౌడ్ తదితరులు నామినేషన్లు దాఖలు చేసి బరిలో నిలిచారు. ఏకంగా ఎనభై వేల ఓట్లను సాధించి అధికార పార్టీ అభ్యర్థిని ఓటమిపాలు చేశారు.

## పంటను తగులబెట్టిన రైతు

మెదక్ జిల్లా చిన్న శంకరంపేట మండలం మీర్జాపల్లి తండాకు చెందిన రైతు లంబాడి గంగారాం తన అరెకరంలో సాగుచేస్తున్న వరిపంటను ఏప్రిల్ 24 రాత్రి తగులబెట్టాడు. పొట్ట దశకు వచ్చిన చేనుకు ఆయన నాలుగు వేలకు పైగా పెట్టుబడి పెట్టాడు. ట్రాన్స్‌ఫార్మర్ కాలిపోవడం, ఎన్నిసార్లు విన్నవించుకున్న విద్యుత్ అధికారులు పట్టించుకోకపోవడంతో పదిహేను రోజులుగా నీళ్లందక చేను ఎండిపోయింది. నిరాశతో గంగారాం చేనును తగులబెట్టాడు. గ్రామంలోని వరి పంట వేసిన మిగతా రైతులు కూడా ఎకరానికి పదహారు వేల రూపాయల మేర నష్టపోయారు.

## జలకాలుష్యంతో రాష్ట్రం అతలాకుతలం

రాష్ట్ర రాజధానిలో మంచినీళ్ల కాలుష్యానికి భోలక్‌పూర్ ప్రాంతంలో మే 5-14 మధ్య పధ్నాలుగు మంది చనిపోయారు. ఐదు వందల మందికి పైగా గాంధీ ఆసుపత్రిలో చికిత్స కోసం చేరారు. నగరంలో కలరా వ్యాధిగ్రస్తుల సంఖ్య ముప్ఫైకి చేరింది. హైదరాబాద్‌లో వ్యాధులు ప్రబలడానికి ప్రధాన కారణం నీటి కాలుష్యమేనని మే రెండవ వారంలో నగరంలో పర్యటించిన కోలకతా శాస్త్రవేత్తల బృందం తన ప్రాథమిక అంచనాలో తెలిపింది. కలుషిత నీటిని సేవించినందుకే భోలక్‌పూర్, మౌలాలి ఇతర ప్రాంత వాసులు కలరా, అతిసార ఇతర అనేక వ్యాధుల బారిన పడినట్లు తెలుస్తోంది. కలుషిత నీటితో మెదక్ జిల్లాలో 500 మంది, వరంగల్‌లో 111 మంది, కరీంనగర్‌లో 36 మంది అతిసార వ్యాధికి గురయ్యారు. కలుషిత నీటి వల్ల ఖమ్మం, గుంటూరు, అనంతపురం, శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం, ఆదిలాబాద్ జిల్లాలలో డయేరియా, అతిసార ఇంకా పలు రోగాలతో ప్రజలు అవస్థలు పడుతున్నారు.

వీ

*ఈసారి ఎన్నికల్లో ప్రజలు స్పష్టంగా సంక్షేమానికి ఓటు వేసారని, గెలిచిన, ఓడిన పక్షం సంక్షేమాన్ని ఒక ఎత్తుగడగా కాకుండా నిజాయితీతో అమలు చేసేందుకు కృషిచేయాలని అంటున్నారు* **జి. హరగోపాల్**

# రాష్ట్రంలో ఎన్నికల ఫలితాలు - తీరు తెన్నులు

ఎన్నికల విశ్లేషణ మనకు పైకి కనిపించినంత, మీడియా చేసినంత సులభంగా ఉండదు. ముఖ్యంగా మీడియా ఈ మధ్యకాలంలో తమకు తోచినట్టుగా లేదా తమ అవసరాలను బట్టి అభిప్రాయాలను చెపుతున్నది తప్పించి మొత్తంగా ప్రజాస్వామ్యంలో తమ బాధ్యతాయుతమైన పాత్రను నిర్వహించడంలేదు. దీనికి ప్రధాన కారణం మీడియాలోకి వచ్చిన పెట్టుబడి చాలా వరకు ఉత్పత్తి రంగం నుండి అంటే క్రియాత్మక రంగం నుండి వచ్చింది కాదు. ఇది ప్రధానంగా రియల్ ఎస్టేట్, ఫైనాన్స్, సినిమా, సారా, భూ ఆక్రమణలు అంటే ఒకరకంగా లంపెన్ రంగాల నుండి చాలా వరకు వచ్చింది. ఇలాంటి పెట్టుబడి ప్రజాస్వామ్య ప్రమాణాలకు కట్టుబడి, ఉన్నతమైన విలువలను సమాజంలో ప్రోత్సహించదు. దానికి ఆ స్వభావం ఉండదు. ఎక్కడైనా ప్రజాస్వామ్య సంస్కృతి చూచాయగా అగుపిస్తే అది మీడియాలో ఉండే కొందరు వ్యక్తుల నిజాయితీ వలన, లేదా పెట్టుబడిదారులు తమ వ్యాపారానికి హాని లేదని భావించడం వలనే కాని, మీడియా పునాదుల్లో లోతైన విలువల పట్ల విశ్వాసం ఉండబట్టికాదు. ప్రజాజీవనంతో ముడిపడి లేకపోవడం వలన ప్రజల నాడిని మీడియా పట్టుకోలేకపోతున్నది. అందుకే ఎన్నికల మీద మీడియా వెలిబుచ్చే అభిప్రాయాలకు, అంతిమ ఫలితాలకు చాలా తేడా ఉంటున్నది. చాలామంది భావించినట్లు మీడియా ఎన్నికల ప్రక్రియని కాని, ప్రజాభిప్రాయాన్ని కాని గుణాత్మకంగా ప్రభావితం చేయలేకపోతున్నది. ఈ మొత్తం ప్రక్రియలో విభిన్న కారణాల వలన మన రాష్ట్రంలో మీడియా అధికార పార్టీకి వ్యతిరేకంగా ఉన్నది. కారణం ఏదైనా ప్రజాస్వామ్య ప్రక్రియకి దీనివలన కొంత కాకున్నా కొంత మేలు జరుగుతోంది.

2009 ఎన్నికల ఫలితాలు మీడియా ప్రచారం చేసిన ప్రకారం రాలేదు. మీడియా అధికార పార్టీ కన్నా ప్రతిపక్షాలకే ఎక్కువ మద్దతు ఇచ్చింది. ముఖ్యంగా ప్రజారాజ్యం పార్టీకి, పార్టీ పెట్టక ముందు ఇచ్చిన ప్రచారం, తీరా పార్టీ పెట్టాక ఇవ్వలేదు. మొత్తంగా రాష్ట్రంలోని మూడు నాలుగు బలమైన కులాల లేక సామాజిక వర్గాల చుట్టూ ఎన్నికలు తిరిగాయి. స్వాతంత్ర్యానంతరం కమ్యూనిస్టు పార్టీ రెండవ సార్వత్రిక ఎన్నికలలో దెబ్బతిన్న తర్వాత దాదాపు మూడు దశాబ్దాలు అంటే 1983 దాకా కాంగ్రెస్ పార్టీ అవిచ్ఛిన్నంగా అధికారాన్ని చలాయించింది. ఆ సంవత్సరం కోస్తా ఆంధ్రలో బలమైన సామాజికవర్గం మొదటిసారి అప్పటి దాకా అధికారాన్ని చలాయించిన వర్గాన్ని దాదాపు కూలదోస్తూ అధికారంలోకి వచ్చింది. ఆ తర్వాత ఈ రెండు బలమైన సామాజిక వర్గాల మధ్య అధికారంలో వాటా కొరకు పోటాపోటీ జరుగుతోంది. 2008లో మరో సామాజిక వర్గం అధికారంలో తన వాటాను డిమాండ్ చేస్తూ ముందుకు వచ్చింది. అపుడు ఈ వర్గం మీడియాలో బలంగా లేకపోవడం ఒక కారణమైతే, ప్రాంతాల వారీగా విస్తృతి లేకపోవడంతో బలమైన రెండు సామాజిక వర్గాల అధికారాన్ని దెబ్బతీయలేకపోయింది. ఆ కారణం వల్లే ప్రజారాజ్యం ముందుకు తీసుకొచ్చిన మూడవ ప్రత్యామ్నాయం నిలదొక్కుకోలేకపోయింది.

రాష్ట్రంలో మూడు బలమైన సామాజిక వర్గాల మధ్య అధికార పోటీలో అత్యధిక సంఖ్యలో ఉన్న దళితులు, వెనుకబడిన తరగతులు చిక్కుకుపోయాయి. ఈ బలహీనవర్గాలు అధికారంలో తమ వాటా గురించిన ప్రశ్నను ముందుకు తీసుకవచ్చినా, వాళ్ల తరపున మాట్లాడే వాళ్లు, వాదించే వాళ్లు, ఉద్యమించే వాళ్లు ఉన్నా ఎన్నికల రాజకీయాలను ప్రభావితం చేయలేకపోయారు. కొత్తగా ఎదుగుతున్న ఈ సామాజికవర్గాల మధ్య చాలా వైవిధ్యం, వైరుధ్యాలు ఉండడం వలన వాళ్లందరినీ ఏకత్రాటి మీదికి తీసుకరాలేకపోతున్నారు. వీళ్లందరినీ ఒక రాజకీయ శక్తి కింద మార్చాలంటే కుల ప్రాతిపదికన ఏర్పడ్డ అస్తిత్వ రాజకీయాలు ఆ పరిధిని దాటి విశాలమైన అణగారిన ప్రజల ప్రయోజనాల పునాది మీద ఏర్పడాలి. ఈ చారిత్రక పరిణామం పరిణతి చెందడానికి ఇంకా కొంత కాలం పట్టేలా ఉంది. ఈ క్రమంలో దళితులు చీలినట్లుగా వెనుకబడిన తరగతులు నిలువునా చీలకుండా చూడగలగాలి. ఇప్పుడు వెనుకబడిన తరగతులు పైన చెప్పిన మూడు సామాజిక వర్గాల సమీకరణలు తమ తమ ప్రయోజనాలను బట్టి భాగస్వాములైనారు.

ఈ మొత్తం ప్రక్రియలో గత దశాబ్దకాలంలో ముందుకు వచ్చిన మరో రాజకీయ శక్తి - ప్రత్యేక తెలంగాణ ఉద్యమం. తెలంగాణలోని మరొక బలమైన సామాజిక వర్గం నాయకత్వాన్ని వహిస్తున్న ఈ ఉద్యమానికి చాలా విస్తృతమైన సామాజిక మద్దతు ఉంది. కాని గత ఎనిమిది, పదేళ్లుగా భౌగోళిక తెలంగాణ, ప్రజాస్వామ్య తెలంగాణ మధ్యన ఒక నిరంతర ఘర్షణ కొనసాగుతోంది. తెలంగాణ కుండే ప్రత్యేక ప్రజాస్వామ్య వారసత్వం వలన అస్తిత్వ రాజకీయాలు ప్రజాస్వామ్య ఆకాంక్షలు మిళితమై, తెలంగాణ కావాలి అంటూనే ఎలాంటి తెలంగాణ అనే ప్రశ్న కూడా ముందుకు వచ్చింది. తెలంగాణ రాష్ట్ర సమితి ఈ చారిత్రక అంశానికి సరిగ్గా స్పందించలేకపోయింది. ప్రజలను

నిరంతరంగా సమీకరించ లేకపోవడం వలన, ఉద్యమ రాజకీయాలను కొనసాగించే బదులు లాబియింగ్ రాజకీయాల మీద ఆధారపడి, తెలంగాణ ఆకాంక్షను ఎన్నికల రాజకీయాలకే కుదించడం వలన, ఈ ఎన్నికల్లో తీవ్ర నష్టానికి గురయ్యింది.

ఒక్క తెలంగాణ రాష్ట్ర సమితి తప్పించి మిగతా మూడు పార్టీలు ఏదో మేరకు ప్రజల సంక్షేమ కార్యక్రమాల గురించి ప్రచారం చేసాయి. మూడు పార్టీల ఎన్నికల ప్రణాళికల్లో భిన్న అంశాలు చేర్చినా ఎన్నికల ప్రచారంలో సంక్షేమాన్ని గురించే ఎక్కువగా మాట్లాడాయి. కాంగ్రెస్ పార్టీ తొమ్మిదిగంటల విద్యుత్తు, 30 కిలోల బియ్యంతో పాటు ఈ ఐదేళ్ల కాలంలో చేపట్టిన అన్ని సంక్షేమ కార్యక్రమాలను కొనసాగిస్తామని ప్రచారం చేసింది. ఈ ప్రచారాన్ని ఎదుర్కొనడానికి తెలుగుదేశం పార్టీ చివరి క్షణంలో కలర్ టివి, నగదు బదిలీ పథకాన్ని విస్తృతంగా ప్రచారం చేసింది. ప్రజారాజ్యం పార్టీ వంద రూపాయలకు వంట సరకులు అనే నినాదాన్ని ప్రచారం చేసింది. ఇవన్నీ ప్రజలకు ముఖ్యంగా పేద ప్రజలకు అవసరమే. అధికారంలోకి వచ్చిన పార్టీ అన్ని పార్టీల నినాదాలని అమలు చేయగలిగితే మంచిదే. ప్రజలకు విద్యుత్ కావాలి, ఆహారం కావాలి, కొనుగోలు శక్తి కావాలి, ఇల్లు నడవడానికి నిత్యావసరాలు కావాలి. అన్నిటితోబాటు కలర్ టివి కూడా ఉంటే మంచిదే. శాస్త్రీయ విజ్ఞానం సాధించిన అన్ని సౌకర్యాలు సామాన్య ప్రజలకు అందుబాటులోకి రావాలి. జీవనం సాఫీగా సాగాలి. ఆకలి లేకుండా గౌరవప్రదంగా జీవించగలగాలి. ఇది మొత్తం వ్యవస్థ మౌలికంగా మారితే తప్ప సాధ్యం కాదు. అయితే వీటన్నింటిని మార్పులో భాగంగా చూడాలి. మార్పు దిశను ప్రజలు స్పష్టంగా చూడగలగాలి. ఆ స్పష్టత ప్రజల అవగాహనలో సమగ్రంగా లేకపోవడం వల్లే పాలకులు తాత్కాలిక ఉపశమనాన్ని కలిగిస్తామంటే దానికి స్పందిస్తున్నారు. అయితే ఈ మాత్రం ప్రయోజనాలు పొందడానికి కూడా చాలా ఉద్యమాలే చేసారు. చాలా త్యాగాలే చేసారు.

ఎన్నికల ప్రక్రియలో ఏ పార్టీకి కాస్త ఎక్కువ సంఖ్యలో మద్దతు పలుకుతున్నారు అన్న అంశాన్ని పరిశీలించాలి. మన రాష్ట్ర రాజకీయాల్లో ప్రజలు నెహ్రూ రాజకీయాలకీ, తర్వాత ఇందిరాగాంధీ రాజకీయాలకీ పట్టం కట్టారు. ఇందిరాగాంధీ 1980లో రెండవ దఫా ఎన్నికల్లో గెలిచిన తర్వాత బలమైన ఆర్థిక శక్తులదాడి వలన సంక్షేమ రాజకీయాలకు స్వస్తి పలికారు. 1970లో ఇందిరాగాంధీ ప్రచారం చేసిన, కొంతవరకు అమలుచేసిన పేదప్రజల ఉపశమన కార్యక్రమాలకి 1980లోని ఇందిరాగాంధీ మాట్లాడిన ఏక్తా, అఖండతా అంటే దేశ సమైక్యత, సమగ్రతకు ఏమీ పొంతనలేదు. మొదటి అవతారంలో పెట్టుబడికి, శ్రమకి మధ్య రాజీ రాజకీయాలు నడిపిన ఇందిరాగాంధీ, రెండవ అవతారంలో సంపన్నుల ఇందిరాగాంధీ అయిపోయింది. కాళోజీ అన్నట్లు ఉగ్ర నరసింహుడు, లక్ష్మీ నరసింహుడు అయినట్లు. ఆ దశలో తెలుగుదేశం పార్టీ సంక్షేమ కార్యక్రమాలు మాట్లాడుతూ రెండు రూపాయల కిలో బియ్యం అనే పథకం ద్వారా రాజకీయాల్లోకి ప్రవేశించింది. సంక్షేమ కార్యక్రమాల చట్రంలో ఇరుక్కున్న ప్రజలు తెలుగుదేశం పార్టీకి అధికారాన్ని కట్టబెట్టారు.

తెలుగుదేశం పార్టీ రెండు రూపాయల కిలో బియ్యం ఒకవైపు ఇస్తూనే, సారా వ్యాపారాన్ని ప్రోత్సహించింది. అంటే ఒక చేయితో సంక్షేమాన్ని ఇచ్చిన పార్టీ మరో చేయితో ఆ ప్రయోజనాన్ని విఫలం చేసింది. తెలుగుదేశం పార్టీ పరిపాలించిన మొదటి ఐదు సంవత్సరాలలో ప్రజలు ఒకవైపు ఎన్.టి.ఆర్.ను అభిమానిస్తూనే, తమ జీవన ప్రమాణాలు పడిపోతున్న వైనాన్ని గుర్తించారు. ముఖ్యంగా మహిళలు ఈ వాస్తవాన్ని తమ అనుభవం ద్వారా అవగాహన చేసుకోవడంతో సారా వ్యతిరేకత, జీవన ప్రమాణాలు పడిపోతున్నవన్న వేదన ఎన్.టి.ఆర్.ను అధికారంలో నుండి దించేసాయి.

ఆ తర్వాత అధికారంలోకి వచ్చిన కాంగ్రెస్ పార్టీ రాజకీయ చదరంగంలో అందెవేసిన చేయి కావడంతో, రెండు రూపాయల బియ్యం పథకాన్ని దెబ్బతీస్తూ, సారా వ్యాపారాన్ని మరింత ప్రోత్సహించింది. ఈ దెబ్బతో 1989-94 మధ్య ప్రజలు చితికిపోయారు. ఈ పరిణామం భిన్నమైన ఉద్యమాలకు దారితీసింది. ఇందులో చారిత్రాత్మకమైన సారా వ్యతిరేకోద్యమం ఒకటి. ఈ ఉద్యమం మహిళలు ముందుండి నడిపారు. దీనికి అన్ని ప్రజాస్వామ్య శక్తులు మద్దతునిచ్చాయి. కొత్త ప్రజాస్వామిక గొంతులు ముందుకు వచ్చాయి. ఈ మొత్తం ప్రక్రియ స్ఫూర్తిని గ్రహించిన తెలుగుదేశం పార్టీ 1994 ఎన్నికల్లో రెండు రూపాయల కిలో బియ్యం, మద్య నిషేధం అనే రెండు నినాదాలని చేపట్టడంతో తెలుగుదేశం పార్టీ ఘన విజయాన్ని సాధించింది. ఆ విజయోత్సవ సభలో, భూస్వామ్య సంస్కృతిలో మాటకు కట్టుబడి ఉండాలి అనే స్పృహ ఉన్న ఎన్.టి.ఆర్. సంపూర్ణ మద్యనిషేధ నిర్ణయాన్ని ప్రకటించారు. మద్య నిషేధం, రెండు రూపాయల కిలో బియ్యం పథకాలకి పైకి కనిపించిన ప్రజల ప్రయోజనం కన్న, బలీయమైన సామాజిక, ఆర్థిక శక్తుల పునాదిని కదిలించగల సత్తా ఉంది. ఎన్.టి.ఆర్.కు తన ప్రయోజనాలు తెలిసినంత స్పష్టంగా, తన వర్గ ప్రయోజనాలు తెలియవు. ఫ్యూడల్ మనస్తత్వం వలన ఇతరులు చెప్పే మాటలు అంత సులభంగా వినేవాడు కాదు. అలా అని పేద ప్రజల ప్రయోజనాల పట్ల, సామాజిక మార్పుకు పోరాడే ఉద్యమాల పట్ల ప్రజాస్వామిక అవగాహన ఉన్నవాడేమీ కాదు. తమ ప్రయోజనాలు కాపాడతాడనుకున్న నాయకుడే తమకు సమస్యై కూర్చున్నాడు. పాలక వర్గాలకు ఎన్.టి.ఆర్. ఒక పరిష్కార మార్గం, ఒక సంక్లిష్టమైన సమస్యై కూర్చున్నాడు. తమ సంక్షోభం నుండి బయట పడడానికి ఎన్.టి.ఆర్.ను పదవి నుండి తప్పించడం తప్ప వేరే మార్గం తెలియని ఆర్థిక, సామాజిక శక్తులు ఎన్.టి.ఆర్. సింహాసనాన్ని కూలదోసాయి. వెనకటికి విఠలాచారి సినిమాలో వలె రాజసౌధ రాజకీయాలు చోటు చేసుకుని స్వయాన ఎన్.టి.ఆర్. పిల్లనిచ్చిన అల్లుడ్నే అధికార పీఠం మీద కూర్చోబెట్టారు. దీనికి ఎన్.టి.ఆర్. కుటుంబ సభ్యులంతా మద్దతు ఇచ్చారు. రాత్రికి రాత్రి ఎన్.టి.ఆర్. సింహాసనం ఎగ్జిక్యూటివ్ కుర్చీగా మారిపోయింది.

చంద్రబాబునాయుడు అధికారంలోకి రావడానికి తోడ్పడిన లంపెన్ వర్గం ఇపుడు చాలా బలమైన వర్గం. వాళ్లకు సమాజంలో సంఖ్యా బలం చాలా తక్కువ. వాళ్లు జనాకర్షణ ఉన్నవాళ్లు కాదు. జనాన్ని సమీకరించే శక్తి ఉండదు. ప్రజలు అంటే వాళ్లకు అసహ్యం తప్ప మరే దృష్టి లేదు. ప్రజలంటే ఏ మాత్రం పట్టింపు లేని చంద్రబాబు అధికారంలోకి వచ్చాడు. ఎన్నికల రాజకీయాలలో ఇలాంటి ప్రతినిధి పుట్టడం కొంత విచిత్రమే. ఇలా ప్రజల్లో ఏమాత్రం వేళ్లు(రూట్స్) లేని

నాయకులంటే ప్రపంచబ్యాంక్‌కి, సామ్రాజ్యవాదానికి చాలా మక్కువ. ఆ కారణం వల్లే మన్మోహన్ సింగ్, అహ్లువాలియా, చిదంబరం, కమల్‌నాథ్ లాంటి చిహ్నాలకు వాళ్ల మద్దతు ఎప్పుడూ ఉంటుంది. నిజానికి ఆధునిక రాజకీయాల్లో ప్రజల్లో బలం లేకుండా రాజకీయ నాయకుల వలె చలామణి అయ్యే వారంటే ప్రపంచీకరణ శక్తులకు చాలా ఇష్టం. ఈ రాజకీయాలలో నుండి ఆవిర్భవించిన చంద్రబాబు నాయుడికి రాష్ట్ర స్థాయిలో, జాతీయ స్థాయిలో, అంతర్జాతీయ స్థాయిలో మీడియా విపరీత ప్రచారాన్ని కల్పించింది. చంద్రబాబు నాయుడి ఇమేజ్‌ని ఎంత పెంచిందంటే దేశంలో చాలా ప్రాంతాలలో ఆయన ప్రధానమంత్రి కావాలని కోరే అంత ఎత్తుకు తీసుకెళ్లారు. ఈ ప్రచార ప్రభంజనంలో కాంగ్రెస్ పార్టీ బిత్తరపోయింది. దీంతో 1999 ఎన్నికల్లో చంద్రబాబు గెలిచాడు. ఈ తొమ్మిది సంవత్సరాల పాలన ఆంధ్ర రాష్ట్ర రాజకీయాలలో ఒక విషాదఘట్టం. ప్రజలకు ఏ సంక్షేమం అందని కాలమిది. వ్యవసాయరంగం నిలువునా కూలి వేలమంది రైతులు ఆత్మహత్యలకు పాల్పడ్డ కాలమిది. నక్సలైట్ల ఉద్యమంతో చర్చల ప్రస్తావన వచ్చిన దశలో దానికి సిద్ధపడిన అగ్ర నాయకులను అంతమొందించిన కాలమిది. అసాంఘిక శక్తులను ప్రేరేపించి పౌరహక్కుల నాయకులను అత్యంత భయానకంగా చంపించిన పాలనా కాలమిది. ఈ నేపథ్యాన్ని ఇప్పుడు ప్రస్తావించడం అంత సముచితంగా అనిపించక పోవచ్చు కాని ఈ పాలనా అనుభవం ప్రజలు పూర్తిగా మరచిపోయినట్లు లేదు. మనమంతా ప్రజల జ్ఞాపకశక్తి మీద అనుమానాలున్న వాళ్లమే. ఎన్నికల ఫలితాలు చూస్తే ప్రజల జ్ఞాపకశక్తి పెరిగినట్లుంది. ఇది ఒక రకంగా రాజకీయ పరిణతే. ఈ చారిత్రక నేపథ్యంలో 2009 ఎన్నికల ఫలితాలను విశ్లేషించుకోవాలి.

గత ఐదేళ్ల పాలనలో పైన పేర్కొన్న పాలనా సంస్కృతి గుణాత్మకంగా మారిందనుకుంటే పొరపాటే. బాలగోపాల్ ఆంధ్రజ్యోతిలో రాసిన 'అదే పాలన – అదే విధ్వంసం'లో ఈ ఐదేళ్ల పాలనా సారాంశాన్ని చాలా స్పష్టంగా, లోతుగా విశ్లేషించారు. అంతేకాక మళ్లీ కాంగ్రెస్ పార్టీని గెలిపించి ప్రజలు తప్పు చేసారనే ఒక సాహసమైన వ్యాఖ్యానం చేసారు. ఆ మాట బాలగోపాల్ అనగలరు. అయితే ప్రజలు తక్కువ సంఖ్యలో ఓట్లు వేసినా పాలక పార్టీ మళ్లీ గెలిచింది. ఇప్పుడు మనం చేయవలసిందల్లా తెలుగుదేశం పార్టీకి, కాంగ్రెస్‌కు మధ్యన జరిగిన పోటీలో తెలుగుదేశం పార్టీ ఓడిపోయింది. అది ఎలా జరిగిందన్నది ప్రధానమైన ప్రశ్న. గత ముప్ఫై సంవత్సరాలుగా ఏ పార్టీనీ, ఏ నాయకుడినీ రెండవసారి ఎన్నుకోలేదు. ఇది చంద్రబాబు నాయుడి విషయంలో కూడా వరిస్తుంది. నిజానికి 1994లో ఎన్.టి.ఆర్. తెలుగుదేశం గెలిచింది. 1999లో మొదటిసారి చంద్రబాబు నాయుడి తెలుగుదేశం గెలిచింది. అంటే ప్రజలు చంద్రబాబు నాయుడిని ఒకేసారి గెలిపించారు. ఈ ప్రక్రియలో తెలంగాణ రాష్ట్ర సమితి, వామపక్ష పార్టీలు కూడా ఎందుకు దెబ్బ తిన్నాయో అనే అంశాన్ని కూడా విశ్లేషించాలి. ఈ ప్రశ్నకు హెచ్.ఎం.టి.వి చేసిన ఒక సర్వేలో కొన్ని కారణాలు బయటికి వచ్చాయి. క్లుప్తంగా ఇక్కడ వాటి ప్రస్తావన కొంతవరకు ఉపయోగకరంగా ఉంటుంది.

ఈ ఎన్నికలలో ఎవరికి ఓటు వేస్తారని అడిగినప్పుడు 41.6 శాతం కాంగ్రెస్‌కు, 27.4 శాతం టిడిపి కి, 19.4 శాతం ప్రజారాజ్యానికి, 2.9 శాతం టిఆర్ఎస్ కి, 1.2 శాతం వామపక్ష పార్టీలకి, 2.4 శాతం లోక్‌సత్తాకు వేస్తామని చెప్పారు. ఈ ధోరణి అన్ని వర్గాల్లో, వృత్తుల్లో అగుపిస్తున్నది. ప్రాంతాల వారీగా మాత్రమే కొంత తేడా ఉన్నది. ఈ అభిప్రాయం మార్చ్ నెల చివరి ప్రాంతంలో వ్యక్తీకరించినా, అది ఎన్నికల దాకా కొనసాగినట్టుగా అగుపిస్తున్నది. కాంగ్రెస్ పార్టీ పట్ల సుముఖంగా ఉండడానికి ప్రధాన కారణం ఆ పార్టీ అమలు చేసిన పథకాలు; ప్రభుత్వ పథకాల ద్వారా ప్రయోజనం పొందారా అని అడిగితే దాదాపు 52 శాతం తమకు ప్రత్యక్షంగానో పరోక్షంగానో ప్రయోజనం కలిగిందని అన్ని సెక్షన్ల ప్రజలు అన్నారు. ఇది అన్ని ప్రాంతాల వారు అన్నారు. ఒక్క గ్రేటర్ హైదరాబాద్ మినహా మిగతా ప్రాంతాల్లో ఒకే రకమైన ధోరణి ఉన్నది. ప్రత్యేకంగా ఉత్తర, దక్షిణ తెలంగాణ ప్రాంతాల్లో కూడా దాదాపు 60 శాతం మంది తమకు ప్రయోజనం కలిగిందని అన్నారు. సంక్షేమ పథకాల వల్ల ప్రయోజనం పొందిన వారిలో 52.4 శాతం కాంగ్రెస్ పార్టీకే ఓటు వేస్తామని స్పష్టంగా చెప్పారు. సంక్షేమ పథకాలు అందని వారిలో దాదాపు 26 శాతం కాంగ్రెస్‌కు ఓటు వేస్తామని అన్నారు. అంటే ప్రయోజనాలు పొందని వారు కూడా తర్వాతైనా తమకు కొంత ఈ పథకాల వల్ల ప్రయోజనం ఉంటుందనే ఆశిస్తున్నారు.

మహాకూటమి ఎందుకు ఏర్పడిందన్న ప్రశ్నకు సమాధానంగా కాంగ్రెస్‌పై కోపం అని 29 శాతం జవాబిస్తే, 43 శాతం అధికారం కొరకు అని భావించారు. చంద్రబాబు హామీలను ప్రజలు నమ్ముతున్నారా అన్న ప్రశ్నకు 32 శాతం మాత్రమే నమ్ముతున్నామని అన్నారు. నిజానికి చిరంజీవి హామీల పట్ల 35 శాతం నమ్మకమున్నదని అన్నారు. ప్రభుత్వ పనితీరు గురించి అడిగిన ప్రశ్నకు 13 శాతం చాలా బాగుందని, 24 శాతం బాగుందని, 32 శాతం ఫర్వాలేదు అని అన్నారు. అంటే దాదాపు 70 శాతం మంది కాంగ్రెస్ పార్టీ పట్ల కొంత సంతృప్తిగా ఉన్నారన్న అంశాన్ని గమనించాలి. ఈ సంతృప్తి అంతకుముందు జరిగిన పాలనతో పోల్చి అంటున్నారని కూడా అవగాహన చేసుకోవాలి. తెలుగుదేశం పాలన కన్న కాంగ్రెస్ పాలన మెరుగు అని ఎక్కువ మంది భావించారు. ముఖ్యమంత్రి ఎవరుంటే బాగుంటుందని అడిగితే 42 శాతం రాజశేఖరరెడ్డి వైపు మొగ్గు చూపించారు.

ఎన్నికల్లో ఓటు వేసేటప్పుడు పార్టీకి వేస్తారా లేక అభ్యర్థిని బట్టి వేస్తారా అన్న ప్రశ్నకు దాదాపు సగం మంది అభ్యర్థిని బట్టి వేస్తామని అన్నారు. అభ్యర్థిని బట్టి ఓటు వేయడమనేది ఒకరకంగా ఆ పార్టీ రాజకీయాల పరిమితిని సూచిస్తుంది. అందుకే ఉప ఎన్నికలలో తెరాస పాల్గొన్నప్పుడు తెలంగాణ అనే అంశం ప్రధానమైనప్పటికి కొందరు అభ్యర్థులు గెలిచారు, కొందరు ఓడారు.

ఈ మొత్తం సర్వేలో ప్రజాభిప్రాయం కాంగ్రెస్‌వైపు మొగ్గు చూపినా, ఈ పార్టీ తెలంగాణ పట్ల మోసపూరిత వైఖరి తీసుకుందని తెలంగాణలో అత్యధిక సంఖ్యలో ప్రజలు భావిస్తున్నారు.

మొత్తం మీద ఈ విశ్లేషణలో ప్రజలు సంక్షేమ రాజకీయాలకు, అధికారంలో ఉన్న పార్టీకి మద్దతు పలికారు. ప్రతిపక్ష పార్టీలు చేసిన వాగ్దానాలు ప్రజల విశ్వాసాన్ని పొందలేక పోయాయి. విశ్వసనీయతను తెలుగుదేశం పార్టీ కోల్పోవడానికి తాము అధికారంలో ఉన్నప్పుడు ప్రజా

సంక్షేమాన్ని విస్మరించిందన్న వాస్తవాన్ని గణనలోకి తీసుకోవాలి. ప్రజలు తమ గత అనుభవాన్ని మరవలేదు. నిజానికి ప్రపంచబ్యాంక్ తెలుగు ప్రజల మీద రుద్దిన అభివృద్ధి నమూనాని ప్రజలు ఎంత పెద్ద ఎత్తున తిరస్కరించారో ఈ సర్వేలో స్పష్టమైంది. ఆ మనోగతం ఎన్నికల ఫలితాలలో మరింత స్పష్టంగా వ్యక్తీకరింపబడింది.

2004లో ఎన్నికైన కాంగ్రెస్‌పార్టీ అభివృద్ధి నమూనాని సమూలంగా ఏం మార్చలేదు. పాలనా సంస్కృతినేమి సంస్కరించలేదు. వ్యవస్థల విధ్వంసం, విలువల దిగజారుడు మరింత వేగంగానే జరిగింది. ప్రజాస్వామ్య వ్యవస్థ చాలా బలహీనపడింది. పాలన 'ఒకే ఒక్కడి' చుట్టు తిరిగింది. అధికార దుర్వినియోగం, అహంభావం, అహంకారం పాలనలో ఎక్కువ పాళ్లలోనే ఉంది. అవినీతి ఐదేళ్లలో తీవ్రస్థాయికి చేరుకుంది. వరవరరావు తన ఆంధ్రజ్యోతి వ్యాసంలో పేర్కొన్నట్లు ఫ్యాక్షనిజం రాష్ట్రీకరణ చెంది, మోసం ప్రభుత్వీకరణ చెందింది. నక్సలైట్లతో చర్చల విషయంలో కాని, వర్గీకరణ సమస్య మీద కాని, తెలంగాణ పట్ల కాని కాంగ్రెస్ ప్రవర్తించిన తీరు చాలా అన్యాయమైంది. ఒకవైపు తెలంగాణ ఉద్యమం సజీవంగా ఉన్నా హైదర్‌బాద్‌ను గ్రేటర్ హైదరాబాద్‌గా మార్చారు. హైదరాబాద్‌లో పేదవాళ్ల నివాసాలు తొలిగించి భూమిని అమ్మడం ప్రారంభించారు. తెలంగాణలో అత్యధిక ప్రత్యేక ఆర్థిక మండలాలను స్థాపించారు. ఈ ఐదేళ్ల పాలనలో ఆదిలాబాద్ గోండులకు కాని, మహబూబ్‌నగర్ చెంచులకు కాని, శ్రీకాకుళం గిరిజనులకు కాని కనీసం మంచినీళ్లు, ఆరోగ్య సౌకర్యం అందలేదు. మహబూబ్‌నగర్ పట్టణంలో వారానికి ఒకసారి మంచినీళ్లు సరఫరా చేస్తున్నారు. ఇన్ని సమస్యలున్నా ఏ సమస్య మీద కూడ ప్రతిపక్ష పార్టీలు ఉద్యమాలు చేపట్టలేదు. ఈ విషయంలో తెలంగాణ రాష్ట్ర సమితి ఏ సమస్య మీద కూడా ప్రజలను సమీకరింప ప్రయత్నించలేదు. తెలంగాణ అంటే ప్రజలు, ప్రజల జీవన్మరణ సమస్యలుగా చూడకుండా దాన్నొక బ్రహ్మపదార్థంగా మార్చారు. తెరాస అభ్యర్థులు కొందరు గెలవడానికైనా తెరాస కంటె ప్రజాసంఘాలు, విద్యావంతులు, రచయితలు, కళాకారులు ప్రజల పట్ల నిజాయితీగా నిలబడడం వలన గెలిచారు.

ఈ మొత్తం ఎన్నికల్లో చాలా నష్టపోయింది వామపక్ష పార్టీలు. ఈ విషయంలో రాష్ట్ర స్థాయిలో, జాతీయ స్థాయిలో ఒకే ధోరణి కనిపించింది. ఎన్నికల ఫలితాల తర్వాత రాఘవులు ఈ ఓటమి వెనుక అంతర్జాతీయ సామ్రాజ్యవాదుల కుట్ర ఉందని అన్నారు. ఆయన ఈ అంశాన్ని ఏ అర్థంలో అన్నారో కాని, ఇది చాలా వాస్తవం. అంతర్జాతీయ ప్రపంచీకరణ శక్తుల పరోక్ష ప్రభావం ఎన్నికల మీద చాలా ఉంది. అయితే ఇది ఎక్కడా స్పష్టంగా కనిపించదు. దానికి ఆధారాలు సాక్ష్యాలు చూపించడం కష్టం. కాని ఎన్నికల ఫలితాలలో దాన్ని చూడవచ్చు. గత ఐదేళ్లుగా వామపక్ష పార్టీలు నిర్వహించిన పాత్ర ప్రశంసనీయమైనదే. ఆర్థిక సంస్కరణలను ఏదో ఒక మేరకు అడ్డుకున్నారు. దేశం అంతర్జాతీయ ఆర్థిక సంక్షోభంలో పూర్తిగా చిక్కుకోకుండా ఆపగలిగారు. అణు ఒప్పందాన్ని వ్యతిరేకించి ఆ అంశాన్ని ప్రజా చైతన్యంలోకి కొంతైనా తీసుక రాగలిగారు. నిజానికి తాము ఓడి కాంగ్రెస్ పార్టీని కాపాడారు. అయితే ఈ సమస్యలన్నింటి మీద, తెరాస పార్టీలాగే ప్రజలను సమీకరించలేదు. తాము అధికారంలో ఉన్న పశ్చిమ బెంగాల్‌లో నయా ఉదారవాదాన్ని చిత్తశుద్ధితో వ్యతిరేకించడానికి బదులు కొన్ని ఆర్థిక సంస్కరణలను ఆహ్వానించారు. ఒక్క నందిగ్రామ్, సింగూర్ అంశాలు పార్టీ ఈ ఐదేళ్లు చేసిన కృషిని నిరర్థకం చేసాయి. మన రాష్ట్రంలో వామపక్ష పార్టీలు పేదల ఇళ్ల స్థలాలకు, ప్రత్యేక ఆర్థిక మండలాలకు వ్యతిరేకంగా ఉద్యమించాయి. కాని పశ్చిమ బెంగాల్ ప్రయోగాలు మన రాష్ట్రంలో వామపక్ష పార్టీలకు చాలా విఘాతం కలిగించాయి. మార్క్సిస్ట్ అవగాహన ఉండే పార్టీలకు చారిత్రక స్పృహ, గతితార్కిక అవగాహన, దీర్ఘకాలిక ప్రణాళిక ఉండాలి. ఒక ఎన్నికలో ఎన్ని సీట్లు గెలుస్తామన్నది ప్రమాణం కాకూడదు. కాని ఎన్నికలలో పూర్తిగా రాజీపడి అన్ని సర్దుబాటులకు సిద్ధం కావడం ఒక విషాదమే. ఎన్నికల ఫలితాల తర్వాతైనా వామపక్ష పార్టీలు విశాల ప్రజాస్వామిక సమీకరణలో భాగస్వాములు అవుతారా కాదా అన్నది వాళ్లముందున్న సవాలు.

ఈ ఎన్నికల్లో మన రాష్ట్రంలో, పొరుగు రాష్ట్రం కర్ణాటకలో అత్యధికంగా డబ్బు ఖర్చు పెట్టారని, దేశంలో ఏ ఇతర ప్రాంతంలో లేనంత డబ్బు ఇక్కడ ప్రవహించిందని హరీష్ ఖరే ది హిందు వార్తా పత్రికలో రాసిన ఒక వ్యాసంలో పేర్కొన్నారు. పాలక పార్టీ అన్ని విలువల విధ్వంసానికి పాల్పడింది. అయితే ప్రతిపక్ష పార్టీలు మెరుగైన రాజకీయ సంస్కృతినేమీ ప్రజల ముందు పెట్టలేదు. ఎన్నికలు ప్రజాస్వామ్యంలో భాగమే కావచ్చు. కాని అవే ప్రజాస్వామ్యమనుకుంటే ప్రమాదమే. ఈ ఎన్నికలు ప్రజా సంక్షేమాన్ని బలపరిచాయి. ప్రజలు తాము పొందిన ఉపశమనానికి పాలకపార్టీకి మద్దతునిచ్చారు. కాని ఇది ప్రపంచీకరణకు, నూతన ఆర్థిక నమూనాకు, సంస్థల విధ్వంసానికి, విలువల దిగజారుడుకు, అహంకారానికి, వ్యక్తిస్వామ్యానికి ఓటు కాదు. కాని ఎన్నికల రాజకీయాల్లో ఎన్నికలు జరుగుతున్నప్పుడు ప్రజల గురించి, ప్రజాస్వామ్యాన్ని గురించి మాట్లాడిన వాళ్లే, ఎన్నికల ఫలితాలు వస్తూనే ప్రజల సమిష్టి మనోగతాన్ని పాలకవర్గాలు తమకు తోచినట్లు, తమ ప్రయోజనాలకు అనుగుణంగా అన్వయించుకోవడం అలవాటైపోయింది. పాలకుల బహిర్గత ప్రకటనలకు, అంతర్గత ప్రయోజనాలకు మధ్య ప్రజలు బంధించబడ్డారు. ఈ రాబోయే ఐదేళ్లు పాలన సాఫీగా ఏం ఉండదు. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ప్రపంచీకరణను మరింత పెద్ద ఎత్తున ప్రజల మీద రుద్దబోతున్నాయి. ఈ ఆర్థిక నమూనా ప్రజల జీవనాన్ని విధ్వంసం చేయకుండా ముందుకు పోదు. ఎన్నికల రాజకీయం చాటున దాగిన పాలకవర్గ ప్రయోజనాలను ప్రజలకు మరింత స్పష్టంగా చెప్పవలసిన బాధ్యత ప్రజా ఉద్యమాల మీద ఉంది. తస్మాత్ జాగ్రత్త! వీ


**వీక్షణం 2008 సంచికల బైండింగ్ అందుబాటులో ఉంది.**

**కావాల్సిన వారు రు. 170 ఎం.ఒ. / డి.డి. వీక్షణం పేరిట పంపించగలరు.**

**– సర్క్యులేషన్ మేనేజర్**, 9949391028, yatelliram@gmail.com

# కొత్త ప్రభుత్వం - ప్రజల ఆకాంక్షలు

*ఎన్నికల తరువాత ఏర్పడిన కొత్త ప్రభుత్వం తమ సమస్యలను ఏరకంగా పరిష్కరిస్తుందని ప్రజలు ఆకాంక్షిస్తున్నారో సామాన్య ప్రజానీకంలోంచి నమూనా అభిప్రాయాలు సేకరించి ఇక్కడ ప్రచురిస్తున్నాం. రాజకీయ పక్షాలు ఏ వాగ్దానాలు చేసినా, ఆ వాగ్దానాల ఆధారంగా రాజకీయ విశ్లేషకులు ఏ వ్యాఖ్యానాలు చేసినా అంతిమంగా ప్రజాజీవితంలో ఈ ఎన్నికలు ఏ మార్పులను తీసుకువస్తున్నాయనేదే ప్రజాస్వామ్యానికి గీటురాయి. ప్రజలు, ప్రజా సమస్యలు, ప్రజాభిప్రాయాలు క్రమక్రమంగా కనుమరుగవుతూ రాజకీయ నాయకులూ, అలవోకగా అభిప్రాయాలు ప్రకటించే మేధావులూ మాత్రమే మాట్లాడగలుగుతున్న సందర్భంలో సాధారణంగా వినబడని ఈ గొంతులకు వేదిక ఇవ్వాలని వీక్షణం ప్రయత్నం. – సం.*

ఎన్నికలప్పుడు అన్నీ పార్టీలోల్లు అన్ని రకాల మాటలు జెప్పిండ్రు. ఆల్లు చెప్పినట్లు మేం అన్ని రకాల పార్టీలోల్లు అన్నీ ఇస్తరని ఆశపడుతున్నాం. కాని ఏ పార్టీ వోళ్లు అధికారం లోకి వస్తారో ఎట్ల దెలుస్తది. ఎన్నికలు గెలుసుడు తెలిస్తే అన్నీ విషయాలు తెలుస్తయి. ఆల్లు అన్నట్లు, అన్ని ఇస్తే మంచిదే. కాంగిరేసోళ్లు అప్పులిస్తామన్నారు. యవుసదార్లకు కరెంటు ఇస్తమన్నారు. తెలుగుదేశపోళ్లు కలర్ టి.వి., బ్యాంక్‌లు పైసలెస్తమన్నరు. చిరంజీవి పార్టీ గెలిస్తే బియ్యం, పప్పు, చింతపండు, నూనె నూరు రూపాయలకే ఇస్తాన్నరు. ఏ పార్టీ గెలిచిన, అన్ని ఇస్తరన్నవి, ఇస్తారన్న నమ్మకం లేదు. ఇంతకు ముందు పార్టీలు ఎన్నికలప్పుడు చెప్పినవన్ని ఇచ్చిండ్రు, ఇయ్యిలేదు. ఇక మాలాంటి పేదోళ్లకు కొత్తగచ్చిన ప్రభుత్వం వారు మంచి చెయ్యాలని కోరుకుంటాం తప్ప మాకు వచ్చినోళ్లు ఏమో చేస్తారని నమ్మకం లేదు. మాలాంటి బీదోళ్లకు రేషన్‌కార్డులో ఉన్న మనుషులందరికి మనిషికి నాలుగు కిలోలు బియ్యం ఇస్తనన్నట్లు ఇయ్యాలి. అట్ల ఇయ్యక తక్కువ బోతుండ్రు. కాబట్టి చెప్పినట్టు చేస్తే బాగుంటది. రాష్ట్ర అభివృద్ధికి మాలోంటోళ్లకు పనులు చూపియ్యాల. ఇంతకుముందు కుట్టు మిషనన్‌లు ఇచ్చిండ్రు. అట్లనే గూండ్లోలకు వొలలిచ్చిండ్రు. మంగలోల్లకు కటింగ్ సామాండ్లు, కుర్చీలు అన్నీ ఇచ్చిండ్రు. గట్లనే పని చేసుకొనేటోల్లకు, ఆల్లకు కావల్సినవి అన్నీ ఇచ్చి బతకగలిగే తోవ సూపిస్తే మంచిగుంటది.

**స్వామి** (46)
కుట్టుపని, నిజామాబాద్

(పై అభిప్రాయం సేకరించినవారు **ఎం. నర్సయ్య,**
నిజామాబాద్)

కొత్త ప్రభుత్వం కోటి ఆశలు తీర్చకున్నా మాకు ఉద్యోగ అవకాశాలు పారదర్శకంగా కల్పిస్తే బాగుంటుంది. మా కులం (చాకలి) ని గిరిజన తెగలోకి తిసికొనివస్తే మాకు న్యాయం చేసినట్టు. ఇప్పటికింకా మా కులాన్ని అంటరానిదిగానే చూస్తున్నారు. దోబీఘాట్‌లు లేవు. ప్రభుత్వపరంగా మాకు ఇంకా సహాయం అందాలి. ఆరోగ్య బీమా అందించాలి. ఇన్ని సంవత్సరాల స్వాతంత్ర్య భారతదేశంలో మేమోరిలో వెనుకబడి ఉన్నాం. కొత్తగా వచ్చే ప్రభుత్వం పై మేం ఎన్నో ఆశలు పెట్టుకున్నాం.

***ఓరుగంటి మల్లేష్***
డిగ్రీ విద్యార్థి, చాకలి, మంచిర్యాల

ఎవ్వరెక్కినా, దిగినా మా కష్టం మేం పడాలే. అచ్చే సర్కారు నిజంగా మా పట్ల దయ చూపితే బాగానే ఉంటుంది. ఇంకా మా కులాన్ని పీతిలో పురుగుకన్నా అధ్వానంగా చూస్తుండ్రు. అందరి కాళ్లకు చెప్పులు కుట్టి మేం చెప్పలేనన్ని బాధలు పడ్తున్నాం. గిన్ని సర్కార్లు పోయినాయి. ఓట్లప్పుడు ఏదో చెప్తరు. గెలిచినాక మా ముఖం చూడరు. ఇంకా మా చదువుకున్న పోరగాండ్లు ఆగం తిరుగుతుండ్రు. ఉజ్జోగాల్లేవు. పనిసూచలేదు. మాకు పని కల్పించి బతుకుదెరువు చూపాలె. మమ్మల్ని మనుషుల్లాగా గుర్తించే సర్కారు కోసం ఎదురుచూస్తున్నాం.

**కూడెల్లి రాజమల్లు**
వ్యవసాయ కూలీ (చర్మకారుడు), మంచిర్యాల

(పై రెండు అభిప్రాయాలు సేకరించినవారు
**సి. హెచ్. శ్రీమన్నారాయణ మూర్తి,** మంచిర్యాల)

వచ్చేకాలం వర్షాకాలం. మురుగునీటి పారుదల, పరిశుభ్రత సక్కంగా ఉండాలి. మోరీలు తీయాలి. నల్లాలు మంచినీరు రావాలి. సిసి రోడ్లు పల్లెటూళ్లలో వేయాలి. గడ్డి తినకుంట ఏదో ఒక పనిచేసే మా లాంటి పేద ప్రజలకు ప్రభుత్వం పైసలు ఇవ్వాలి. నిరుపేదలకు ఇల్లుకట్టియ్యాలి. అందరు బాగుపడాలి. ఉచితంగా అందరు చదువుకునే అవకాశం కల్పించాలి. అందరికి పని కల్పించాలి. రోడు విస్తరణలో (రాజీవ్ రహదారి) నాలుగు లైన్ల విస్తరణలో ఇండ్లు కోల్పోయే వారికి సర్కారే ఇండ్లు కట్టియ్యాలి.

**బాకి భూమవ్వ** (50)
కూలీ, దుద్దెడ , మెదక్

'తిందామంటే తిండి లేదు. ఉందామంటే ఇల్లు లేని' నాలాంటి కుటుంబాలకు సర్కారు ఆదుకోవాలి. నా భర్తచనిపోయి ఆరు నెలలు అవుతుంది. సర్కారు ఎలాంటి పింఛన్లు ఇస్తలేదు. నాకిద్దరు చిన్నపిల్లలు.

**ఎరుకలి రేణుక** (22)
కూలీ, దుద్దెడ , మెదక్

ప్రజలకు, నిరుపేదలకు ఉపాధి అవకాశాలను ఏర్పాటు చేయాలి. నిరుపేదలకు ఇల్లు, కనీస రేషన్ పెంచాలి. ప్రభుత్వ అధికారులను సక్రమంగా పనిచేయించే సర్కారు రావాలి. సర్కారు విద్యారంగాన్ని, పారిశ్రామికరంగాన్ని నిర్లక్ష్యం చేయరాదు. మంచిపాలన అందించాలి. నీటిపారుదల సౌకర్యాలను మెరుగుపర్చాలి.

***బూర్గుల కరుణాకర్*** (21)
విద్యార్థి, దుద్దెడ, మెదక్

అన్నివర్గాల ప్రజలకు బెనిఫిట్ అయేటట్లు సర్కారు రావాలి. ఒక

హైక్లాస్ పీపుల్ గాకుండా లో క్లాస్ పీపుల్‌కి కూడా న్యాయం జరిగేటట్లు సర్కారు చూడాలి. పేదరికంలో మగ్గే ప్రజలకు అన్నిరకాల విద్యాసౌకర్యాలు పూర్తిస్థాయిలో సర్కారు కల్పించాలి. నిరుపేదలకు, సర్కారు సాయం తప్పక అందిస్తేనే ప్రజలు బాగుపడ్తరు.

***గాదగోని పెంటవ్వ*** (36)
బీడీ కార్మికురాలు, దుద్దెడ, మెదక్

(పై నాలుగు అభిప్రాయాలు సేకరించినవారు ***జి. వెంకటేశ్,*** దుద్దెడ గ్రా, కొండపాక మం, మెదక్)

కొత్త ప్రభుత్వం నిత్యావసర వస్తువుల ధరలు అదుపులో ఉంచాలి. అదే విధంగా విద్య, వైద్య సదుపాయాలు మంచిగా అందుబాటులో ఉండాలి. మా ముస్లింలలో చాలామంది పేదరికం అనుభవిస్తున్నారు. మాకు ఉపాధి అవకాశాలు కలిగించాలి. రాష్ట్రవ్యాప్తంగా పరిశ్రమలు స్థాపించి, ఎక్కువమందికి జీవనోపాధిని కల్పించాలని కోరుకుంటున్నాను. ఎందుకంటే మన రాష్ట్రంలో ఎక్కువమంది జీవనోపాధి లేక కువైట్, సౌదీలకు వలసపోతున్నారు.

***నీలిమ*** (30)
గృహిణి, కడప

నేను ఎం.ఎ. చదువుకున్నాను. నాకు ఉద్యోగం లేదు. నాన్నతో పాటు పండ్ల వ్యాపారం పని చూసుకుంటున్నాను. కొత్త ప్రభుత్వం ఉపాధి చూపించకున్న ఏం లేదు గాని, మేం చేసుకునే పనికి భద్రత కల్పిస్తే చాలు. మా పండ్ల వ్యాపారానికి తగిన సదుపాయాలు కల్పించాలి. రాష్ట్రవ్యాప్తంగా పంట పొలాలకు నీటి సదుపాయాన్ని కల్పించాలి. సెజ్‌ల పేరుతో భూముల (వ్యవసాయ భూములు) సేకరణ ఆపాలి.

***రమేష్*** (28)
పండ్ల వ్యాపారి, కడప

మేం ప్రభుత్వం నుంచి ఏమీ ఆశిస్తలేం. అయితే కొత్త ప్రభుత్వం పిల్లలకు మెరుగైన చదువు, వైద్య సదుపాయాలు అందించాలని కోరుకుంటున్నాం. చేనేత రంగానికి ప్రాధాన్యత ఇచ్చి ఇప్పుడు జరుగుతున్న ఆత్మహత్యలను నివారించి భవిష్యత్తులో మా రంగాన్ని ఆధునికత వైపు తీసుకుపోవాలని కోరుకుంటున్నాం. తినడానికి అన్నం, కట్టుకోవడానికి బట్ట, ఉండడానికి ఇల్లు రాష్ట్రంలో నివసించే ప్రజలందరికీ ఏర్పాటు చేయాలని కోరుకుంటున్నాను.

***గాయత్రి*** (34)
చేనేత కార్మికురాలు, కడప

(పై మూడు అభిప్రాయాలు సేకరించినవారు ***బి. దస్తగిరి,*** కడప)

గెలిచిన పార్టీ ఏదైనా పక్షపాతం లేకుండా పాలన చేయాలి. ఒక వర్గానికే కొమ్ము కాయకూడదు. మా గ్రామంలో కులవివక్షత ఉంది. గ్రామంలోని ఓవర్‌హెడ్ ట్యాంక్ నీళ్లు కేవలం అగ్రవర్ణాల బజార్లకే వస్తాయి. కాని దూరంగా ఉన్న మా హరిజన వాడకు నీళ్లు రానివ్వరు. ఏ పార్టీ అధికారంలో ఉన్నా అందరూ ఒకలాగే ఉంటున్నారు. దళితులకు ఏమీ చేయట్లేదు. సామాజిక మార్పులు కావాలి.

***కె. లక్ష్మణరావు*** (30)
చింతలపాలెం, జిరుగుమల్లి, ప్రకాశం

ప్రభుత్వం ప్రజలకు వీలైనంత మంచి చేయాలని కోరుకుంటున్నాం. కనీస మౌలిక సదుపాయాలు కల్పించాలి. మా గ్రామానికి మంచినీటి సమస్య తీవ్రంగా ఉంది. ఫ్లోరిన్ సమస్య కూడా తీవ్రంగా ఉంది. ఫ్లోరిన్ వల్ల ఆరోగ్య సమస్యలు తలెత్తుతున్నాయి. అదే విధంగా గ్రామంలోని వృద్ధులకు పింఛన్లు లేవు. కాని అధికార పార్టీ అనుచరులకు కుర్రాళ్లకే వృద్ధాప్య పింఛన్లు ఉన్నాయి. రేషన్‌కార్డులు కూడా అర్హులకు లేవు. గెలిచినవారు ఎవరయినా ప్రజలందరికీ న్యాయం చేయాలి. వాళ్ల వాళ్లకే కాకుండా అందరి అభివృద్ధికోసం కృషి చేయాలి.

***అంకాల వెంకటేశ్వర్లు*** (35)
విద్యార్థి, రేగడిపల్లి, ప్రకాశం

(పై రెండు అభిప్రాయాలు సేకరించినవారు ***మల్లికార్జున్,*** ప్రకాశం)

**కాంగ్రెస్** ప్రభుత్వం కొన్ని పథకాలు అమలు చేసింది. ప్రత్యేకంగా చెప్పాలంటే 'ఆరోగ్య శ్రీ' పథకం. దీనివలన చాలా మందికి ఆరోగ్యం బాగయ్యింది. రెండు పూటలు గడవడమే మాకు చాలా కష్టంగా ఉంటోంది. ఆరోగ్య శ్రీ పథకాన్ని కొత్త ప్రభుత్వం కూడా కొనసాగించాలి. ఏరియా పరంగా చూస్తే మంచినీటి సదుపాయం, కరెంట్, ఆస్పత్రులు, స్కూల్స్ ఏర్పాటు చేస్తే బాగుంటుంది. అలాగే రోడ్లు కూడ బాగు చేయాలి. కొత్త ప్రభుత్వం ఇప్పుడు ఉన్న పథకాలన్నిటినీ కంటిన్యూ చేస్తే బాగుంటుంది. ఎలెక్షన్స్ అయిపోయిన కదా ఇంక ఈ పథకాలు ఎందుకని అనకోరాదు. మాలాంటివారికి ఉపాధి అవకాశాలు కలిగించాలి.

***యాదయ్య***
ఆటో డ్రైవర్, హైదరాబాద్.

(పై అభిప్రాయం సేకరించినవారు ***డి.విజయభాస్కర్,*** హైదరాబాద్)

**యాదుం**డేవాళ్లం ఆడ్నే ఉండిపోయినాం చాలాకాలం. రాజీవ్ ఆరోగ్యశ్రీ కార్డు, బిసిలకు మార్జిన్ అప్పు మాఫీ వల్ల లాభపడినాం. కుటుంబంలో ఆడోళ్లు గ్రూపుల్లో చేరి పావలావడ్డీ పొందుతా ఉంటారు. మావోళ్ల పిల్లోడు ఇంజనీరు సదవతా ఉండాడు. ఫీజు వెనక్కి ఇస్తారంట. మా కులపోళ్లకు తెలుగుదేశం గవర్నమెంటు ఆదరణ కింద అన్ని రకాల సామాన్లు ఇచ్చింద్రి. ఈ గవర్నమెంటు ఈలే! వొచ్చే గవర్నమెంటయినా మాకులపోళ్లకు సామాన్లు ఇయ్యాల. డోలు, నాదస్వరం, తాళం ఫ్రీగా నేర్పించే ఏర్పాట్లు చెయ్యాల. బియ్యమిస్తే సంసారం గడీదు. రేట్లు తగ్గల్ల కదా. గ్యాసురేట్లు తగ్గించల్ల. అందురికీ ఒకే రేట్లుంటే ఎట్ల? బీదోళ్లకి కొంచెం తగ్గించల్ల. ఆడపిల్లకాయలకి సైకిల్లు ఇయ్యల్ల. కరెంటు బావుండాది. రేత్రిపూట కరెంటు సాపులే ఘోరంగా ఉండాది. జనాలంటే ఆఫీసుల్లో, బ్యాంకుల్లో మతింపే లేకుండా ఉండాది.

***మంగలి సుబ్రమణ్యం*** (43)
క్షురకుడు, పాతపేట, పలమనేరు, చిత్తూరు

(పై అభిప్రాయం సేకరించినవారు ***పలమనేరు బాలాజి,*** పలమనేరు, చిత్తూరు జిల్లా)

**బియ్యం** రెండు కిలోలు ఇస్తుంద్రు. నిత్యవసర ధరలు పెంచింద్రు. పామాయిలు, పప్పులు నాణ్యత లేవు. బాగుండాలి. పనికి ఆహారపథకం వంద అన్నారు. ఎనభై మాత్రమే ఇస్తుంద్రు. వంద ఇవ్వాలి. ఇందిరమ్మ గ్రామాలు ఇచ్చే మొత్తాన్ని పెంచాలి. ఎందుకంటే స్టీల్ ధర ఎక్కువగా ఉంది. రైతులకు కరెంట్ అంతరాయం లేకుండా ఇవ్వాలి. రాత్రి కరెంట్

ఇవ్వడం వల్ల కరెంట్ షాక్ గురయ్యి చాలామంది చనిపోతున్నారు. ఎరువులు, విత్తనాలు సకాలంలో అందాలి. మార్కెట్ షెడ్‌లు నిర్మించాలి. బ్యాగులు కూడా లేవు. రైతులకు వ్యవసాయం గిట్టుబాటు కావడం లేదు. కాబట్టి పెన్షన్ ఇవ్వాలి.

**రాజయ్య** (45)
రైతు, కరీంనగర్

(పై అభిప్రాయం సేకరించినవారు ***ఎల్. సంతోష్,*** కరీంనగర్)

**రా**బోయే ప్రభుత్వం పోయిన ప్రభుత్వం కన్న మంచి చేయాలనుకుంటున్నాం. పల్లెల్లో మురికివాడలు లేకుండా ఉండాలి. తాగునీరు అందించాలి. ఊరి ప్రజలకు కావలసిన అవసరాలు తీర్చాలి. ఎస్.సి., ఎస్.టి., బి.సి.లతో పాటు ఒ.సి.ల్లో ఆర్థికంగా వెనుకబడిన వాళ్లకు అన్ని సౌకర్యాలు అందాలి. రైతుల నుంచి భూములను బలవంతంగా లాక్కుంటున్నారు. ఆ భూములు తిరిగి ఇవ్వాలి. నిత్యావసర సరుకుల ధరలు సామాన్యులకు అందుబాటులో ఉండాలని కోరుకుంటు న్నాం. లేని పక్షంలో ఆకలి చావులు తప్పవని అనుకుంటున్నాం.

**మరియమ్మ** (45)
కూలీ, గుంటూరు

(పై అభిప్రాయం సేకరించినవారు ***బి. అంజమ్మ,*** గుంటూరు)

**ప్ర**స్తుతం ప్రభుత్వం పెట్టిన పథకాలన్నీ కొనసాగాలి. ఎవరొచ్చినా ఇవి నడపక తప్పదు. నడపకపోతే ప్రజలు ఊరుకోరు. ఇల్లివ్వాల. చదువులు కూడా ఉచితంగా ఇవ్వాల. వన్నాట్ ఏయిట్ ఎలాగా ఉంది. ఇవ్వే ఇలాగ కంటిన్యూ అవ్వాల.

**పి. మురళి** (33)
మంగలి, టెక్కలి, శ్రీకాకుళం

**నా**కు ఇల్లులేదు. నేను పెట్టుకున్నాను గాని, నాకు ఇల్లివ్వలేదు. నాకు ఇల్లు కావాలి. మా షరాబులందరికీ గొప్ప కష్టంగా ఉన్నాది. తినడానికి దొరక్క, బతకడానికి కష్టంగా ఉన్నాది. కొత్త పెబుత్వం అన్ని కులవృత్తులకీ ఎలాగైనా చేసి, రక్షించాలి. కుల వృత్తులు బతకాలంటే అదికన మా చేతిలో లేదు. పెబుత్వం కాపాడకపోతే మాకు మరి దిక్కులేదు. మా షరాబుల్లో ఒక్క బంగారం పనికే కాదు, కర్రపనోడికీ పనిలేదు. నక్కూనాగలీ ఒట్టుకున్నోడికీ పనిలేదు. ఎవులకి పనిలేదు. పనిలేకపోతే ఎలగ బతుకుతాం. అందులోనా వెసనాలు. స్థిరంగా ఆదాయం వచ్చినట్టుగా పెబుత్వమే ఏదో ఒకటి సెయ్యాల.

**లక్కోజు రాజులు** (36)
కంసాలి, టెక్కలి, శ్రీకాకుళం

**తె**లుగుదేశం ప్రభుత్వం నిరుద్యోగులతో ఆడుకుంది. ఒకవైపు కాంట్రాక్టు వ్యవస్థ, మరోవైపు చాలీచాలని జీతాలు. వీటన్నింటికీ మించి ఉద్యోగం ఎప్పుడు ఊడుతుందోనని ఆందోళన. ఇలా యువత నవనాడుల్నీ కుంగదీసాడాయన అంటే చంద్రబాబు. కాంగ్రెస్ ప్రభుత్వం ఒక్కటొక్కటిగా అవన్నీ తొలగించాలి. ఇప్పటికీ టీచర్లకు రెండేళ్ల బానిస పని తప్పడం లేదు. అది పూర్తిగా తీసెయ్యాలి. ట్రెనింగ్ అయ్యాక కలెక్టరుకయినా ఉద్యోగమిస్తారు. కానీ అతడిని తయారు చేసే టీచరుకు మాత్రం ట్రైనింగ్ అయ్యాక ఉద్యోగం లేదు సరికదా, పోటీపరిక్ష... ఆ తర్వాత రెండేళ్లు బానిసతనం. ఎపిపిఎస్‌సి చురుగ్గా నడిచి ఉద్యోగ నియామకాలు చేపట్టాలి. అదొక్కటే చాలా సమస్యలను తొలగిస్తుంది. నోటిఫికేషన్ పడ్డాక కనీసం మూడేళ్లదాకా దాని సంగతి తెమల్చకపోతే ఎట్లా? అది మారాలి. ఉద్యోగ కల్పన మన సామాజిక సమస్యలను చాలావరకు తొలగించగలదు. తర్వాత స్థానంలో విద్య, ఆరోగ్యం వస్తాయి. అదొక్కటీ గుర్తించిన ఏ ప్రభుత్వమైనా నాలుగు కాలాలపాటు ఉంటుంది.

**సంపతిరావు శ్రీధర్** (28)
టీచర్, శ్రీకాకుళం

**కాం**గిరేసి పెబుత్వమే మాకు మునుపు కాలనీలు కట్టించింది. పిల్లలు సదువులు ప్రీయేగాని, ఆలకి సదువులు అబ్బలేదు. పెద్దోడు రైస్ మిల్లుకాడ రిక్షా యేసివోడు. ఆటోకి లోనొస్తే అది కొనుక్కుంటాడు. మావోలుకి సదువులు రానోలికి ఏదో ఒక జీవిక మారగం సూపిస్తే బాగుంటుంది. గానీ కూరల కాడినుంచి, పప్పులు – ఉప్పులు అన్నీ రేట్లు తగ్గాలి. అదే ఎవులయినా ముందు సెయ్యాల. మా కోలనీకి బోరుంది, బడుంది, రోడ్లేసినారు, కరెంటుంది.

**యాట్ల లచ్చుములు** (42)
వ్యవసాయ కూలీ, టెక్కలి, శ్రీకాకుళం

**మా**కు కరెంటు కోతలెక్కువ. అలాగ కాకుండా రోజు ఇంతసేపని కోతలేకుండా కరెంటివ్వాలి. కనీసం ఎనిమిది గంటలయినా ఆపకుండా కరెంటిస్తే మంచిది. వ్యవసాయం పనిచేసేవాళ్లకి బాగుంటుంది.

**తులసి** (30)
పనిమనిషి, శ్రీకాకుళం

**మా** ఊరిలో అందరికీ రేషన్ కార్డులు లేవు. కొందరికి వచ్చాయి. మిగిలిన వాళ్లకు ఇవ్వాలి. గ్రామం బయట ఉన్న స్మశానానికి రోడ్డు లేదు. పొలాల గట్లమీద నుంచి వెల్తున్నాం. అలాగాకుండా రోడ్డెయ్యాలి. మా గ్రామానికి సంతబొమ్మాళి జంక్షన్ కి కలిపిన రోడ్డు ఉంది గాని, దాన్ని సిసి రోడ్డు చెయ్యాలి. మాకు దగ్గరి పిఎచ్‌సి దండు గోపాలపురం. కానీ అక్కడికెళ్లాలంటే చుట్టు తిరిగి వెళ్లాలి. అందుకని మా ఊర్లో పిఎచ్‌సి ఏర్పాటు చెయ్యాలి.

**రఘుపాత్రుని వెంకటేశ్వరరావు** (30)
అటెండర్, టెక్కలి, శ్రీకాకుళం

**వ**స్తువుల ధరలు తగ్గాలి. చిన్నప్పుడు అవసరమనుకున్న డబ్బులు ఇప్పుడు ఆ అవసరాలేవీ తీర్చడం లేదు. ఇంకా ఇంకా సంపాదించాల్సీ వస్తోంది. డబ్బులు ఎలాగో ఒకలాగ తెచ్చుకోకపోతే నలుగురి దగ్గరా చులకన. అందుకే ఎంతో కష్టపడుతుంటాం. గవర్నమెంట్ మాకేటి చెయ్యగలదు? ఏటీ చెయ్యలేదు. ధరలు తగ్గిస్తే సరి. ఇప్పుడులాగ నాలుగు పనులు చెయ్యనక్కర్లేదు. ఈ ఎలక్షన్లన్నాల్లూ ఆ పనీ ఈ పనీ చేసుకుని నాలుగు డబ్బులు సంపాదించుకున్నాం గానీ, ఇకన మళ్లీ మామూలే.

**ఎ. ఆదినారాయణ** (25)
వాటర్ సప్లయర్, శ్రీకాకుళం

(పై ఏడు అభిప్రాయాలు సేకరించినవారు **దుప్పల రవికుమార్,** శ్రీకాకుళం) వీ

*అవకాశవాద ఎన్నికల రాజకీయాలూ, పాలకుల నాటకాలూ ప్రజలు చైతన్యవంతులై ప్రశ్నించనంత వరకూ ఈ విధంగా కొనసాగుతూనే ఉంటాయని అంటున్నారు* **కె. రవి**

# ఈ నాటకాన్ని చూద్దామా? ఆపుదామా?

ఎన్నికలు వస్తున్నాయి. అయిపోతున్నాయి. జనం ఓటేస్తూనే ఉన్నారు. ఓటమి పాలవుతూనే ఉన్నారు. పార్లమెంటరీ వ్యవస్థ భ్రష్టత్వం రోజు రోజుకూ బట్ట బయలవుతున్నా, ప్రజాస్వామికంగా చెలామణీ అయ్యేందుకు శతవిధాలా ప్రయత్నిస్తోంది.

డబ్బు ప్రభుత్వాధికారాన్ని శాసిస్తోంది. అభ్యర్థులకు ఏరకమైన సెంటిమెంట్లు లేవు. పార్టీ, జండా, ఎజండాల పట్ల ఏ విధమైన కమిట్‌మెంట్లూ లేవు. నిర్లజ్జగా, నిర్భీతిగా, నిర్మొహమాటంగా వ్యవహారం సాగిపోతోంది. మీడియా 'పక్షపాతమూ' అంతే.

గత విధానాల కొనసాగింపుగానే 1991 నుండీ ఇప్పటి వరకూ దాదాపు రెండు దశాబ్దాల కాలం ప్రపంచీకరణ విధానాలు అమలయ్యాయి. దోపిడీ రూపం మార్చుకుంటున్నా మరింత తీవ్రమయింది. శ్రామిక ప్రజల జీవితాలు మరింత దుర్భరమయ్యాయి. 'అభివృద్ధి' పేరున విధ్వంసం కొనసాగింది. పాలక పార్టీలేవయినా పరిస్థితి ఒకేరకంగా ఉంది.

అమెరికాతో పాలకులకు అనుబంధం ధృఢమైంది. పొరుగు దేశాలతో సంబంధాలు క్షీణించాయి. ప్రపంచ బ్యాంక్, ప్రపంచ వాణిజ్య సంస్థ, బహుళజాతి కంపెనీలు దేశ ఆర్థిక వ్యవస్థ తీరుతెన్నులను నిర్దేశించాయి.

ఈ మధ్యకాలంలో నాలుగుసార్లు ఎన్నికలు జరిగాయి. నయా జమీందారులు 'ప్రజాసేవకులుగా' అవతారమెత్తారు. పీడిత కులాల ఉద్ధరణ పార్టీలూ, వెనుకబడిన ప్రాంతాల ఉద్ధరణ పార్టీలూ రంగం మీదికి వచ్చినా, పార్లమెంటరీ వీధి భాగవతంలో పాత్రధారులుగా చక్కగా ఇమిడిపోయాయి. ఓట్లు, సీట్ల కోసం పరుగులాటలో వీళ్ల వల్ల ప్రజలకూ, ప్రాంతాలకూ ఒరిగిందేమీ లేదు.

'మార్పు'ను నినదించినా, 'సామాజిక న్యాయాన్ని' ప్రవచించినా అన్ని పార్టీలకూ అమెరికా అధ్యక్షుడు 'ఒబామా'యే ఆదర్శం. ఒబామా చర్మం నలుపే కానీ నరాల్లో రక్తం మాత్రం శ్వేతవర్ణమే. సామాజిక దృక్పథం సామ్రాజ్య విస్తరణ కాంక్షే. వీళ్లదీ అదే దృక్పథం. దోచుకునే వాడి స్థానంలోకి తమ వాళ్లు చేరడం, ప్రజల వీపుల పైన స్వారీ చేయడం.

వీళ్లు ప్రతిపక్షంలో ఉంటే అధికార పక్ష పథకాలను విమర్శిస్తారు. విధానాలను ప్రశ్నించరు. అవినీతిని గురించి గగ్గోలు పెడతారు. ప్రజల ఆస్తులను కొల్లగొట్టడాన్ని అడ్డుకోరు. ప్రెస్ కాన్ఫరెన్స్‌లతో, అసెంబ్లీ సమావేశాలకే నిరసన పరిమితం. ప్రత్యక్ష కార్యాచరణకు బహుదూరం.

ప్రజల ఆందోళనలను రాజకీయ ప్రేరేపితాలుగా అభివర్ణించే వీళ్లకు మాత్రం ఎన్నికల రాజకీయాల పట్ల మక్కువ ఎక్కువ. కుటుంబ సభ్యులందరూ తలా ఒక పార్టీలో ఉంటారు. ఏ పార్టీ అధికారంలోకి వచ్చినా పదవి మాత్రం తమ ఇంట్లోనే ఉంటుంది. తమ వారసులకు అవసరమైన మెట్లు పేర్చి అందలం ఎక్కిస్తారు. అందలం దూరంగా ఉందంటే రాజకీయాలకూ దూరంగానే ఉంచుతారు. తమ వారసులింకా చిన్న పిల్లలనీ, రాజకీయాలతో వాళ్ల 'కేరిర్' దెబ్బతినకూడదనీ భాష్యాలు చెబుతారు.

పబ్బుల్లోనూ, క్లబ్బుల్లోనూ కాలం గడిపేవాళ్లంతా అకస్మాత్తుగా 'ప్రజాసేవ'కు తపించిపోతారు. స్వచ్ఛంద సంస్థలను పుట్టిస్తారు. మీడియా సాక్షిగా హంగామా సృష్టిస్తారు. వీళ్లూ, వీళ్ల పిల్లలూ తమ తమ వృత్తుల్లో రాణిస్తూ కోట్లు గడిస్తుంటారు. అన్ని పనులూ మానుకుని ఎన్నికల ప్రచార పర్వంలో ముందుకురకాలని 'అధినేతలు' యువతకు పిలుపులిస్తుంటారు.

వీళ్లకోసం, వీళ్ల పిల్లల కోసం, 'పిచ్చి అభిమానం' గోడలెక్కి చెట్లెక్కి కుప్పకూలిపోతోంది. కాళ్లూ, చేతులూ విరగ్గొట్టుకుంటుంది. చివరికి ప్రాణాలే అర్పిస్తుంది.

నైతికంగా ఏ విలువాలేని వీళ్లు తాగుతారు. కార్యకర్తలకు తాగిస్తారు. ప్రజలకూ పోయిస్తారు. అంతా మద్యం మయం. ప్రజలకు మురికి నీళ్లే మంచినీళ్లు. వీళ్లు తాగేది మాత్రం మినరల్ వాటర్. వీళ్ల పిల్లలు శీతల పానీయాల ప్రకటనల్లో ఓలలాడతారు. వీళ్లంతా మళ్లీ 'ప్రజాసేవ'కు తపించిపోతారు. అధికార పీఠాలెక్కి సంబర పడిపోతారు. మళ్లీ మామూలే..

రాష్ట్రం అప్పుల దిశగా, ఆత్మహత్యల దిశగా, అనారోగ్యాల దిశగా, మరిన్ని ఎన్‌కౌంటర్ కథల దిశగా కదిలిపోతోంది. మళ్లీ అవినీతి ఆరోపణలు, ప్రత్యారోపణలు, తిట్లు, అరుపులు, వాకౌట్లు అసెంబ్లీ సజావుగా ఎప్పటిలాగే సాగిపోతోంది. ఈ నాటకం ఆరు దశాబ్దాలుగా పునరావృతమవుతూనే ఉంది. పాత్రధారులు మారుతున్నారంతే.

ప్రజల మధ్య నిలబడి పోరాడాల్సిన వాళ్లూ, ప్రత్యామ్నాయ రాజకీయ పంథాను ముందుకు తెచ్చినవాళ్లూ మౌనంగా ఉన్నంత కాలం, తప్పులు సరిచేసుకోనంత కాలం, ఐక్యం కానంత కాలం ఈ నాటకం కొనసాగుతూనే ఉంటుంది.

వీ

*ఎన్నికల ఫలితాలను విశ్లేషిస్తూ ప్రజలతో సంబంధం లేని వ్యూహాలతో తెరాస ఎన్నికలలో ఓటమి పాలయిందనీ, తెలంగాణ ఆకాంక్ష జీవనదిలా కొనసాగుతూనే ఉందనీ అంటున్నారు* **ఎం. కోదండరాం**

# ఓడింది తెలంగాణ కాదు, తెరాస వ్యూహం!

ఎన్నికల ఫలితాలు తెలంగాణవాదులను నిరాశపరిచాయి. అందుకు కారణం టి.ఆర్.ఎస్. ఓటమి, కాంగ్రెస్ గెలుపు. కాంగ్రెస్ గెలిచి అధికారంలోకి వచ్చినా తెరాస 25 ఎం.ఎల్.ఎ. సీట్లను, 5 ఎం.పి. సీట్లను గెలుచుకుంటే ఇంతగా నిరుత్సాహం ఉండకపోవును. ఫలితాలు ఇట్లా ఎందుకు వచ్చినాయన్న విషయాన్ని ఇవ్వాళ తెలంగాణలో ఏ నలుగురు కలుసుకున్నా మాట్లాడుకుంటున్నారు.

అసలు ఫలితాలు ఇట్లా వస్తాయని ఊహించలేదు. అధికారంలో నున్న కాంగ్రెస్ ఇ.వి.ఎం. డబ్బాలను మార్చిందేమోనన్న అనుమానం వ్యక్తం చేస్తున్న వాళ్లున్నారు. ఏదో మాయ జరిగిందనే వాళ్లు కూడా ఉన్నారు. ఈ అనుమానాలకు కారణం లేకపోలేదు. పోలైన ఓట్లలో కాంగ్రెస్‌కు వచ్చినవి తక్కువ. తెలంగాణ ప్రాంతంలో కాంగ్రెస్‌కు వచ్చిన ఓట్లు కేవలం 33 శాతమే. గ్రామాలలో చాలామంది పత్రికలు చూడలేదు. అందులో వచ్చిన గణాంకాలు వాళ్లకు తెలియవు. కాంగ్రెస్‌కు తక్కువ ఓట్లు వచ్చిన విషయం గ్రామాలలో అందరూ మాట్లాడుకుంటున్నారు. ఎక్కువ ఓట్లు పడకుండానే కాంగ్రెస్ ఎట్ల గెలిచిందో వాళ్లకు అర్థంకాక ఏదో కుట్ర జరిగిందన్న నిర్ధారణకు వస్తున్నారు.

వాస్తవానికి కాంగ్రెస్‌కు తక్కువ ఓట్లే వచ్చినాయి. కానీ మిగిలిన ఓట్లన్నీ ఒకే పార్టీకి రాలేదు. అట్లా వస్తే కాంగ్రెస్ ఓటమి పాలయ్యేది. కాంగ్రెస్ వ్యతిరేక ఓటు చీలిపోయింది. ఈ చీలిక కాంగ్రెస్‌ను గెలిపించింది. తెలుగుదేశం ఓట్లు కూడా తెరాసకు పడలేదు. ఇది పత్రికల్లో వచ్చిన విషయమే. ఇటువంటి వివరణ తెరాస సభ్యులకు, సానుభూతి పరులకు సంతృప్తినిస్తది. అయితే ఇక్కడ ఒక్క విషయాన్ని గమనించాలి. కూటమి కారణంగా తెదేపా ఒకటి, రెండు మినహా తెలంగాణలో పోటీచేసిన సీట్లన్నిటిని గెలుచుకున్నది. అందుకే తెదేపా మాదిరిగా తెరాస కూటమి వలన లబ్ధిపొందక పోవడానికి కారణాలను కూడా తెలుసుకోవాలి. అప్పుడే ఎన్నికలపై సరైన అవగాహన ఏర్పడుతుంది. దీనికి సమాధానం రెండు రకాలుగా చెప్పుకోవచ్చు.

తెలంగాణవాదం బలంగా ఉంటే నిజానికి తెరాస ఒంటరిగా పోటీచేసి గెలవాలి. తెలంగాణవాదం బలహీనంగా ఉంది కాబట్టి తెరాస ఓడిపోయిందని సమైక్యవాదులు వెంటనే నిర్ధారించుకుంటారు. అయితే ఈ వివరణ వాస్తవం కాదు. తెలంగాణ నినాదానికి బలం ఉన్నది. ఎన్నికల సర్వేలు కూడా ఈ విషయాన్ని రుజువు చేస్తున్నాయి.

ఈసారి తెలంగాణ ప్రజల్లో తెరాసపట్ల అనుమానాలు కలిగినాయి. ఆ అనుమానాలు ఎన్నికల్లో వ్యక్తమయ్యాయి. అందుకే ఓటమి చెందింది. ఎన్నికల సరళిపై ప్రభావం చూపిన అంశాలన్నింటిని స్పష్టంగా చూడాలంటే మనం ఎన్నికలను చూసే దృక్పథం మార్చుకోవాలి. ఎన్నికలను ఒక ఘటనగా చూస్తున్నాం. ఎన్నికలను రాజకీయాల నుండి విడిగా చూడటం వల్లనే రాజకీయ సమీకరణలపైన, ఎన్నికల ఫలితాల పైన రాజకీయ పరిణామాల ప్రభావాన్ని చూడలేకపోతున్నాం. రాజకీయాలు ఒక నాటకం అనుకుంటే ఎన్నికలు అందులో కొన్ని ఘట్టాలు మాత్రమే.

ఈ కోణం నుండి ఎన్నికలను చూసినప్పుడు ఎన్నికల ఫలితాలు గత ఐదేళ్ల రాజకీయ పరిణామాలలో అంతర్భాగమేనని గ్రహించ గలుగుతాం. గత ఐదేళ్ల ఆంధ్రప్రదేశ్ రాజకీయాలు తెలంగాణ ప్రాంతవాసులకు ఆంధ్ర సంపన్న వర్గాలకు మధ్య జరుగుతున్న ఘర్షణ ఫలితమే. ఆంధ్ర సంపన్న వర్గాలు రాజశేఖరరెడ్డి నేతృత్వంలో తెలంగాణ ఏర్పాటును నిలువరించడానికి ప్రయత్నిస్తున్నాయి. తెలంగాణ వనరులను ఆంధ్ర ప్రాంతానికి తరలించుకొని పోవడానికి ప్రభుత్వాధికారాన్ని వాడుకుంటున్నాయి. కేంద్రంలోను తెలంగాణవాదుల బలాన్ని తగ్గించడం లో విజయం సాధించాయి.

ఆంధ్ర సంపన్నవర్గాల దోపిడీ నుండి తెలంగాణను విముక్తి చేయడానికి తెరాసతోపాటు తెలంగాణ ప్రజాసంఘాలు కూడా కృషి చేస్తున్నాయి. తెలంగాణ ఉద్యమం సంఘటితంగా లేదు. అందులో ప్రజాసంఘాలు ఒక పాయ మాత్రమే. ప్రజాసంఘాలు బలహీనంగా ఉన్నాయి. అవి ఆందోళనా కార్యక్రమాలు చేయలేకపోయినా నిరంతర భావవ్యాప్తికి కృషి చేస్తున్నాయి. రాజకీయంగా లబ్ధిపొందాలనే కోరిక లేకపోవడం చేత ప్రజాసంఘాల ప్రచారానికి ప్రజల్లో ఆదరణ ఉంది. ఆ ప్రచారం వల్లనే తెరాసకు మద్దతు లభించింది. అయితే ప్రజాసంఘాలు ఆందోళన దిశగా ఉద్యమాన్ని నడిపించలేకపోయాయి.

తెలంగాణ ఉద్యమంలో మరొక పాయ తెరాస. తెరాస కూడా సమస్యలపైన ఆందోళన చేయలేదు. రాజకీయ ప్రక్రియకు మాత్రమే పరిమితమైంది. ఇదే తెరాస బలహీనత. సంపన్నవర్గాల పార్టీల రాజకీయాలు వేరు. వాటి చేతుల్లో రాజకీయ ప్రక్రియను నడిపించడానికి అనేక అస్త్రాలుంటాయి. అందుకే ఎన్నికల్లో దోపిడీకి లోనయ్యే వర్గాలు, సంపన్నవర్గాలు సమానంగా పోటీపడలేవు. అసమానతలున్న సామాజిక

వ్యవస్థకుండే ప్రధాన లక్షణం ఇది. ఈ సమాజాలలో బలహీనవర్గాల చేతుల్లో ఎటువంటి సాధనాలు లేవు.

అసమాన పోటీ ఆధునిక ప్రజాస్వామిక వ్యవస్థ లక్షణాలలో ఒకటి. ప్రజాస్వామ్యం మధ్యయుగాల నాటి రాజకీయ వ్యవస్థకన్నా రెండు అంశాలలో భిన్నమైంది. మధ్యయుగాల నాటి రాజకీయ వ్యవస్థలో (నిజాం పాలించిన హైదరాబాద్ రాష్ట్రం ఈ కోవకు చెందినదే) సామాజిక, ఆర్థిక పెత్తనం ఉన్నవాళ్లే తమ హోదా, స్థితి కారణంగా రాజకీయ వ్యవస్థపై పెత్తనం చెలాయించారు. హైదరాబాద్ రాష్ట్రంలో జాగీర్దార్లు, భూస్వాములు అధికారాన్ని చెలాయించిన సంగతి అందరికీ తెలిసిందే. మిగతా వర్గాల ప్రజలంతా పాలితులే.

బ్రిటిష్, ఫ్రెంచ్ విప్లవాల కారణంగా మధ్యయుగాల రాజకీయ వ్యవస్థలు పతనమై ఆధునిక ప్రజాస్వామ్యం ఆవిర్భవించింది. భూస్వాముల, మతాధికారుల గుత్తాధిపత్యం నుంచి రాజ్యం విముక్తి చెంది సార్వజనీన వ్యవస్థగా మారింది. అంటే సామాజిక హోదా, ఆర్థిక స్థితి లేకుండా రాజకీయాల్లో పాల్గొనకూడదన్న షరతు రద్దయింది.

సామాజిక హోదా, ఆర్థిక స్థితితో నిమిత్తం లేకుండా అందరూ రాజకీయాలలో పాల్గొనటానికి అవకాశం కలిగింది. హైదరాబాద్‌లో 1952 దాకా రాచరిక కుటుంబ సభ్యులు, భూస్వాముల పెత్తనం నడిచింది. 1952 ఎన్నికలతో ఆ పెత్తనం పోయి అందరికి ఎన్నికల్లో పాల్గొనే అవకాశం వచ్చింది. రాజ్యవ్యవస్థలో వచ్చిన ఈ మార్పు ప్రపంచ చరిత్రలోనే అత్యంత కీలకమైన మార్పుగా మార్క్స్ మహాశయుడు వర్ణించాడు.

ఇంక ప్రజాస్వామ్యానికున్న రెండవ అంశం ఎన్నికలు. ఈ ఎన్నికలే రాజ్యాన్ని అందరికీ చెందిన వ్యవస్థగా నిలబెడతాయి. ఎవరైనా ఎన్నికల్లో పోటీ చేయవచ్చు. ప్రజల మద్దతు పొందగలిగితే గెలిచి అధికారాన్ని చెలాయించవచ్చు. ఈ అవకాశం ఉండటం వలన మాయావతి అధికారం లోకి రాగలిగింది. మాయావతి గెలిచినప్పటి నుండి అణచివేయబడుతున్న వర్గాలకు ఎన్నికల ద్వారా న్యాయాన్ని పొందవచ్చునన్న ఆశ కలిగింది. ఎన్నికల ద్వారా న్యాయాన్ని పొందవచ్చునన్న భావనతోనే తెరాస తన వ్యూహాన్ని రూపొందించుకున్నది.

ఈ సిద్ధాంత చర్చ నుండి వాస్తవ ప్రపంచంలోకి వద్దాం. సిద్ధాంతం ప్రకారం ఎన్నికల్లో పోటీకి అందరికి సమానావకాశాలున్నాయి. కానీ వాస్తవంలో అందరికీ సమానమైన బలం లేదు. ఈ విషయాన్ని మార్క్స్ అద్భుతంగా వివరించాడు. ప్రజాస్వామ్య వ్యవస్థ రాజకీయ రంగంలో సమానత్వాన్ని తీసుకొచ్చింది కానీ సామాజిక, ఆర్థిక రంగాలలో అసమానతలను రద్దు చేయలేదని మార్క్స్ అంటాడు. సామాజిక, ఆర్థిక రంగాలలో అసమానతలు పోతేనే నిజమైన ప్రజాస్వామ్యం సాధ్యమని మార్క్స్ అన్నాడు. ఈ విషయాన్ని అంబేద్కర్ ఇంకొక విధంగా చెప్పినాడు. భారతదేశంలో రాజకీయరంగంలో ప్రజాస్వామ్యం వచ్చింది కానీ సామాజిక, ఆర్థిక రంగాలలో రాలేదని అంబేద్కర్ అన్నాడు. ప్రతిమనిషికి సమాన విలువనిచ్చే సామాజిక, ఆర్థిక వ్యవస్థ ఏర్పడకుండా రాజకీయ ప్రజాస్వామ్యం నిలబడలేదని హెచ్చరించాడు. లోహియా వంటి సోషలిస్టులు సామాజిక జీవితంలో సమానత్వాన్ని తేవడానికి ఏడు విప్లవాలు రావాలన్నారు.

ఈ అసమానతలు ఆంధ్రప్రదేశ్ సామాజిక జీవితంలో ఒక వాస్తవం. ఉమ్మడి రాష్ట్రంలోని వనరులను దోచుకొని బలపడిన ఆంధ్ర సంపన్న వర్గం ఆంధ్రప్రదేశ్ సామాజిక జీవితాన్ని శాసిస్తోంది. ఆ వర్గానికి రావణాసురునికున్నట్లు పది తలలు, పది చేతులు ఉన్నాయి. పత్రికలు, టి.వి.లు వారి విషపుత్రికలు, పార్టీలు వారి గుప్పెట్లో ఉన్నాయి. పాలనా యంత్రాంగంపై పట్టు వారిదే. సినిమాల ప్రొడ్యూసర్లు, కార్పొరేట్ కాలేజీలు, దవాఖానాల యజమానులు, ఫ్యాక్టరీల అధిపతులు, కాంట్రాక్టర్లు, రియల్ ఎస్టేట్ డీలర్లు – ఆంధ్ర సంపన్న వర్గాలు లేనిదెక్కడ.

ఇంతటి బలాన్ని ఎన్నికల్లో ఎదుర్కొనడానికి తెలంగాణ వాదానికున్న బలమేమిటి. డబ్బులు కుమ్మరించలేరు. చెన్నూరు నియోజకవర్గంలో డబ్బులు లేని ఓదెలు వంటి వ్యక్తులను నిలబెడితే బలహీనవ్యక్తులను నిలబెట్టిందని, మ్యాచ్‌ఫిక్సింగ్‌కు పాల్పడిందని తెరాసపై పత్రికలు పనికట్టుకుని ప్రచారం చేసినాయి. ప్రజలు నమ్మినారు. సంపన్నవర్గాల పార్టీలు డబ్బులు కుమ్మరించి ప్రత్యర్థి పార్టీ కార్యకర్తలను కొనగలరు. పత్రికలు, టి.వి.ల సాయంతో విషప్రచారానికి పాల్పడగలరు. తెలంగాణ ప్రజల నుండే తెలంగాణ నాయకత్వాన్ని దూరం చేయగలరు. వారి స్థానంలో దళారీ నాయకత్వాన్ని తెచ్చి నిలబెట్టగలరు.

కనుక ఆంధ్ర పెత్తనానికున్న మూలాలను, స్వభావాన్ని తెలుసుకొని దాన్ని ఎదిరించడానికి వ్యూహం లేకుండా తెలంగాణవాదులు ఎన్నికల్లో నిలబడలేరు. వలసాధిపత్యం కారణంగా తెలంగాణ ఎదుర్కొంటున్న సమస్యలను ప్రజలు గ్రహిస్తే అప్పుడు వారు ఆంధ్ర పెత్తనానికి వ్యతిరేకంగా ఒక శక్తిగా నిలబడగలరు. ప్రజలు సంఘటిత శక్తిగా మారితేనే ఆంధ్ర సంపన్నవర్గాల పెత్తనం కూలిపోతుంది. ప్రజలు చైతన్యవంతులైతే పాలక పార్టీలు ఏ మాయచేసినా ఎదుర్కొనగలరు.

నిత్య జీవితంలో ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలపై ఆందోళన చేస్తూ ప్రజలను వలసాధిపత్యానికి వ్యతిరేకంగా కదిలించగలిగితే తెరాస బలమైన రాజకీయ శక్తిగా మారేది. అట్లా చేయలేదు. అందువలన తన బలహీనతల నుండి బయట పడటానికి పొత్తుల కొరకు ప్రయత్నించింది. ఆంధ్ర సంపన్నవర్గాల పార్టీలతో తెలంగాణ చైతన్యం పొందిన ప్రజలు ఆమోదించలేదు. కనుక పొత్తుల వలన తెరాస మరింత బలహీనపడింది. ఇన్ని బలహీనతలున్నా తెలంగాణవాదులను కలుపుకొని పోతే ఫలితాలు మెరుగ్గా ఉండేవి. కానీ తెదెపా, తెరాస కలిస్తే గెలుపు ఖాయమని భావించారు. ఇంక ఎవ్వరి మద్దతు అవసరం లేదనుకున్నారు. తెరాస వ్యూహరచన గాలిలో సాగింది. ప్రజల స్థితిని విస్మరించి, వాస్తవాలకు దూరంగా ఎ.సి. గదుల్లో వ్యూహ రచన చేస్తే ఆ వ్యూహానికి ప్రజామోదం రాదు. ఈ విషయాన్ని ఎన్నికలు స్పష్టం చేస్తున్నాయి.

అయితే తెరాస ఓటమిని అందరూ ఒకే కోణం నుండి చూడటం లేదు. ఆంధ్ర సంపన్న వర్గాలకిది తెలంగాణ ఓటమి. కానీ తెలంగాణ ప్రజలు ఈ ఓటమి తెరాస వ్యూహం ఓటమిగా చూస్తున్నారు. తెలంగాణ వాదులు ఈ ఎన్నికల నుండి గుణపాఠం నేర్చుకోవాలంటున్నారు. సమస్యల ఆధారంగా తెలంగాణ ప్రజలను కదిలించే ఆందోళను నిర్మించ వలసిన ఆవశ్యకతను ఈ ఎన్నికలు ఎత్తి చూపుతున్నాయి. అందుకు తెరాస సిద్ధం కావాలని, ఆ దిశగా సాగే ప్రయాణంలో అన్ని సంఘాలను కలుపుకొని పోవాలని తెలంగాణవాదులు కోరుకుంటున్నారు. వీ

ప్రజలకు మంచినీళ్లు కూడా ఇవ్వలేని పాలకుల వైఫల్యాన్ని, ప్రాణాలు తీస్తున్న అధికారుల నిర్లక్ష్యాన్ని, సంక్షేమ దృష్టి లేని విధానాల్ని వివరిస్తున్నారు డి.వి. రామకృష్ణారావు

# పాలకుల వైఫల్యం భోలక్‌పూర్

నాలుగు వందల సంవత్సరాలకు పైబడిన చరిత్ర కలిగిన హైదరాబాద్ నేడు అనేక సమస్యలతో అతలాకుతలం అవుతోంది. ఒకప్పుడు వెయ్యి సరస్సుల నగరంగా పేరుగాంచిన హైదరాబాద్ ఇవ్వాళ మంచినీళ్ల కోసం కటకటలాడుతోంది. నదులు ప్రవహించినంత మేర మనుషులూ, నాగరికతా వ్యాప్తి చెందాయి. భూమి పైనా, మనిషి శరీరంలో 70 శాతం పైగా నీరే ఉంది. జీవరాశి మనుగడకు నీటి అవసరం ఎంతో మనకు తెలిసిందే. అయితే నీళ్లూ, భూమి లాంటి సహజ వనరులు లాభసాటి వ్యాపారంగా మారిపోయాక వీటి కొరత నగరంలో మరింత పెరిగిపోయింది. హైదరాబాద్ పెరుగుదల జలాశయాల కబ్జాతోనే జరిగిందన్న వాస్తవం నగరంలో కొద్దిపాటి వర్షం పడినప్పుడల్లా జల మయమయి పోయే ప్రాంతాల ద్వారా మనకు అవగతమవుతూనే ఉంది. హైదరాబాద్ పెరుగుదల అస్తవ్యస్తంగా జరిగిన చరిత్ర ఒక పక్కనుంటే, మరోవైపు ఇప్పటికీ నిజాం నాటి తుప్పు పట్టిన కట్టడాల మీదే ఆధారపడిన స్థితి ఉంది. సమస్యలు పేరుకుపోయిన నగరంలో భోలక్‌పూర్‌లు మనల్ని ఉలిక్కిపాటుకు గురిచేస్తూ ఉంటాయి. నగరంలో గాలీ, నీరూ, నేలా అన్నీ కాలుష్యం బారినపడి మనిషి మనుగడే ప్రమాదకరంగా పరిణమిస్తోంది.

ఇక భోలక్‌పూర్ ఉదంతానికి సంబంధించిన వాస్తవాలు బయటకు రాలేదు. అసత్యాలు, అర్ధసత్యాలు ప్రచారంలోకి వచ్చాయి. ఘటన వాస్తవాలను మనమంతా తెలుసుకోవాలి. అక్కడి బాధితుల, ప్రజల కోణం నుంచి సమస్యను చూడాలి. మునిసిపల్ అధికారులూ, ఆధిపత్య రాజకీయ వర్గాల ఆలోచనలే ప్రచారంలోకి వచ్చాయి. మతపరమైన రంగును పులిమే ప్రయత్నం కూడా జరుగుతోంది.

భోలక్‌పూర్ అనేకానేక దిగువ మధ్యతరగతి ప్రజలు నివసించే ప్రాంతం. చిన్న చిన్న ఇళ్లు, చిన్న చిన్న గల్లీలు ఉన్న ఇరుకైన ప్రాంతం. బేర్‌బన్ గల్లీ, రంగానగర్, భోలక్‌పూర్ హౌస్, సిద్ధిక్‌నగర్, తాగిర్‌నగర్, గుల్షన్‌నగర్, ఇందిరా నగర్ అనే బస్తీలు ఇక్కడ ఉన్నాయి. దాదాపు వంద సంవత్సరాల క్రితం వెలసిన ఈ బస్తీల్లో పదివేలకు పైగా ఇళ్లున్నాయి. దాదాపు యాభై వేలమందికి పైగా నివసిస్తున్నారు. ఇక్కడ ప్రజలు చిన్న చిన్న వ్యాపారాలు చేసుకుని బతుకుతున్నారు. తోళ్ల మార్కెట్, బట్టల మార్కెట్, చెత్త నుంచి ఏరిన పాత సామాన్లు, ప్లాస్టిక్, ఇనుప సామాన్ల మార్కెట్లకు ఈ ప్రాంతం ప్రసిద్ధి. నగరంలో మాత్రమే కాదు దేశం నలుమూలలకు ఇక్కడి నుంచి వ్యాపార లావాదేవీలు ఉన్నాయి. ఇది చాలా చరిత్ర గలిగిన ప్రాంతం. విశిష్టతంతా తోళ్లపరిశ్రమల వల్లే వచ్చింది.

గతంలో పశు వధ్యశాల ఇక్కడే ఉండేది. ఐదారు సంవత్సరాల క్రితం ఇక్కడి నుంచి వధ్యశాలను చర్లపల్లికి తరలించివేసారు. తోళ్లకు ఉప్పు రాసి ఆ తోళ్లను శుద్ధి చేసే కర్మాగారాలకు అమ్మేవారు. శుద్ధి అయిన తోళ్లను ముంబాయి, కాన్పూర్, ఆగ్రా వంటి ప్రాంతాలకు అమ్మేది. వధ్యశాలను మార్చిన తరువాత తోళ్లను శుద్ధి చేసే కంపెనీలు ఇక్కడి నుంచి తరలిపోయాయి. నిజానికి తోళ్లను శుద్ధి చేసే కర్మాగారాలు ఇప్పుడు అక్కడ లేవు. కేవలం తోళ్లను సేకరించి అమ్మే పని మాత్రమే జరుగుతోంది. తోళ్లను తెచ్చి అమ్మే మండీలను, వ్యాపారాల కేంద్రాలనే ఇప్పుడు శుద్ధి చేసే కర్మాగారాలుగా పొరబడుతున్నారు. అందువలన తోళ్లను శుద్ధి చేసే పని ఇప్పుడక్కడ జరగడం లేదు. కాలుష్యం, అనర్థాలు ఏమీ లేవు. ఇతరత్రా సమస్యలు కూడా లేవు.

వాస్తవానికి భోలక్‌పూర్‌కు ఉత్తరాన ఉన్న కల్పన థియేటర్, ప్రాగా టూల్స్ ప్రాంతం నుంచి డ్రైనేజ్ పైప్‌లైన్, మంచినీళ్ల పైప్‌లైన్లు భోలక్‌పూర్‌కు ప్రవేశించి దక్షిణం వైపుకు వెళతాయి. తోళ్ల మండీలు భోలక్‌పూర్ బస్తీలో దక్షిణాన ఉన్నాయి. తోళ్ల వలన ఏదైనా ఇబ్బంది కలిగితే అది మరింత దిగువ ప్రాంతానికి ఉంటుంది తప్ప భోలక్‌పూర్ ప్రాంతానికి కాదు. దక్షిణాన కలరా సోకిన ప్రాంతాలు లేవు. ఈ మండీలకూ కాలుష్యానికీ సంబంధం లేదు. అక్కడి వైద్యులే చెబుతున్న దాన్ని బట్టి ఇంత పెద్ద ఎత్తున కలరా, వాంతులూ, విరోచనాలూ గతంలో ఎన్నడూ సంభవించలేదు. తోళ్ల వల్లే అయితే ఈపాటికే ఎప్పుడో ఇలాంటి ఆరోగ్య సమస్యలు తలెత్తి ఉండాలి. ఈ ఆరోపణలను పక్కనబెడితే గాని మనకు వాస్తవాలు అర్థం కావు.

**భోలక్‌పూర్ మంచినీళ్ల కాలుష్యానికి బలైనవారు**

1. సయ్యద్ ఉస్మాన్ (65); 2. తయ్యబా తరున్నం (15); 3. అమానుల్లా (4); 4. ఆయేషా సిద్దిఖీ (4); 5. హబీబీ (65); 6. కౌసల్యా బాయి (84); 7. ఫిరోజ్ (7); 8. సుమేరా (3); 9. మొహమ్మద్ యాసీన్ (68); 10. పేరు లభ్యం కాలేదు; 11. ఆండాలమ్మ (68); 12. మొహమ్మద్ అబ్దుల్ హాజ్ (72); 13. పేరు లభ్యం కాలేదు; 14. ఎం. సక్కుబాయి (64)

(మే 16 వరకు మృతి చెందినవారు)

భోలక్‌పూర్ ప్రాంతంలో నిజాం కాలం నాటి మంచినీటి పైపు లైన్లు, డ్రైనేజీ పైపులైన్లే ఇప్పటికీ కొనసాగుతున్నాయి. పైపులైన్లు వేసినప్పుడు ప్రతి ఇరవై ఏళ్లకొకసారి పైపులైన్లను మార్చాలని నిర్ణయించారు. అవన్నీ ఎప్పుడో తుప్పు పట్టిపోయాయి. ఈ విషయం స్వయంగా మునిసిపల్ శాఖ వారి అధ్యయనాల్లో వెల్లడైంది. ఈ వరకే హెచ్చరికలు కూడా చేశారు. అయినా ఈ విషయం మీద ప్రభుత్వం దృష్టి పెట్టలేదు.

హైదరాబాద్ నగర పాలక సంస్థకు వచ్చే ఆదాయంతో గానీ, హుడా భూములు అమ్మితే వచ్చిన డబ్బుతో గానీ పైపు లైన్ల రిపేరు చేసి, మంచినీటి సౌకర్యం మెరుగుపర్చవచ్చు. కావల్సిన చర్యలు తీసుకోవచ్చు. కాని సాఫ్ట్‌వేర్ కంపెనీల విస్తరణకు, విదేశీ పెట్టుబడులను ఆకర్షించడానికి ఈ డబ్బు మొత్తాన్ని వినియోగించారు. ముఖ్యంగా నగర సుందరీకరణకు, రింగ్‌రోడ్లు, ఫ్లై ఓవర్ల నిర్మాణాలకు వినియోగించారు. ఈ నిర్లక్ష్యమే ప్రస్తుత ఉపద్రవానికి కారణం. ఒక భోలక్‌పూరే కాదు, నగరమంతటా గోరటి ఎంకన్న అన్నట్లు 'నల్లా పైపులు డ్రైనేజ్ పైపులతో వియ్యమందుకున్నాయి'. మరో కోణం ఏమంటే నల్లా పైపులు, డ్రైనేజ్ పైపుల రిపేర్లు నిపుణులైన కార్మికుల చేత చేయించడం లేదు. అనుభవంలేని కాంట్రాక్ట్ కార్మికులతో ఈ పనులు చేయిస్తున్నారు. అందుకే ఈ లీకేజీలు మరింత ఎక్కువ అవుతున్నాయి.

కొత్తగా ఇచ్చే నల్లా కనెక్షన్లకు స్థానిక నాయకులే అనుమతులూ, పనుల మంజూర్లూ చేసేస్తున్నారు. ఎవరికి తోచిన విధంగా వారు నైపుణ్యం లేని కార్మికుల సహకారంతో ఈ కనెక్షన్లకు పూనుకోవడంతో సమస్య మరింత జటిలమయిపోయింది. గ్రేటర్ జలమండలి పరిధి ఐదు వేల కిలోమీటర్ల మేరకు విస్తరించింది. ప్రతి కిలోమీటర్‌కు ఒక కార్మికుడు అవసరం ఉండగా, ప్రస్తుతం 1300 మంది కార్మికులు మాత్రమే ఉన్నారు. చాలా కాలంగా నల్లా పైపుల నుంచి డ్రైనేజ్ నీళ్లు రావడం గురించి ఇక్కడి ప్రజలు, స్థానిక నాయకులు మునిసిపల్ అధికారులకు విన్నవించుకుంటూనే ఉన్నారు. నగరంలో వర్షంపడి, నీళ్లు పోగయి ట్రాఫిక్‌కు సమస్య అయితే పత్రికల్లో పెద్ద వార్త అవుతోంది కాని, పేదలకు అందే మంచినీళ్లు, డ్రైనేజ్ సమస్యలు వార్త కాలేకపోతున్నాయి. పాలకుల అలసత్వం పెరిగి పెరిగి ఇవ్వాళ్టి కలరాకు కారణమయ్యింది. ప్రైవేట్ వైద్యులు దగ్గరకు వైద్యం కోసం పోయిన కొందరు వాంతులు, విరోచనాల నివారణకు నీళ్ల మరగబెట్టి తాగడం మొదలుబెట్టారు. ఇలా నీరు వేడిచేసి తాగడం వలన కొంతమంది ఈ పరిస్థితిని కాస్త ఎదుర్కోగలిగారు.

ప్రభుత్వ ప్రాథమిక ఆరోగ్య వ్యవస్థ లేకపోవడం, ఆ ఆరోగ్య వ్యవస్థ బస్తీల వరకూ విస్తరించకపోవడం, ఉన్న ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు మునిసిపాలిటీలతో సమన్వయం లేకపోవడంతో సమస్య మరింత ముదిరిపోయింది. ఈ నీళ్ల కాలుష్యంతో పద్నాలుగు మంది ఇప్పటికే చనిపోగా, వందలాది మంది గాంధీ ఆసుపత్రిలో చికిత్స పొందుతున్నారు. ఈ విధంగా మాత్రమే ఆ సమస్య అందరి దృష్టికి రాగలిగింది. దీంతో ప్రభుత్వం కూడ స్పందించాల్సి వచ్చింది. చనిపోయిన వారిలో పిల్లలూ, స్త్రీలే ఎక్కువగా ఉన్నారు. పోషకాహార లోపం వలన, రోగ నిరోధక శక్తి లేకపోవడం వలన వెంటనే మృత్యువాతన పడినట్లు తెలుస్తోంది. పౌష్టికాహార లోప నివారణకు కూడా పెద్ద ఎత్తున చర్యలు చేపట్టాల్సిన అవసరాన్ని ఈ సంఘటన సూచిస్తోంది.

మునిసిపాలిటీ, మంచినీళ్లూ, మురుగునీరూ యాజమాన్య వైఫల్యాలపై చర్చ మొదలైంది. మంచినీటి, మురుగునీటి బోర్డ్ అధికారుల నిర్లక్ష్య వైఖరి, అసమర్థత వెలుగులోకి వచ్చాయి. ప్రజలూ, పత్రికలూ వారిని నిలదీయడం ప్రారంభించాయి. ఇంతదాకా వచ్చాక ప్రభుత్వం ఇద్దరు అధికారులను సస్పెండ్ చేసింది. ఇదే క్రమంలో బోర్డ్ తన తప్పులు కప్పిపుచ్చుకోవడానికి సాకులు వెతకడం ప్రారంభించింది. వాళ్ల జోక్యంతోనే అక్కడ లేని తోళ్ల పరిశ్రమను చిత్రీకరించడం ప్రారంభమైంది. ముఖ్యమంత్రి కూడా ఈ ప్రచారాన్ని నమ్మారు. తోళ్ల పరిశ్రమను ఎత్తెయ్యాలని ఉత్తర్వులు ఇచ్చారు. ఆ ఉత్తర్వుల వ్యవహారం 'దున్నపోతు ఈనిందంటే దూడెను కట్టెయండనట్లు' ఉంది.

నిజానికి ఇక్కడ ఉన్న మండీలు ఎత్తివేస్తే తీవ్రమైన అనర్థాలు జరుగుతాయి. గతంలోని భోలక్‌పూర్ మండీల సంఖ్యను ప్రస్తుతం ఉన్న మండీల సంఖ్యతో పోలిస్తే మిగిలినవి పది శాతం మాత్రమే. దీనికి తోడు అంతర్జాతీయంగా తోళ్ల ధరలు కూడా తగ్గడంతో భారతదేశంలోని తోళ్లకు, తోళ్ల ఉత్పత్తులకు గిరాకీ పడిపోయింది. ఐ.టి. రంగం, ఐ.టి. ఆధారిత పరిశ్రమలే పరిశ్రమలుగా భావిస్తున్న ఈ తరుణంలో తోళ్ల సమస్య అసలు సమస్యగా కూడా మన పాలకులకు కనబడడం లేదు. ఎంతోమంది బతుకు తెరువుకు కారణమవుతున్న ఈ తోళ్ల పరిశ్రమ అభివృద్ధికి ప్రభుత్వం ఎటువంటి చర్యలు తీసుకోలేదు. ఈ చితికిపోయిన స్థితిలో కూడా భోలక్‌పూర్ మండీలపై ఆధారపడి అయిదువేల మంది బతుకుతున్నారు. పతనమవుతూ వస్తున్న తోళ్ల పరిశ్రమ స్థానంలో ఇప్పుడు పాత ప్లాస్టిక్ సామాన్ల వ్యాపారం ప్రత్యామ్నాయ ఉపాధిగా ముందుకు వచ్చింది. వీటి మీద వచ్చిన ఆదాయంతోనే వర్తకులు ఇచ్చే చందాలు కలుపుకొని విద్యాలయం, దవఖానాలను స్థానిక ప్రజలు నడిపిస్తున్నారు. ఈ విద్యాలయంలోనే ఎంతోమంది పేద ముస్లిం విద్యార్థులు చదువు కుంటున్నారు. దవఖానాలో వైద్యాన్ని పొందుతున్నారు.

మునిసిపల్ అధికారుల అనాలోచిత చర్యలతో ఈ మండీలు ఎత్తివేస్తే అనేక ఆకలి చావులు, ఆత్మహత్యలు సంభవిస్తాయి. ప్రజల ఉపాధి అవకాశాలు దెబ్బతింటాయి. రోగం ఒకటైతే చికిత్స మరొకటి చెయ్యడం సరికాదు. ఇవాళ జరగాల్సింది మంచినీళ్ల పైపుల పునరుద్ధరణ. ఎంతోమంది ప్రజలకు జీవనాధారంగా ఉన్న తోళ్ల పరిశ్రమ, మండీ వ్యాపారాన్ని పెంపొందించడానికి ప్రభుత్వం చర్యలు చేపట్టాలి. ఈ వృత్తుల మీద ఆధారపడుతున్న వాళ్లు ముస్లింలే. సచార్ కమిటీ నివేదిక ఆధారంగా విద్య, ఉపాధులలో ముస్లింలు చాలా వెనుకబడి ఉన్నారు. ఇటువంటి పరిస్థితులలో ముస్లింల ఉపాధి సౌకర్యాలు పెంచడానికి భోలక్‌పూర్‌ను ప్రభుత్వం ఒక నమూనాగానైనా తీసుకొని అభివృద్ధి చేయాలి. భోలక్‌పూర్ ఒక హెచ్చరిక మాత్రమే. ప్రమాదకరంగా మారక ముందే పాలకులు జాగ్రత్త వహించాలి. జాగ్రత్త పడకుంటే ఈ అనర్థాలు భోలక్‌పూర్‌కు మాత్రమే పరిమితం కాక నగరమంతటా విస్తరిస్తాయి.

నిజాం ఫ్యూడల్ రాజే అయినా కనీసం మంచినీళ్లు ప్రజలకు ఇవ్వాలనే సంస్కారాన్ని ప్రదర్శించాడు. 'దేవుడు ఇచ్చిన నీళ్లను ప్రజల దాకా మనం తీసుకువెళ్తున్నాం అంతే, దీనిపై పన్నులేమిటి' అని ఒక సందర్భంలో నిజాం అన్నాడు. పన్నులు కట్టలేకపోయినా పైపులు తీయకపోయేది. ఈ సరళీకరణ యుగంలో ఆపాటి మానవతా దృక్పథం కూడా పాలకులకు లేకపోయింది. ఈ విషపు నీళ్ల కోసమేనా ప్రజలు పన్నులు కడుతున్నది.

*(భోలక్‌పూర్‌లో విస్తృత అధ్యయనం జరిపిన* ***ఎం. కోదండరాం*** *గారి సహకారంతో)*

**తమిళజాతి పోరాట చరిత్రను వివరిస్తూ, వారిపై జరుగుతున్న హత్యాకాండలో కేవలం శ్రీలంక మాత్రమే లేదనీ, దాని వెనుక ఉన్న అమెరికన్ సామ్రాజ్యవాదం, భారత విస్తరణ కాంక్షలను వివరిస్తున్నారు** **ఎం. శ్రీనివాసరావు**

# శ్రీలంక తమిళజాతిపై హత్యాకాండ

గత కొన్ని నెలలుగా శ్రీలంక తమిళ ప్రజలపై యుద్ధం కొనసాగుతోంది. అది ఉగ్రవాదం పై యుద్ధం పేరుతో జరుగుతోంది. ప్రభాకరన్ కు లొంగిపోవడమో, యుద్ధంలో మరణించడమో రెండే మార్గాలుగా అధ్యక్షుడు మహిందరాజపక్షే మాట్లాడుతున్నారు. ఇటు పత్రికలూ ప్రసార సాధనాల్లో వస్తున్న వార్తలు ప్రజల అవస్థల తీవ్రతను తెలుపుతున్నాయి. జనం లేని, జనం ప్రాణాలకు విలువలేని భూభాగం ఎందుకంటూ అష్టకష్టాలు పడి సముద్ర మార్గం గుండా కాకినాడ తీరానికి చేరుకున్న శ్రీలంక ముల్లైత్తీవు తమిళులు మాట్లాడుతున్నారు. ఈ యుద్ధంలో ఐక్యరాజ్యసమితి అంచనాల ప్రకారం ఇప్పటికి అరవై వేలమంది, ఎల్.టి.టి.ఇ. చెప్తున్న దాని ప్రకారం లక్షమంది తమిళులు మరణించారు.

శ్రీలంక మనదేశంలోని తమిళనాడుకు ఆగ్నేయంగా 25 కిలోమీటర్ల దూరంలో ఉంది. 1600 కిలోమీటర్ల సముద్ర తీరం 65,610 చదరపు కిలోమీటర్ల వైశాల్యం కలిగి భారతదేశ వైశాల్యంలో ఏభైవ వంతు ఉంటుంది. ఇక్కడ ఉన్న జనాభా సుమారు రెండు కోట్లు. వీరిలో సింహళీయులు 74 శాతం, తమిళులు 18 శాతం, ముస్లింలు 7 శాతం, మిగిలిన రెండు శాతంలో వీరి మూలవాసులైన వెద్దాలు, మలేషియన్లు, యూరోపియన్లు ఉన్నారు. మతపరంగా చూసినప్పుడు బౌద్ధులు 69.3 శాతం, హిందువులు 15.5 శాతం, క్రిస్టియన్లు 7.6 శాతం, ముస్లింలు 7.5 శాతం, ఇతరులు 1 శాతం ఉన్నారు. సింహళులు 2500 సంవత్సరాల క్రితం భారతదేశం నుండి ఇక్కడకు వచ్చారు. తమిళులు దక్షిణ భారతంలోని తమిళనాడు నుండి ఇక్కడకు వచ్చి స్థిరపడ్డారు. వీరుగాక 19వ శతాబ్దంలో బ్రిటిష్‌వారు తేయాకు తోటలలో పని చేయించేందుకు తమిళనాడు నుండి తీసుకు వచ్చినవారు కూడా ఉన్నారు. తమిళులు ప్రధానంగా శ్రీలంక ఉత్తర, తూర్పు ప్రాంతాలలోను, మధ్య శ్రీలకంలోని ఎత్తైన కొండలలో తేయాకు తోటలలో పనిచేస్తుంటారు.

క్రీ.పూ. 161 నుండి 117 వరకు ఎల్లలన్ అనే తమిళరాజు సింహళరాజులను ఓడించి లంకను పరిపాలించినట్లు చరిత్ర ఉంది. ఎల్లలన్ ను ఓడించి తుత్తకైమును అధికారం చెపట్టాడు. తర్వాత విజయభాను అనే సింహళరాజు అనురాధపుర రాజధానిగా లంకను పరిపాలించాడు. క్రీ.శ. 993లో రాజరాజచోళుడు ఉత్తర శ్రీలంకను ఆక్రమించి ముమ్మిడి చోళమండలమని పేరు పెట్టాడు. ఈ విధంగా శ్రీలంక ఉత్తర ప్రాంతాన్ని తమిళ పాలకులు, దక్షిణ ప్రాంతాన్ని సింహళ పాలకులు పరిపాలించినారు.

ఆ తర్వాత క్రీ.శ. 1500 లో పోర్చుగీస్ వారి వలసగా శ్రీలంక మారిపోయింది. క్రమంగా 17వ శతాబ్దంలో డచ్‌వారి అధీనంలోకి, 18వ శతాబ్దంలో బ్రిటిష్‌వారి అధీనంలోకి వెళ్లిపోయింది. 1900లో సింహళ, తమిళ ప్రాంతాలన్నిటినీ బ్రిటిష్‌వారు ఒకే పాలనా యంత్రాంగం కిందికి తీసుకువచ్చారు. 13,14 శతాబ్దాల్లో అరబ్ నుండి, భారత్ నుండి ముస్లింలు శ్రీలంక వచ్చి స్థిరపడ్డారు. 150 సంవత్సరాలకు పైగా శ్రీలంక బ్రిటిష్‌వారి అధీనంలో ఉంది. అక్కడి నుండి 4 ఫిబ్రవరి 1948 న శ్రీలంక స్వతంత్రం పొందింది.

తర్వాత యునైటెడ్ నేషనల్ పార్టీ (యుఎన్‌పి) మొదట అధికారం చేపట్టింది. దాని నుండి చీలిపోయి 1951లో బండారునాయకే శ్రీలంక ఫ్రీడం పార్టీ (ఎస్.ఎల్.ఎఫ్.పి.) స్థాపించారు. 1957లో అధికారంలో కొచ్చారు. తమిళులకు పరిమితమైన అధికారాలు ఇస్తూ తమిళ నాయకుడు సెల్వరాజన్‌తో ఒక ఒప్పందం కుదుర్చుకొన్నారు. యుఎన్‌పి దీనిని విమర్శించింది. దీంతో అది అమలకు నోచుకోలేదు. 1960లో తిరిగి యుఎన్‌పి అధికారంలోకొచ్చింది. డడ్లీసేన నాయకే ప్రధాని అయ్యారు. ఇప్పుడు ఎస్.ఎల్.ఎఫ్.పి. దీనిని విమర్శించింది. ఈ విధంగా రెండు పార్టీలూ తమిళ సమస్యను తమ రాజకీయ ప్రయోజనాల కోసం ఉపయోగించుకున్నాయి. 1948 నుండి ఏ సింహళ పార్టీ అధికారంలో ఉన్నా తమిళులపై తీవ్రమైన అణచివేత కొనసాగించింది. వారి మౌలిక హక్కులను హరించివేయడం జరిగింది. విద్య, ఉద్యోగ రంగాల్లో తీవ్రమైన వివక్ష కొనసాగింది. సింహళ అనుకూల ల్యాండ్ సెటిల్‌మెంట్ పథకాల వల్ల ఉత్తర, తూర్పు ప్రాంతాల్లో లక్షలాది మంది తమిళ ప్రజలు నిర్వాసితులయ్యారు. పార్లమెంట్ బౌద్ధమతాన్ని అధికార మతంగా తీర్మానించింది. సింహళ భాషను అధికార భాషగా ప్రకటించింది. తమిళ విద్యార్థులు సింహళ విద్యార్థులకంటే విద్య, ఉద్యోగాల్లో ఎక్కువ మార్కులు తెచ్చుకోవాలనే నిబంధన విధించింది. ఈ విధంగా తమిళులు అన్ని రంగాల్లో స్వదేశంలోనే రెండవ తరగతి పౌరులుగా బతకాల్సి వచ్చింది. ఫలితంగా రగులుకున్న తమిళుల పోరాటాలను సైన్యంతోను, 1979లో చేసిన ప్రివెన్షన్ ఆఫ్ టెర్రరిజం ఆక్ట్ వంటి నల్లచట్టాలతోను అణచివేయ పూనుకొన్నది.

తమ న్యాయమైన హక్కులకోసం శ్రీలంక తమిళులు మొదటి నుండి అనేక చట్టబద్ధ, ప్రజాస్వామిక పోరాటాలు చేశారు. 1956, 1958లలో తమిళ పార్లమెంట్ సభ్యులందరూ మూకుమ్మడి రాజీనామాలు చేశారు. వరుస నిరసనలు, బంద్‌ల ద్వారా ప్రభుత్వానికి తమ మనోభావాలను వ్యక్తం చేశారు. అప్పటి నుండి ఇప్పటివరకు

ప్రభుత్వ స్పందన అణచివేత రూపంలోనే కొనసాగుతోంది. మొట్టమొదటి సారిగా 1958లో అట్లాంటి సైనిక అణచివేతకు వ్యతిరేకంగా పెద్ద ఉద్యమం జరిగింది. తర్వాత 1983లో ఒక పెద్ద తమిళ ఉద్యమం జరిగింది. వీటిపై ఉక్కుపాదం మోపి వందలాది మంది పై సామూహిక హత్యాకాండ కొనసాగించింది. ఫలితంగా వేలాదిమంది తమిళ యువకులు స్వతంత్ర తమిళ రాజ్యం కోసం సాయుధ పోరాటం వైపు మళ్లారు.

నిజానికి శ్రీలంక తమిళుల కోసం ఆరు, ఏడు పార్టీలు ఏర్పడి పనిచేస్తున్నాయి. తమిళ ముస్లింల కోసం శ్రీలంక ముస్లిం కాంగ్రెస్, తేయాకు తోటలలో పనిచేసే తమిళుల హక్కుల కోసం సిలోన్ వర్కర్స్ పార్టీ, ఉత్తర, తూర్పు ప్రాంత తమిళుల ప్రయోజనాల కోసం తమిళ యునైటెడ్ లిబరేషన్ ఫ్రంట్ (టి.యు.ఎల్.ఎఫ్.), ఈలం పీపుల్స్ రివల్యూషనరీ లిబరేషన్ ఫ్రంట్ (ఇ.పి.ఆర్.ఎల్.ఎఫ్.)లు పని చేస్తూ ఉన్నాయి. ఇవన్నీ తమిళుల కోసం పనిచేస్తున్నా వేలుపిళ్లై ప్రభాకరన్ నేతృత్వంలోని లిబరేషన్ టైగర్స్ ఆఫ్ తమిల్ ఈలం (ఎల్.టి.టి.ఇ.) ఏకైక తమిళ ప్రాతినిధ్య సంస్థగా అవతరించింది. సాయుధ పోరాటంలో కొత్త పద్ధతులు అనుసరించి ఆత్మాహుతిదాడులను ప్రారంభించింది. జాఫ్నాతో సహా ఉత్తర తూర్పు ప్రాంతాలను తన అధీనంలోకి తెచ్చుకొన్న ఎల్.టి.టి.ఇ. శ్రీలంక జాత్యహంకార ప్రభుత్వానికి సమాంతర ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది. అసలు తమిళ ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్షలలో భాగంగా 1977లో తమిళ పార్లమెంటరీ పార్టీలన్నీ కలిసి తమిళ్ యునైటెడ్ లిబరేషన్ ఫ్రంట్ (టి.యు.ఎల్.ఎఫ్.) ఆధ్వర్యంలో ప్రత్యేక తమిళరాజ్యం కోసం చరిత్రాత్మక వెట్టుకొట్టై తీర్మానాన్ని ప్రవేశ పెట్టడం జరిగింది. అక్కడ ప్రారంభమైన ప్రత్యేక తమిళరాజ్య నినాదం ఎల్.టి.టి.ఇ. ఆవిర్భావంతో తమిళ ప్రజల ఆకాంక్షలకు ఒక రూపం వచ్చినట్లయింది.

ఒక దశలో యు.ఎన్.పి. పార్టీ అధికారంలోకొచ్చి అప్పటివరకు ఉన్న ఫెడరల్ రాజ్యాంగ వ్యవస్థను మార్చి యూనిటరీ వ్యవస్థను ప్రవేశపెట్టింది. దీని ప్రకారం యు.ఎన్.పి. నాయకుడు జయవర్ధనే ఎల్.టి.టి.ఇ. పాలనలో ఉన్న రాష్ట్రాలను కేంద్ర పాలనలోకి తీసుకు వచ్చేందుకు సైనికచర్య చేపట్టడంతో అది అంతర్యుద్ధం దాల్చి డెబ్బైవేల మంది చనిపోయారు. లక్షమంది కాందిశీకులైపోయారు. అప్పటినుండి అమెరికా దాని కనుసన్నలలో మెలిగే భారత్‌ల ప్రత్యక్ష, పరోక్ష సహకారంతో శ్రీలంక ప్రభుత్వం తమిళులపై అపరిమితమైన అణచివేత, హత్యాకాండ కొనసాగిస్తోంది. ఈ సామూహిక హత్యాకాండ 1995 లోను, 2000లోను, 2002లో కాల్పుల విరమణ ఒప్పందం రద్దైనపుడు మరల ఇప్పుడు 2008లో ప్రారంభమై నిరాటంకంగా సాగుతోంది.

నిజానికి ఎల్.టి.టి.ఇ. అధీనంలోని ప్రాంతాల్లో స్వతంత్ర పరిపాలనా వ్యవస్థ, పన్నుల వ్యవస్థ, న్యాయవ్యవస్థ, బ్యాంకింగ్‌లు ప్రారంభమై పనిచేస్తున్నవి. ఒక్క కరెన్సీ మాత్రమే శ్రీలంక కరెన్సీ తప్ప వ్యవసాయం, సాగునీరుతో సహా అన్ని ప్రత్యేక వ్యవస్థలూ ఏర్పాటు చేసుకున్నారు. పాలక శ్రీలంక సింహళ జాతీయవాద పార్టీలు తమిళ వేర్పాటువాదంగా అణచివేయ ప్రయత్నిస్తే పొరుగున ఉన్న దేశాలు, పాశ్చాత్య దేశాలు అవకాశవాద వైఖరిని అవలంబించాయి. ఇందిరాగాంధీ పాలనలో టి.యు.ఎల్.ఎఫ్. నేతృత్వంలోని తమిళులకు సైనిక, ఆయుధ సహకారం అందిస్తే రాజీవ్‌గాంధీ పాలనలో శాంతి పరిరక్షణ పేరుతో తమిళుల అణచివేతకు సైన్యం పంపబడింది. చావుతప్పి కన్ను లొట్టపోయి సైన్యం తిరిగి వచ్చింది.

తిరిగి యూనిటరీ వ్యవస్థను రద్దు చేసి ఫెడరల్ వ్యవస్థను ఏర్పాటు చేసి చర్చల ద్వారా తమిళ సమస్యను పరిష్కరిస్తామని 1993 ఆగస్ట్‌లో జరిగిన పార్లమెంట్ ఎన్నికల్లో గెలిచి చంద్రిక కుమారతుంగ ప్రధాని అయింది. 1994 అక్టోబర్‌లో ప్రభుత్వం ఎల్.టి.టి.ఇ. మధ్య చర్చలు జరిగాయి. 1994లో జరిగిన ఎన్నికల్లో గెలిచి చంద్రిక అధ్యక్షురాలైంది. 1995 అక్టోబర్‌లో ప్రభుత్వం సైనిక చర్యకు పూనుకుంది. డిసెంబర్‌లో జాఫ్నా పట్టణాన్ని ఎల్.టి.టి.ఇ. నుండి లాక్కుంది. 1996 జూలైలో ముల్లైతీవు సైనిక శిబిరంపై ఎల్.టి.టి.ఇ. దాడి జరిపి 1200 మంది సైనికులను హతమార్చింది. విలువైన ఆయుధాలను సంపాదించింది. అయితే అక్టోబర్‌లో జాఫ్నా తర్వాత తమిళులు అధికంగా ఉండే కిల్లోనొచ్చిని ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది. తర్వాత కొన్ని పరిణామాల అనంతరం రాజ్యాంగ సవరణకు అవసరమైన మెజార్టీ ప్రభుత్వానికి లేకపోవడంతోను, ప్రతిపక్ష యు.ఎన్.పి. అంగీకరించక పోవడంతోను పరిస్థితి స్తబ్ధంగా ఉండిపోయింది. ఇటు చంద్రిక తమిళ ఈలం డిమాండ్‌ను వదులుకుంటే తప్ప కాల్పులు విరమణకు అంగీకరించనని స్పష్టం చేసింది. 1999 ఆగస్ట్ అధ్యక్ష ఎన్నికల్లో తిరిగి చంద్రిక విజయం సాధించింది. 1994లో జరిగిన ఎన్నికల్లో చర్చల ద్వారా సమస్యను పరిష్కరిస్తానని ప్రకటించి విజయం సాధించి, 1999 ఎన్నికల్లో యుద్ధం ద్వారా సమస్యను పరిష్కరిస్తానని ఆయా పార్టీల మద్దతుతో గెలిచింది. 1999 అధ్యక్ష ఎన్నికల్లో శ్రీలంక ఫ్రీడం పార్టీ నుండి అధ్యకురాలుగా చంద్రిక గెలిచి కొనసాగుతుండగా, 2001 ప్రధాని ఎన్నికల్లో ప్రతిపక్ష యు.ఎన్.పి. నుండి విక్రమసింఘే గెలిచి ప్రధాని అయ్యారు. ఎవరు అధ్యక్షులుగా ఉన్నా, ఎవరు ప్రధానిగా ఉన్నా తమిళుల ప్రజాస్వామిక ఆకాంక్ష పట్ల అవకాశవాద, అప్రజాస్వామికవైఖరి కలిగి ఉన్నాయి. వివిధ సంధర్భాల్లో సైనిక పరిష్కారాన్నే ప్రధానంగా ఎంచుకుంటూ వచ్చాయి. అధికారంలో ఉన్నప్పుడు ఒక విధంగా, ప్రతిపక్షంలో ఉన్నప్పుడు ఒక విధంగా వ్యవహరిస్తూ వచ్చాయి. ఎవరు అధికారంలో ఉన్నా రక్షణ బడ్జెట్‌ను పెంచుకుంటూ పోయారు. అంతవరకూ 43 కోట్లున్న రక్షణ బడ్జెట్ 1999లో ఒక్కసారిగా 143 కోట్ల డాలర్లకు పెరిగింది.

రాజీవ్‌గాంధీ హత్యానంతరం భారత్ ఎల్.టి.టి.ఇ.ని నిషేధించగా, 9/11 నేపథ్యంలో అమెరికా ప్రపంచవ్యాప్తంగా అనేక సాయుధ సంస్థలపై ఉగ్రవాద ముద్రవేసి ఎల్.టి.టి.ఇ.ని కూడా అందులో భాగంగా నిషేధించింది. బ్రిటన్ అమెరికాకు వంత పాడింది. ఈ సమయంలో 25 డిసెంబర్ 2001న ఎల్.టి.టి.ఇ. ఏకపక్ష కాల్పుల విరమణను ప్రకటించింది. ప్రధాని విక్రమసింఘే ప్రభుత్వం 5 సెప్టెంబర్ 2002న నిషేధం ఎత్తివేసింది. నార్వే ఆధ్వర్యంలో 2002 ఫిబ్రవరి 22, 23 తేదీల్లో చర్చలు జరిగాయి. కాల్పుల విరమణ ఒప్పందం కుదిరింది. ఎల్.టి.టి.ఇ. అధీన ఉత్తర తూర్పు రాష్ట్రాలు, శ్రీలంక ప్రభుత్వ ఆధీన ప్రాంతాలకు మధ్య సరిహద్దులు గీయబడ్డాయి. హై సెక్యూరిటీ జోన్ (హెచ్.ఎస్.జెడ్.) ఏర్పాటయింది. అంతర్జాతీయ పర్యవేక్షణలో శ్రీలంక పర్యవేక్షణ బృందం (ఎస్.ఎల్.ఎం.ఎం.) ఏర్పాటయింది.

థాయ్‌లాండ్‌లో 2002 సెప్టెంబర్ 15-17 తేదీల్లో మొదటి రౌండ్ చర్చలు జరిగాయి. అక్టోబర్ 31 నుండి నవంబర్ 3 వరకు రెండవ రౌండ్ చర్చలు జరిగాయి. ఫెడరల్ వ్యవస్థకు అవకాశాలను పరిశీలించాలని నిర్ణయం జరిగింది. 2002 నవంబర్‌లో ఓస్లో శ్రీలంక దాతల మహాసభ జరిగింది. 2002 డిసెంబర్ 2 నుండి 5 వరకు మూడవ రౌండ్ చర్చలు జరిగాయి. 2003 జనవరి 6 నుండి 9 వరకు

థాయ్‌లాండ్‌లో నాల్గవ రౌండ్ చర్చలు జరిగాయి. ఫిబ్రవరి 7 నుండి 9 వరకు బెర్లిన్‌లో ఐదవ రౌండ్ చర్చలు జరిగాయి. ఆరవరౌండ్ మార్చ్ 18-21 మధ్య జపాన్‌లో జరిగాయి. అప్పుడు అధ్యక్షురాలుగా చంద్రిక, ప్రధానమంత్రిగా విక్రమసింఘే ప్రభుత్వం నడుస్తూ ఉంది.

2003 మార్చ్ 10న ఎల్.టి.టి.ఇ. కి చెందిన బోటును శ్రీలంక సైన్యం ముంచేసింది. 11 మంది కార్యకర్తలు మరణించారు. ఏప్రిల్ 19న ఎల్.టి.టి.ఇ. తాను చర్చల నుండి వైదొలుగుతున్నట్లు ప్రకటించింది. టోక్యో లో జూన్ 9-10 తేదీలలో జరిగిన శ్రీలంక అంతర్జాతీయ దాతల సమావేశానికి ఎల్.టి.టి.ఇ. హాజరు కాలేదు. శాంతి ప్రక్రియలో పాల్గొనాలంటే తమకు రాజకీయ అధికారం కావాలని ఎల్.టి.టి.ఇ. పేర్కొన్నది. దీనికి గాను ఎల్.టి.టి.ఇ. మధ్యంతర పాలనకు సంబంధించి 31 అక్టోబర్ 2003న ఒక పథకాన్ని ప్రభుత్వానికి అందజేసింది. తొమ్మిది జిల్లాల్లో రెవెన్యూ వసూళ్లు, శాంతి బాధ్యతలు, భూమిహక్కు, భూ పంపిణీ, పునరావాసం, పునర్నిర్మాణం, అభివృద్ధి అంశాలపై తమ ఆధిపత్యం, ఈ ప్రాంతాల్లో న్యాయవ్యవస్థ నిర్వహణకు ప్రత్యేక కోర్టుల నియామకం మొదలైన అంశాలతో ఈ పథకాన్ని రూపొందించింది.

ఈ సమయంలో అధ్యక్ష, ప్రధానమంత్రుల మధ్య అధికార పంపిణీలో వైరుధ్యం బద్దలైంది. ప్రధానమంత్రి విక్రమసింఘే అప్పటి అమెరికా అధ్యక్షుడు బుష్‌తో సంప్రదింపుల కోసం వెళ్లిన సందర్భంలో చంద్రిక రక్షణ, హోం, సమాచార శాఖలను ప్రధాని నుండి తీసేసుకున్నది. విక్రమసింఘే చర్చలను అర్ధాంతరంగా ముగించుకొని శ్రీలంక వచ్చారు. శ్రీలంకలో ద్వంద్వ ప్రభుత్వం ఉన్నందున సంప్రదింపులు నిలిపివేస్తున్నట్లు నార్వే ప్రభుత్వం ప్రకటించింది. ఇదే సమయంలో ప్రధాని నిర్వహించిన శ్రీలంక గూఢచారి సంస్థల, భద్రతా దళాల సమావేశంలో ఒక సి.ఐ.ఎ. అధికారి పాల్గొనడం గమనించవలసిన విషయం. ఎన్నికలను నిర్వహించేందుకు 2004 ఏప్రిల్‌లో అధ్యక్షురాలు పార్లమెంట్‌ను రద్దుచేసింది. ఎన్నికల్లో ఎవరికీ మెజారిటీ రాకపోవడంతో చంద్రిక పార్టీ బౌద్ధ, ముస్లిం పార్టీల మద్దతుతో ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసింది. అంతకుముందు పార్లమెంట్‌లో ప్రతిపక్ష నాయకుడుగా ఉన్న మహింద రాజపక్షే ప్రధాని అయ్యారు.

2004 డిసెంబర్‌లో వచ్చిన సునామీ తాకిడికి శ్రీలంక అతలాకుతలమయ్యింది. ముఖ్యంగా ఎల్.టి.టి.ఇ. పట్టున్న ప్రాంతం ఈ తాకిడికి ఎక్కువగా గురయ్యింది. ఎల్.టి.టి.ఇ. శ్రీలంక ప్రభుత్వం వైరాన్ని పక్కనబెట్టి బాధితులను ఆదుకునేందుకు కృషిచేసాయి. అంతలోనే వైరం తీవ్రమైంది. శ్రీలంక విదేశాంగమంత్రి లక్ష్మణ్ కదిర్‌గమర్ ఎల్.టి.టి.ఇ. చేసిన దాడిలో హతమైనాడు. ప్రభుత్వం మరల ఎల్.టి.టి.ఇ. తో చర్చలకు ప్రతిపాదించింది. అధ్యక్ష ఎన్నికలు జరిగే వరకు చర్చలు జరిపేందుకు ఎల్.టి.టి.ఇ. నిరాకరించింది. 17 నవంబర్ 2005న చంద్రిక ఎన్నికలను ప్రకటించింది. పోటీకి తన అనర్హతమూలంగా పాలక కూటమి అభ్యర్థిగా ప్రధాని రాజపక్షేను ప్రకటించింది. ఎన్నికలలో రాజపక్షే గెలుపొంది అధ్యక్షపదవి చేపట్టగా ప్రధానమంత్రిగా రత్నసిరి విక్రమనాయకెను నియమించారు. ఇప్పుడు నార్వే బృందం మళ్లీ రంగంలోకొచ్చింది. 2002 ఫిబ్రవరి నాటి కాల్పుల విరమణ ఒప్పందం రద్దుకాలేదు కాబట్టి ఇద్దరూ చర్చలకు కూర్చోవాలని కోరింది. 2006 ఫిబ్రవరి 22, 23 తేదీలలో చర్చలు జరిగాయి. కాని విఫలమయ్యాయి. విభేదాలు తీవ్రమయ్యాయి. కారణం ప్రభుత్వ కుట్రపూరిత విధానాలే.

అయితే అనంతరం జరిగిన కొన్ని రాజకీయ పరిణామాలను గుర్తించవలసి ఉంది. అధ్యక్షుడు మహిందరాజపక్షే తమిళ సమస్య పరిష్కారానికని 2006 జూన్‌లో ఒక అఖిలపక్ష మహాసభ జరిపారు. ఈ అంశంలో తగిన సలహాలు, సూచనల కోసమని అన్ని జాతుల ప్రాతినిధ్యంతో 12 మందితో ఒక కమిటీ ఏర్పాటు చేశారు. అదే సందర్భంలో ప్రతిపక్ష యు.ఎన్.పి. పార్టీ నుండి ఆరుగురు పార్లమెంట్ సభ్యులను చీల్చి వారికి మంత్రి పదవులను కట్టబెట్టారు. అలాగే సిలోన్ వర్కర్స్ పార్టీ లాంటి చిన్నా చితకా పార్టీల నుండి సభ్యులను రప్పించి వారందరికీ మంత్రి పదవులు ఇచ్చి శ్రీలంక ఫ్రీడం పార్టీలో చేర్చుకున్నారు. అలా 225 మంది సభ్యుల పార్లమెంట్‌లో 91 మంది మంత్రులయ్యారు. ఆ విధంగా పార్టీని ప్రభుత్వాన్ని పూర్తిగా తన చెప్పుచేతుల్లోకి తీసుకున్నారు. ఇక్కడ నుండి ప్రారంభమై ఎల్.టి.టి.ఇ. ని రూపుమాపలనే లక్ష్యంతో ఆయుధాలు వదిలిపెడితేనే చర్చలనే కండిషన్ పెట్టి తమిళ ప్రజలపై యుద్ధం ప్రకటించారు.

తొమ్మిది రాష్ట్రాల్లో తన ప్రాబల్యాన్ని విస్తరించి సమాంతర ప్రభుత్వాన్ని నెలకొల్పిన ఎల్.టి.టి.ఇ. పై ప్రభుత్వం పై చేయికి అనేక కారణాలున్నై. ప్రధానంగా శ్రీలంకలో అధికారం నిర్వహించిన రెండు పార్టీలు అధికారంలో ఉన్నప్పుడు ఒకవైఖరి, ప్రతిపక్షంలో ఉన్నప్పుడు ఒకవైఖరి ప్రదర్శిస్తూ నాన్చి వేశాయి. స్థిరమైన ప్రభుత్వం లేక ఎల్.టి.టి.ఇ.ది పైచేయి అయి, దెబ్బలు తిన్నప్పుడు సైనికచర్యలు చేపట్టి అణచివేత వైఖరి ప్రదర్శించాయి. ప్రతిఘటన తీవ్రమై పోరు కీలకదశకు చేరిన తర్వాత చర్చల ప్రహసనం నడిపించాయి. ఎల్.టి.టి.ఇ. తో కుదుర్చుకున్న ఒప్పందాలను ఎన్నోసార్లు శ్రీలంక ప్రభుత్వం ఉల్లంఘించింది. 2002-03లలో జరిగిన ఆరు రౌండ్ల చర్చల అనంతరం 10 మార్చ్ 2003న ఎల్.టి.టి.ఇ. బోటును ముంచివేసి పదకొండు మందిని కార్యకర్తలను హత్యచేసిన ఘటన ఇందుకొక ఉదాహరణ. ఒకవైపు చర్చల ప్రహసనం నడుపుతూనే సైనిక బలగాలను పెంచుకుంటూ జనాభా, సైనిక బలగాల నిష్పత్తి రీత్యా ప్రపంచంలో పెద్ద సైనిక బలగాలు కలిగిన దేశాల సరసన చేరింది. యుద్ధ విమానాలు, రసాయనిక బాంబులు ఇజ్రాయెల్ నుండి పోగేసింది. ఈ యుద్ధ విమానాలతోనే ప్రస్తుతం తమిళ ప్రాంతాలపై బాంబుల వర్షం కురిపించి వేలాది మందిని హతమారుస్తున్నది. చర్చలు జరిగిన ప్రతిసారీ ఎల్.టి.టి.ఇ. ఆయుధాలు సమకూర్చుకుంటుందని ప్రచారం చేసిన శ్రీలంక ప్రభుత్వం తను మాత్రం భారత్, పాకిస్థాన్, ఇజ్రాయెల్ ల నుండి రహస్యంగా ఆయుధాలు సమకూర్చుకుంది. సముద్రమార్గం గుండా వచ్చే ఎల్.టి.టి.ఇ. బోట్లను అందులో ఏమున్నా ముంచేసేది. అయితే రాజపక్షే తమిళ సమస్యకు మిలటరీ పరిష్కారాన్ని ఎంచుకొని యుద్ధం ప్రకటించిన తర్వాత ఎల్.టి.టి.ఇ. కూడ ప్రతిఘటనను తీవ్రం చేసింది. ఆశ్చర్యకరంగా ఎల్.టి.టి.ఇ. వైమానిక దళం రంగంలో కొచ్చింది. శ్రీలంకపై మూడురాత్రులు వరుసదాడులు చేసింది. ఈ దాడులు కొలంబో దగ్గరలోని కతునాయకే ఎయిర్‌పోర్ట్‌పైన, ఆయిల్ డిపోపైన, అనురాధపుర ఎయిర్‌బేస్‌పైన జరిగాయి. కాని శ్రీలంక వైమానిక బలం ముందు ఎల్.టి.టి.ఇ. వైమానిక బలం చాలా తక్కువ. అనంతరం శ్రీలంకపై వైమానిక దళం జరిపిన దాడిలో ఎల్.టి.టి.ఇ. తన కీలక నేతలను కోల్పోయింది. రాజకీయ విభాగం నేత ఎస్.పి.తమిల్ చెల్వన్, సిద్ధాంతకర్త ఆంటోనీ బాలసింగం చనిపోయారు.

ఇంకోవైపు శ్రీలంక తూర్పు ప్రాంతంలో పట్టు ఉన్న ఎల్.టి.టి.ఇ. కీలకనేత కల్నల్ కరుణా 2004లో ప్రభుత్వంతో కుమ్మక్కై విద్రోహిగా

మారి ప్రభుత్వానికి అన్ని రకాలుగా సహాయ సహకారాలందించడం ప్రారంభించాడు. ఇతని నేతృత్వంలో నల్లదండు ముఠా తయారై ఎల్.టి.టి.ఇ. మద్దతుదారులను హత్యలు చేయడం ప్రారంభించింది.

నాలుగు తమిళ పార్టీలు కలిసి తమిళ నేషనల్ అలయన్స్‌గా ఏర్పడి 2004 ఏప్రిల్‌లో జరిగిన పార్లమెంట్ ఎన్నికల్లో పోటీచేశాయి. వీరికి ఎల్.టి.టి.ఇ. మద్దతు ఇచ్చింది. సైన్యంలోని ఇంటలెజెన్స్ వర్గాలు, కరుణముఠా, ప్రభుత్వ అనుకూల ఈలం పీపుల్స్ డెమోక్రటిక్ పార్టీలు కలిసి ఐదుగురు తమిళ ఎం.పి.లను హత్య చేశాయి. వీరిలో ప్రముఖులైన జోసెఫ్ పరరారసింగంను క్రిస్టమస్ రోజున చర్చిలో అర్ధరాత్రి కాల్చి చంపారు. మరొక ఎం.పి. రవిరాజును కొలంబో పట్టణంలో చంపారు. మరొక ఎం.పి. శివకేశను క్లైమోర్ మైన్ దాడి చేసి చంపారు. ఇలా తమిళ ప్రజల హక్కుల గురించి మాట్లాడే వారిని హత్యలు చేశారు.

ఇదే సమయంలో ప్రభుత్వం సుప్రీంకోర్టు ఉత్తర ప్రాంతంతో, తూర్పు ప్రాంతాన్ని కలపడానికి వ్యతిరేకంగా ఇచ్చిన తీర్పును ఉపయోగించుకొని తూర్పు ప్రాంతాన్ని వేరు చేసి స్థానిక సంస్థల ఎన్నికలు జరిపింది. బట్టికలోవా జిల్లాలో కరుణ ముఠా ఈ ఎన్నికల్లో పాల్గొని గెలిచింది. ఇప్పుడు భౌగోళికంగా మల్లైతీవు, కిల్లినోచి జిల్లాలు తప్ప టైగర్ల ఆధీనంలోని ఉత్తర తూర్పు ప్రాంతం సైన్యం అధీనంలోకొచ్చింది. ఇవి రెండూ సైన్యం ఆధీనంలోని దక్షిణాన వవూనియా, ఉత్తారాన జాఫ్నా పెనిస్సులా మధ్య ఉన్నవి. ఇలా ఇటు తమిళులపై వరుస వైమానిక దాడులు, అటు కరుణ ముఠాల వల్ల ఎల్.టి.టి.ఇ. ఆధీన ప్రాంతం భౌగోళికంగా కూడా తగ్గిపోయింది.

మరోవైపు 9/11 నేపథ్యంలో అమెరికా ఎల్.టి.టి.ఇ. పై నిషేధం విధించింది. 25 సభ్య దేశాల యూరోపియన్ యూనియన్ కూడ ఎల్.టి.టి.ఇ.ని నిషేధించి ఖాతాలను స్తంభింపచేసింది. ఇప్పుడు ఇండియాతో సహా 37దేశాలు ఎల్.టి.టి.ఇ. ని నిషేధించినట్లైంది. ఫలితంగా బయటి నుండి సహాయ సహకారాలు తగ్గిపోయాయి. అంతేగాక శ్రీలంక ప్రభుత్వానికి సహాయం చేయవలసిందిగా ఇజ్రాయెల్‌ను ప్రోత్సహించింది. రాజపక్షే అధ్యక్షుడైన తర్వాత ఎల్.టి.టి.ఇ. తో చర్చలకు ప్రభుత్వం తరపున పాల్గొనే అధికార బృందానికి సహాయకులుగా అమెరికా నిపుణుల కమిటీ నియమింప బడిందంటే అమెరికా పాత్ర ఎంతో అర్థం అవుతుంది.

ఇటు దక్షిణాసియాలో ఆధిపత్యం కోసం చూస్తున్న భారత విస్తరణవాద పాలకవర్గాలు ప్రారంభంలో తమిళ ఉద్యమానికి సహకరించినా అనంతర కాలంలో శ్రీలంక పాలకవర్గాలకు అన్ని విధాలుగా సహకరించాయి. 1986లో శ్రీలంక వెళ్లిన భారత శాంతి పరిరక్షణ దళం చేసిన హత్యలు, అత్యాచారాలు అన్నీ ఇన్నీ కావు. వేలాదిమందిని అంగవికలురను చేసింది. ప్రస్తుతం తమిళులపై శ్రీలంక ప్రభుత్వం సాగిస్తున్న సామూహిక హత్యాకాండకు భారత ప్రభుత్వం ఆయుధ సహకారం అందిస్తోంది. డెహ్రాడూన్, గురుగాంవ్, సికింద్రాబాద్ మిలిటరీ క్యాంపులలో శ్రీలంక మిలిటరీ అధికారులకు శిక్షణ ఇచ్చింది. కొన్ని మీడియా కథనాల ప్రకారం వందలాది మంది భారత సైనికులు శ్రీలంక వెళ్లి సైన్యానికి యుద్ధభూమిలో సహకారం అందిస్తున్నాయి. శ్రీలంక యుద్ధంలో గాయపడిన అధికారులకు తమిళనాడులోని కొన్ని కార్పొరేట్ వైద్యశాలల్లో రహస్యంగా వైద్యం అందజేస్తున్నారు. భారత ప్రభుత్వం శ్రీలంక ప్రభుత్వంతో కుమ్మక్కై హత్యాకాండ సాగిస్తుంటే దానికి అమెరికా మద్దతు పలుకుతోంది. దీనికి సి.పి.ఐ., సి.పి.ఎం.ల పరోక్ష మద్దతుందనేది వాస్తవం. ఇటు తమిళనాడులో డి.ఎం.కె., ఎ.ఐ.ఎ.డి.ఎం.కె. పార్టీలు గతంలో ఎప్పుడు తమిళులపై హత్యాకాండ సాగించినా శ్రీలంక ప్రభుత్వాన్ని, భారత ప్రభుత్వాన్ని నిలదీయకుండా ఇప్పుడు ఎన్నికల సందర్భంలో మాత్రం దొంగ నాటకాలాడాయి.

ఇక్కడ ఇంకో విషయం ఏమిటంటే ఇప్పటివరకు యుద్ధం జరుగుతున్న ప్రాంతంలోకి మీడియాను గానీ, మానవ హక్కుల కార్యకర్త లను గానీ అనుమతించలేదు. అక్కడ జరుగుతున్న మారణహోమం బయటి ప్రపంచానికి తెలియకుండా చేస్తోంది. నిజాయితీ పరులైన పాత్రికేయులను, హక్కుల కార్యకర్తలను హత్యలు చేస్తోంది. నిరుడు హత్యకు గురైన ప్రముఖ పాత్రికేయుడు లసంత విక్రమసింఘెకు ముందూ వెనుకా 16 మంది పాత్రికేయులు హత్య చేయబడ్డారు. సగటున రెండు నెలలకు ఒక హత్య జరిగింది. ఒక్క 2006 జనవరి నుండి సెప్టెంబర్ వరకు ఐదుగురు పాత్రికేయులు, ఒక రాజకీయ విశ్లేషకుడు హత్యకు గురయ్యారు. నిత్యం పత్రికాఫీసులు, టివి స్టేషన్లపై దాడులు జరుగుతున్నాయి. ఎంతోమంది పాత్రికేయులు జైళ్లలో మగ్గుతున్నారు. బహిరంగంగా విమర్శిస్తే దేశద్రోహంగా ఆరోపిస్తోంది. తమిళ పార్లమెంట్ సభ్యుల హత్యల దగ్గర నుండి పాత్రికేయుల హత్యల వరకు శ్రీలంకలో అప్రజాస్వామిక పాలనకు అద్దం పడుతోంది.

ప్రస్తుతం యుద్ధం జరుగుతున్న తీరును చూస్తే మొత్తం జాతిని అంతం చేసే జాత్యహంకార హత్యాకాండ (జినోసైడ్) వైపుగా కొనసాగుతోంది. యుద్ధ విమానాలతో బాంబులవర్షం కురిపిస్తున్నారు. వందలాదిమంది తమిళులు చనిపోతున్నారు. వేలాదిమంది క్షతగాత్రుల వుతున్నారు. టైగర్ల అధీనంలోని ప్రజలు వేలాది మందిని నిర్బంధ శిబిరాల్లో కుక్కుతున్నారు. జాఫ్నా ఎం.పి. గజేంద్రన్ చెప్తున్న దాని ప్రకారం శ్రీలంక ప్రభుత్వం రసాయనిక ఆయుధాలు ప్రయోగిస్తూ సాధారణ ప్రజలు, మిలిటెంట్లు అనే తేడా లేకుండా ఊచకోత కోస్తోంది. ఒక్క వారంలోనే పదిహేను వేలమంది పైగా తమిళ ప్రజలను శ్రీలంక ప్రభుత్వ సైన్యం హతమార్చిందంటే పరిస్థితిని అర్థం చేసుకోవచ్చు. లక్షలాది తమిళులు నిరాశ్రయులై పోయారు. శిబిరాలలో ఉన్న ప్రజలను స్క్రీనింగ్ పేరిట నగ్నంగా పరుగెత్తిస్తున్నారు. స్త్రీలకు బలవంతంగా అబార్షన్లు చేస్తున్నారు. హత్య చేసిన ప్రజలను అనురాధపురలో రహస్యంగా ఖననం చేస్తున్నారు. దీనికంటే ముందు వాస్తవంగా ఒక లక్షమంది తమిళులు, ఒక లక్షమంది ముస్లింలు నిర్వాసితులై పోయారు. మరొక లక్షమంది తమిళనాడులోని వివిధ శిబిరాల్లో ఉన్నారు. పదిలక్షల మంది తమిళులు ఈ మొత్తం కాలంలో ప్రపంచవ్యాప్తంగా వలసలు పోయారు.

అయితే ఒకప్పుడు ప్రపంచవ్యాప్తంగా సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పెల్లుబికిన జాతీయోద్యమాలపై సామ్రాజ్యవాద దేశాలు ప్రత్యక్ష యుద్ధం చేస్తే, ఇప్పుడు ప్రపంచీకరణ నేపథ్యంలో అమెరికా నేతృత్వంలోని సామ్రాజ్యవాదం స్థానిక ప్రభుత్వాలను లోబర్చుకొని ప్రజాస్వామిక, విప్లవోద్యమాలపై యుద్ధం చేస్తోంది. ప్రస్తుతం శ్రీలంకలో తమిళ జాతిపై జరుగుతున్న యుద్ధం శ్రీలంక ప్రభుత్వానిది మాత్రమే కాదు. దీని వెనుక ఉన్న అమెరికన్ సామ్రాజ్యవాదానిది, భారత విస్తరణ వాదానిది కూడా. ఇప్పటికైనా ప్రపంచవ్యాప్త ప్రజానీకం, ప్రజాస్వామ్య వాదులు ఈ యుద్ధాన్ని వ్యతిరేకించాలి. తమిళజాతి ప్రజాస్వామిక ఆకాంక్షను గౌరవించకుండా ఆ ఉద్యమాన్ని అణచివేసినా వాళ్ల మనోభావాలను అణచివేయలేరు. పరిస్థితి కొన్ని సంవత్సరాలు వెనక్కు వెళ్లి పోవచ్చు కాని తిరిగి ఉదయించే భౌతిక పరిస్థితి ఉంటుంది. అసలు ప్రత్యక్ష యుద్ధం ముగిసినా గెరిల్లా యుద్ధం తిరిగి ప్రారంభం కావచ్చు. అప్పుడు చరిత్ర పునరావృతమైనట్లవుతుంది. వీ

*ఒకపక్క ప్రైవేటీకరణ, మరోపక్క ఓపెన్‌కాస్ట్ యాంత్రీకరణలతో సింగరేణి కార్మికులు కోల్పోతున్న ఉపాధినీ, జరగబోతున్న పర్యావరణ విధ్వంసాన్నీ వివరిస్తున్నారు* **సిఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి**

# ప్రైవేటీకరణ పడగ నీడలో సింగరేణి

సింగరేణి తెలంగాణకు గుండెకాయ. సింగరేణి బొగ్గు గనులు ఈ ప్రాంతాన్ని అభివృద్ధిలోకి తెచ్చాయి. వ్యవసాయం జరుగుబాటు కాని తెలంగాణ ప్రాంత వాసులకు సింగరేణి వెలుగునిచ్చింది. పేద రైతు కుటుంబాలకు సింగరేణి ఆసరా అయింది. ఎందరికో ఉపాధినిచ్చింది. కొత్తగూడెం, మణుగూరు, గోదావరిఖని, మంచిర్యాల, మందమర్రి బెల్లంపల్లి వంటి పట్టణాలు వెలిసాయి. దీనివల్ల లక్షలాదిమందికి ఉద్యోగాలు, ఉపాధి దొరికాయి. పాఠశాలలు, కళాశాలలు వెలసి సింగరేణి కార్మికులు తమ పిల్లలకు మంచి చదువు చెప్పించే అవకాశం కలిగింది.

తెలంగాణ ప్రాంతానికే తలమానికమయిన సింగరేణి బొగ్గు పరిశ్రమలో నాడు ఒక లక్ష ఇరవై వేలమంది కార్మికులు ఉండేవారు. బొగ్గు పెల్లకు తమ చెమట నెత్తురద్ది బొగ్గు ఉత్పత్తి చేసేవారు. నాలుగు జిల్లాల్లో విస్తరించి ఉన్న సింగరేణి మనుగడ నేడు ప్రమాద స్థితిలో పడింది. 120 ఏళ్ల సుదీర్ఘ సింగరేణి కాలరీస్ కంపెనీ చరిత్రలో నూతన సంస్కరణలు శరవేగంగా విస్తరించాయి. నూతన ఆర్థిక విధానాలు అమలు చేస్తూ యాజమాన్యం అనేక రకాల సంస్కరణలకు తెరలేపింది. ఈ నేపథ్యంలోనే అధిక బొగ్గు ఉత్పత్తి, ఉత్పాదకతలపై దృష్టి సారించి యాజమాన్యం అండర్‌గ్రౌండ్ (భూగర్భ) గనులను కాలగర్భంలో కలుపుతోంది. ఈ దశలోనే సింగరేణి వ్యాప్తంగా ఓపెన్ కాస్ట్ ప్రాజెక్ట్‌లతో పాటు, లాంగ్‌వాల్ ప్రాజెక్టుల ఏర్పాటుపై మక్కువ చూపుతూ కోట్లాది రూపాయలను కుమ్మరిస్తూ ఏకంగా గ్లోబల్ టెండర్ల ద్వారా విదేశీ బహుళజాతి సంస్థలను ఆహ్వానిస్తోంది. దీనిలో భాగంగా లాంగ్‌వాల్‌కు అవసరమైన నూతన టెక్నాలజీతో ముడిపెట్టి యాంత్రీకరణ పట్ల మక్కువ చూపుతోంది. గ్లోబల్ టెండర్ల ద్వారా జర్మనీ, జాయ్‌డిబిటి, ఆస్ట్రేలియా విదేశీ బహుళజాతి సంస్థల్ని ఆహ్వానిస్తోంది. పూర్వపు సింగరేణి వైభవాన్ని మట్టిదిబ్బలో కలుపుతోంది. దీని ప్రభావం వల్ల 1,20,000 మంది కార్మికులు ఉన్న సింగరేణిలో ప్రస్తుతం 72,000 కార్మికుల సంఖ్యకు కుదించబడింది.

బొగ్గు ఉత్పత్తికి సహకరించే తట్టా చెమ్మస్‌ల అడ్రస్ గల్లంతు చేసింది. ఈ నేపథ్యంలోనే సింగరేణి యాజమాన్యం 2009-10లో పూర్తి స్థాయిలో యాంత్రీకరణ ప్రవేశపెట్టేందుకు యత్నిస్తూ కార్మికుల సంఖ్యను మరింత కుదించే ప్రయత్నం చేస్తోంది. రాబోయే రెండేళ్ల కాలంలో భూగర్భ గనులు కనుమరుగై షాఫ్ట్‌మైన్స్, లాంగ్‌వాల్, ఓపెన్‌కాస్ట్ ప్రాజెక్ట్‌లే మిగిలే పరిస్థితి రాబోతోంది. యంత్రాల వినియోగం వల్ల సింగరేణి కార్మికుల కుదింపు జరిగి భవిష్యత్‌లో కార్మికుల కొలువులు ప్రశ్నార్థకంగా మారే అవకాశం ఉంది. అవుట్ సోర్సింగ్ పేరుతో కాంట్రాక్ట్ కార్మికులకు తక్కువ వేతనాలిచ్చి సంస్థను నడపాలనే ఆలోచన సింగరేణి యజమాన్యానికి ఉంది.

కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరిస్తున్న సరళీకృత ఆర్థిక విధానాల ద్వారా సింగరేణి పరిశ్రమలో కాంట్రాక్ట్ కార్మికుల సంఖ్యను సింగరేణి యాజమాన్యం గణనీయంగా పెంచింది. కార్మికులపై అధిక పనిభారం పెంచి ఉత్పత్తి లక్ష్యాలను సాధించగలిగింది.

2007-08 ఆర్థిక సంవత్సరంలో గతంలో ఎన్నడూ లేని విధంగా 43.56 మిలియన్ టన్నుల బొగ్గు ఉత్పత్తిని లక్ష్యంగా ఎంచుకొని కేవలం పది మాసాలలోనే, 35.76 మిలియన్ టన్నుల బొగ్గు ఉత్పత్తి సాధించాల్సి ఉండగా, 36.64 మిలియన్ టన్నుల బొగ్గు ఉత్పత్తి సాధించింది. ఈ ఉత్పత్తి 102.48 శాతం. గత పదిమాసాలలో అత్యధికంగా కొత్తగూడెం డివిజన్ 118 శాతం సాధిస్తే అత్యల్పంగా భూపాలపల్లిలో 78 శాతం బొగ్గు ఉత్పత్తి జరిగింది.

ఉత్పత్తి లక్ష్యంగానే సింగరేణి పనిచేస్తుంది. ఉత్తర తెలంగాణ జిల్లాల్లోని బొగ్గు గనుల నుండి ఉత్పత్తి అవుతున్న బొగ్గు 80 శాతం స్థానికేతర పరిశ్రమలకే తరలివెళ్తోంది. స్థానికంగా ఉన్న పవర్ ప్రాజెక్ట్‌లకు 20 శాతం బొగ్గు వినియోగం అవుతున్నా, ఉత్పత్తి అయిన విద్యుత్తు మాత్రం ఇతర రాష్ట్రాలకు వెళ్తోంది. ఈ ప్రక్రియలో నష్టపోయింది అపార బొగ్గు ఖనిజాల్ని తమ భూముల్లో కలిగిన ఉత్తర తెలంగాణ రైతులు. జాతీయ బొగ్గు ఉత్పత్తిలో సింగరేణి వాటా 12 శాతానికి చేరుకున్నదంటే ఈ ప్రాంతం నుండి బొగ్గు వనరుల తరలింపు ఎంత కొనసాగుతుందో అర్థం చేసుకోవచ్చు.

సింగరేణి యాజమాన్యానికి కావాల్సింది వార్షిక వృద్ధిరేటు, ఆదాయ వ్యయ లెక్కల్లో అధిక ఉత్పత్తి, అధిక లాభాలు. కాని రెక్కలు ముక్కలు చేసి నిరంతరం శ్రమచేసే కార్మికుల కోసం రక్షణచర్యలు మాత్రం చేపట్టడంలేదు. రక్షణతో కూడిన ఉత్పత్తిని సాధించాలని యాజమాన్యం అనడమే తప్ప దానికోసం ఎటువంటి చర్యలు చేపట్టడం లేదు.

సింగరేణి సంస్థను ప్రమాద రహితంగా తీర్చిదిద్దాలని 2008 డిసెంబర్ 43వ వార్షిక రక్షణ వారోత్సవాల్లో భాగంగా సి అండ్ ఎం.డి. పేర్కొన్నారు. కాని ఈ ఏడాది ప్రారంభం నుంచే సింగరేణిలో ప్రమాదాలు జరుగుతున్నాయి. జనవరి 3న బెల్లంపల్లి ఏరియా గోలేటి-1 గనిలో

పైకప్పు బలోపేతం చేస్తున్న సపోర్ట్‌మెన్ శంకర్, మారపాక మొగిలి గాయపడ్డారు. అనంతరం ఎంకె-4 గనిలో జనవరి 10న లైన్‌మెన్ కార్మికుడు గాదె ముత్తయ్య దుర్మరణం చెందాడు. ఈ ప్రమాదం సంభవించడానికి 'ఉత్పత్తి దాహమే'నని కార్మికులు అంటున్నారు. ఉత్పత్తి వ్యయాన్ని తగ్గించాలని నాణ్యమైన పనిముట్లను ఉపయోగించకపోవడం వల్ల ఈ ప్రమాదం సంభవించిందని, ఇక్కడ హాలర్ నిర్ణీత వేగానికన్న ఎక్కువ వెళ్లేలా విద్యుత్ సరఫరా నిలిపివేసి నడపడం వల్లనే ప్రమాదం జరిగినట్టు తెలుస్తోంది. ఇదే క్రమంలో ఆర్‌కె-5 (బి) గనిలో సపోర్ట్‌మెన్ కార్మికుడు ఉప్పులేటి కనకయ్య చనిపోయాడు. రెండు నెలల్లో పక్క పక్క గనుల్లో ఇద్దరు కార్మికులు మరణించడం కార్మికవర్గం ఆందోళన చెందుతోంది. ఫిబ్రవరి 9న జిడికె-10లో గని పైకప్పు కూలకుండా బలోపేతం చేసే పనిలో నిమగ్నమైన పెసరు స్వామి గాయపడ్డాడు. ఆర్‌కె-5 గనిలో ట్రామర్ కార్మికుడు నిమ్మచంద్రయ్య తీవ్రంగా గాయపడ్డాడు. ఆర్థిక సంవత్సరం ముగుస్తున్నందున గనుల స్థాయి అధికారులు బొగ్గు ఉత్పత్తి లక్ష్య సాధనపై దృష్టిపెట్టడం వల్ల ఇన్ని ప్రమాదాలు జరుగుతున్నట్టు కార్మికులు అంటున్నారు.

సింగరేణిలో డ్రిల్‌బిట్లు, డ్రిల్ రాడ్లు పైకప్పును బలోపేతం చేసే పనిలో నిమగ్నమైన కార్మికులు గాయపడడం గమనార్హం. ప్రమాదాలు జరగకుండా చూడాల్సిన బాధ్యత యాజమాన్యానిదే.

ప్రకృతి విరుద్ధంగా భూగర్భ గనుల్లో పనిచేస్తున్న సుమారు 55 వేల మంది కార్మికులకు ఇప్పటివరకు బూట్లు సరఫరా చేయలేదు. దీంతో అధ్వానంగా మారిన వాటినే వినియోగించాల్సి వస్తోంది. కోట్లాది రూపాయల వ్యయంతో రక్షణపై అవగాహన, గనులు డిపార్ట్‌మెంట్లపై వారోత్సవాలు నిర్వహిస్తున్న యాజమాన్యం ప్రాథమిక దశలోనే వాటిని విస్మరిస్తోంది. మందమర్రి ఏరియా పరిధిలోని పలు గనుల్లో బూట్లు లేకుండానే కార్మికులు విధులకు హాజరు అవుతున్నారు. కమిషన్ల కక్కుర్తితో ఇటీవల 'బాటా' కంపెనీకి కంట్రాక్టు కట్టబెట్టిన వ్యవహారంపై కాగ్ తప్పుపట్టింది.

బొగ్గు ఉత్పత్తికి వినియోగించే కీలకమైన పరికరాలు పూర్తిస్థాయిలో సరఫరా కావడం లేదు. డ్రిల్‌రాడ్ (ఇనుపచువ్వ) బిట్ (రంధ్రం చేసేందుకు పదునుగా ఉండే పరికరం), నట్టు, బోల్టుల సరఫరా నిలిచిపోయింది. గతంలో కంటె అదనంగా రంధ్రాలు వేయాలని అధికారులు ఒత్తిడి పెంచుతూ, వేధింపులకు గురిచేస్తున్నారని కార్మికులు వాపోతున్నారు. వినియోగించిన డ్రిల్‌రాడ్‌లనే వెల్డింగ్ చేయించుకుంటూ, బిట్‌లకు సానపెడుతూ వినియోగించాల్సి వస్తోంది. బొగ్గు ఉత్పత్తికి సంబంధించి ఉపయోగించే డ్రెస్సింగ్ గునపాలు, టోపి చెక్కలు, దిమ్మెమంటలు లేకుండా పోయినవి. కార్మికుల రక్షణ చర్యలు పట్టించుకోవడంలో సింగరేణి యాజమాన్యం పూర్తిగా విఫలమయిందని ఈ మధ్యకాలంలో జరిగిన ప్రమాదాల వల్ల తెలుస్తోంది.

సింగరేణి కోల్‌బెల్ట్ ప్రాంతంలోని బొగ్గుగనులు ఉత్తర తెలంగాణ ప్రాంతంలోని ఉపాధి వనరుగా కొనసాగుతోంది. గతంలో 84 ఉన్న భూగర్భ గనుల సంఖ్య 56కు పడిపోయింది. అనేక గనులను యాజమాన్యం అర్ధాంతరంగా మూసివేసి వాటినే రానున్న కొద్ది రోజుల్లో ఓపెన్‌కాస్ట్ ప్రాజెక్టులుగా మార్చేందుకు ప్రయత్నాలు వేగవంతం చేస్తుంద్రు. ప్రత్యక్షంగా 72 వేలమంది కార్మికుల ఉపాధి పొందుతుండగా, పరోక్షంగా లక్షలాది మంది జీవనోపాధి పొందుతున్నారు. ఉన్నతాధికారుల తప్పుడు నిర్ణయాల వల్ల ఒకప్పుడు సింగరేణికి కొంగు బంగారంగా ఉన్న ఖమ్మం జిల్లాలోని ఇల్లెందు, ఆదిలాబాద్ జిల్లాలోని బెల్లంపల్లి పట్టణాలు భూగర్భ గనుల మూసివేతతో నేడు నిర్మానుష్యంగా మారనున్నాయి. ఈ నేపథ్యంలో ఈ ప్రాంతాల్లో అర్ధాంతరంగా మూసివేసిన గనుల స్థానంలో మరికొన్ని ఓపెన్ కాస్ట్ ప్రాజెక్టులు చేపట్టాలని యాజమాన్యం భావిస్తోంది. ఓపెన్‌కాస్ట్‌గా మారుతాయనే భయంతో వ్యాపారస్తులు, ఇతర ప్రాంతాలకు వలసవెళ్లడం, ఈ పట్టణాలని నమ్ముకుని చిన్న చిన్న వ్యాపారాలు చేస్తున్న వారు ఉపాధి అవకాశాలు పోతాయనే బెంగతో కాలం గడుపుతున్నారు. 2007లో బెల్లంపల్లి ఏరియాలో అచ్చాపూర్, డోర్లి-1,2, శ్రీరాంపూర్ ఒసి 1,2, రామగుండం ఒసి 1 విస్తరణ, కాసిపేట ప్రాంతాల్లో ఓపెన్‌కాస్ట్ ప్రారంభించాలనే సంకల్పంతో సింగరేణి యాజమాన్యం బెల్లంపల్లి పరిధిలోని అచ్చాపూర్ గత జూలై 27న ఓపెన్స్‌కాస్ట్‌కు భూమి పూజ చేసింది. జనవరిలో శ్రీరాంపూర్ ఓపెన్‌కాస్ట్ 1కు భూమి పూజ నిర్వహించింది. ఈ మార్చ్‌లో డోర్లి-2కి భూమి పూజ నిర్వహించింది.

2008-09లో సోమగూడెం 1, కెకె 2, 2ఎ, జిడికె 6, 6ఎ, 6బి గనులను మూసివేసి వాటి స్థానే ఓపెన్‌కాస్ట్ ప్రాజెక్టులుగా ఏర్పాటు చేసేందుకు యాజమాన్యం ప్రయత్నిస్తోంది. జిడికె 10, 10ఎ, గనులను జిడికె 9. 2, 2ఎ గనులను కూడ మూసివేసి రానున్న కొద్దిరోజుల్లో ఓసి-1, ఓసి-2లో వీలినం చేయడానికి ప్రయత్నాలను సింగరేణి యాజమాన్యం ముమ్మరం చేసింది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అనుసరిస్తున్న నూతన ఆర్థిక పారిశ్రామిక విధానాల ప్రభావం, విదేశీ సంస్థలతో చేసుకున్న ఒప్పందాలు సింగరేణి గని కార్మికులకు, ఇక్కడ ఉన్న లక్షలాదిమంది ప్రజలకు శాపంగా మారాయి.

సింగరేణి యాజమాన్యం తీసుకుంటున్న ఈ తప్పుడు నిర్ణయాల వల్ల కొత్తగా ఏర్పాటు చేయనున్న ఓపెన్‌కాస్ట్‌లో లక్షలాది టన్నుల బొగ్గు ఉత్పత్తి పెరిగి లాభాలు ఆర్జించినప్పటికీ సింగరేణి యాజమాన్యం గతంలో చేసిన నూతన భూగర్భ గనులను పట్టించుకోకుండా తెలంగాణ ప్రాంతంలోని కోల్‌బెల్ట్‌పై ప్రాంతీయ భావనతో ఓపెన్‌కాస్ట్ ప్రాజెక్టలను ఏర్పాటు చేసి ఎడారిగా మార్చేందుకు కుట్ర పన్నుతోంది. ఇందుకు కారణం సింగరేణిలో చేపట్టిన మూడవ విడత సంస్కరణలు, భూగర్భ గనుల్లో యాంత్రీకరణ ఓపెన్‌కాస్ట్‌లలో సర్ఫేస్‌మైనర్, కంటిన్యూయస్ మైనర్స్ వంటి కోట్లాది రూపాయల విలువగల భారీయంత్రాలు జపాన్, చైనా, ఆస్ట్రేలియా తదితర దేశాల నుండి కొనుగోలు చేసి ఇక్కడకు తీసుకవచ్చి బొగ్గు ఉత్పత్తిలో వినియోగిస్తున్నారు.

ఈ నేపథ్యంలోనే కార్మికుల శ్రమశక్తి పడిపోవడమే కాకుండా గనులు, ఓపెన్‌కాస్ట్‌లు కార్మికులు లేకుండా యంత్రాల ద్వారా మాత్రమే పనిచేసే పరిస్థితులు కనిపిస్తున్నాయి. రానున్న కొద్దిరోజుల్లో ఆదిలాబాద్ జిల్లాలోని ఆసిఫాబాద్, సిర్పూర్, డోర్లి, కైరిగూడ, గోలేటి, సోమగూడెం, బెల్లంపల్లి, మందమర్రి, బోయిపల్లి, కాసిపేట, ఇందారం, రామకృష్ణాపూర్, చెన్నూర్, జైపూర్, శెట్‌పల్లి, శ్రీరాంపూర్‌లలో; కరీంనగర్ జిల్లా కింద రామగుండం, ఖమ్మంపల్లి, తాడిచర్ల, శాత్రాజ్‌పల్లి, వరంగల్ జిల్లా భూపాలపల్లి, చెల్పూర్, పెద్దాపూర్, లక్ష్మీదేవిపేట, పాలంపేట, వెంకటాపూర్, చెల్వాయ్, గోవిందరావుపేట, రంగాపూర్, ప|స్రా; ఖమ్మం జిల్లా కింద కారెపల్లి, బందాల, పోచాపూర్, బొల్లపల్లి, లింగాల, దుబ్బపల్లి,

గుండాల, ముల్తాపూర్, మామకన్ను, కృష్ణాపూరం, అల్లంపల్లి, పాములగుట్ట, కాంచనపల్లి, కొయ్యిగూడెం, చింతలపల్లి, అనిసెట్టిపల్లి, మైలారం, పెంకులచిలక, మర్రిగూడెం, లక్ష్మీపురం, చెర్ల, కొత్తగూడెం, హేమచంద్రాపురం, రుద్రంపూర్, పాల్వంచ, మైదులగూడెం, పార్వతీపురం, నందిగూడెం, గాందేవపేట, అమరం, బెడదనూత, జగ్గారెడ్డిగూడెం, ఇయ్యనపాడు, ఎర్రగుట్ట, సత్తుపల్లి, కృష్ణాపురం; పశ్చిమగోదావరి జిల్లా కింద, చింతలపూడి, ఇన్ని ఊర్లపై ఓపెన్ కాస్ట్‌ల పేరిట మన్ను పడనుంది. దాదాపు 70 ఓపెన్‌కాస్ట్ గనులను నెలకొల్పాలనేది బొగ్గుగనుల విస్తరణ ప్రణాళికావేత్తల సంకల్పం. ఇందులో కొన్ని ప్రారంభమయ్యాయి. ఓపెన్‌కాస్ట్‌ల వల్ల సమీప గ్రామాల భూగర్భజలాలు అడుగంటడం, చెరువులు ఇంకిపోయి వ్యవసాయం కుంటుపడటం, భూగర్భ బ్లాస్టింగ్ వల్ల ఎగిసిపడే విషవాయువులు, దుమ్ము, ధూళి, గ్రామాల రోడ్లు చెడిపోవడం, భూప్రకంపనాలకు ఇళ్లు కూలిపోవడం, పర్యావరణానికి భారీ నష్టం జరుగుతుంది. ఓపెన్‌కాస్ట్ ప్రాజెక్ట్ తవ్వకాలు ముగిసిన పిదప గనులలో ఇసుకను, మట్టిని నింపి పూడుస్తామని సింగరేణి అధికారులు చెబుతారు. కాని భూమట్టానికి 300 మీటర్ల లోతు వరకు జరిపే ఈ తవ్వకాల వల్ల ఏర్పడిన బొందను నింపడం సాధ్యం కానిపని.

1989లో ఓపెన్‌కాస్ట్‌లు ప్రారంభించాక రామగుండం ప్రాంతంలో భూగర్భ జలాలు అడుగంటడం, చెరువులు ఇంకిపోయి వ్యవసాయం కుంటుపడడం, విషవాయువులు, దుమ్ము ధూళి ప్రభావిత గ్రామాల ప్రజలు తీవ్ర బాధలు పడుతుండ్రు.

అప్పుడప్పుడు కొన్ని ప్రజాసంఘాలు ఈ విధ్వంసంపై నోరు మెదిపితే ఉక్కుపాదంతో అణిచివేత కొనసాగుతోంది. బొగ్గు తీయడానికి వ్యతిరేకత కాదు కాని అది భూగర్భ గనుల ద్వారానే కొనసాగితే బాగుంటుందని ఓపెన్‌కాస్ట్ ప్రభావిత గ్రామాల ప్రజలు అంటుండ్రు. గాలి, నీరు, నేల ప్రజల జన్మహక్కు. అలాంటప్పుడు ఓపెన్‌కాస్ట్‌లతో ఉత్తర తెలంగాణ కయ్యలు, కయ్యలుగా బొందల గడ్డలుగా మార్చడ మేమిటి? అని ప్రశ్నించాల్సి వస్తోంది. అధిక ఉత్పత్తి, అధిక లాభాల పేరుతో సింగరేణి యాజమాన్యం చేపడుతున్న ఈ విధ్వంసాన్ని ఆపకుండా ప్రభుత్వాలు చోద్యం చూస్తున్నాయంటే ప్రజల జీవించే హక్కును కాలరాసినట్లే. మానవాళికి అన్ని రకాలుగా చేటును తెచ్చే ఓపెన్‌కాస్ట్ ప్రాజెక్ట్‌ల తవ్వకాలకే ప్రభుత్వం అధిక ప్రాధాన్యతనిస్తూ ప్రజల అభీష్టాన్ని కాలరాస్తోంది.

సింగరేణిలో ఇంకొక ప్రమాదకరమైన అంశం బొగ్గు బావులన్నీ ప్రైవేట్‌పరం చేయడం. బొగ్గుగనుల ప్రైవేటీకరణను గని కార్మికులు తీవ్రంగా వ్యతిరేకిస్తుండ్రు. సింగరేణి కాలరీస్‌లో గతంలో ఎన్నడు లేని విధంగా అవుట్‌సోర్సింగ్ పేరిట కాంట్రాక్ట్ కార్మికులను భారీగా నియమించారు. దాదాపు అన్ని ఉపరితల పనులను అవుట్‌సోర్సింగ్ చేసిన యాజమాన్యం భూగర్భగనుల్లో సైతం కాంట్రాక్ట్‌లు ఇస్తుంది. కాంట్రాక్ట్ కార్మికులు పెరగడం వల్ల పర్మినెంట్ కార్మికులను తగ్గిస్తున్నారు. ఇప్పటికి 16 సార్లు సింగరేణి సంస్థలో గోల్డెన్ షేక్ హ్యాండ్ అమలు చేసిన యాజమాన్యం మరో రెండు సార్లు అమలుచేసి 72 వేల నుండి 65 వేలకు కార్మికులను కుదించడానికి సన్నాహాలు చేస్తోంది. ఇప్పటికే భూగర్భ గనుల్లో 70 శాతం యాంత్రీకరణ చేశారు. అన్నిచోట్ల ఫిల్లర్ కార్మికుల స్థానంలో ఎస్‌డిఎల్‌స్‌ను ప్రవేశపెట్టడానికి యాజమాన్యం నిర్ణయించి దశలవారీగా అమలుచేస్తోంది. ఈ నేపథ్యంలోనే జిఒ నెం. 31ని రాష్ట్ర ప్రభుత్వం (సింగరేణిలో) విడుదల చేసింది. మొత్తంగా 12 కొత్త భూగర్భ బ్లాక్‌లను ప్రైవేట్‌పరం చేస్తూ 7 గనులను ప్రైవేట్‌వారికి ఇవ్వడానికి గ్లోబల్ టెండర్లను పిలుస్తూ జిఒ నెం. 31 జారీ చేసింది. కార్మికులు ఈ జిఒ ను తీవ్రంగా వ్యతిరేకిస్తుండ్రు. ఇందులో భాగంగానే అనిసెట్టిపల్లి, పెనుగడపల్లి రెండుబ్లాక్‌లను ప్రైవేట్‌పరం చేసిండ్రు. లాభాల్లో నడుస్తున్న సింగరేణిని నష్టాల్లోకి నెట్టడానికే ప్రభుత్వం సింగరేణిలోని గనులను ప్రైవేట్‌పరం చేయడానికి పూనుకుంది. మూడవ దశ సంస్కరణలో భాగంగానే ఈ కుట్ర జరుగుతున్నట్టు కార్మికులు వాపోతుండ్రు. నూతన ఆర్థిక పారిశ్రామిక విధానాలతో దేశంలో రెండు లక్షల మంది బొగ్గు కార్మికులు ఉపాధి కోల్పోయారు. అవుట్‌సోర్సింగ్ నానాటికి పెరిగిపోతోంది. సింగరేణి సంస్థ ఆధ్వర్యంలోనే బొగ్గు ఉత్పత్తి చేపట్టాలని కార్మికులు కోరుతుండ్రు.

ఇంత విధ్వంసం సింగరేణి వ్యాప్తంగా జరుగుతుంటే కార్మికసంఘాలు నిస్తేజంగా మారాయి. ఒకవైపు రాజీలేని పోరాటాలు చేస్తామంటూనే కనీసం కార్మికుల పక్షాన నిలబడలేక చతికిల పడుతున్నాయి. యాజమాన్యానికి దళారీలుగా, తొత్తులుగా ప్రవర్తిస్తున్నాయని కార్మికులు వాపోతున్నారు. ఒకప్పుడు సింగరేణిలో కార్మిక సంఘాలు అంటే గౌరవభావం, ప్రేమ కార్మికులకు ఉండేవి. ఎప్పుడయితే కార్మికుల సంక్షేమాన్ని మరిచినవో అప్పటినుండి కార్మిక సంఘాలు కేవలం నామమాత్రంగానే ఉంటూ వస్తున్నాయి. 1970-80 దశకంలో సింగరేణి వ్యాప్తంగా కార్మికుల పక్షాన పోరాడే సంఘం ఎన్నో త్యాగాలను చేసింది. ఆ త్యాగాల ఫలితమే ఇవ్వాల కార్మికులకు మంచి వేతనాలు, వేజ్‌బోర్డుల ఏర్పాట్లు జరిగాయి. నేడు సమ్మె చేయకుండానే మెరుగైన వేతనం సాధించామంటున్న గుర్తింపు కార్మిక సంఘం 8వ వేజ్‌బోర్డ్‌లో కార్మికుల ఆశలపై నీళ్లు చల్లింది. భూగర్భ అలవెన్స్ తొమ్మిది వేల రూపాయల పైచిలుకు మూలవేతనం ఉన్నవారికి లాభించేది. ఇప్పుడు దాన్ని పెంచకుండా అందరికి ఒకేలా వర్తింపచేయడం అన్యాయం అంటున్నారు కార్మికులు. 24 శాతం కనీసవేతనం పెంచామని చెప్తున్న జాతీయ సంఘాలు మార్కెట్‌లో ధరలు 30 శాతం పెరిగాయని, ధరలకు అనుగుణంగా వేతనాల పెరుగుదల లేదని అన్నారు. 30 నెలల అలవెన్స్‌పై ఎటువంటి నిర్ణయం వేజ్‌బోర్డ్‌లో తీసుకోనందున కోట్లాది రూపాయల నష్టం వాటిల్లుతోందని కార్మికులు అంటున్నారు. ఇంకా కార్మికులకు సిపిఎం పిఎఫ్ అందడం లేదు. బేసిక్‌పై అండర్‌గ్రౌండ్ అలవెన్స్ 20 శాతం ఇవ్వాలన్నది సాధించలేకపోయాయి. తొలగించబడ్డ కార్మికులు, డిస్‌మిస్డ్ కార్మికుల విషయమై 8వ వేజ్‌బోర్డ్‌లో ఎటువంటి చర్యలు తీసుకోలేదు. 1500 రోజులకు పైగా కార్మికులు నిరసన తెలియచేసినా కార్మిక సంఘాలు పట్టించుకోలేదు. కాంట్రాక్ట్ కార్మికులు, పన్ను మినహాయింపులపై ఎటూ తేలలేదు. కార్మికుల పింఛన్ విధానంలో మార్పు రావాలంటుండ్రు.

ఉద్యోగాలను కుదించాలన్న ఉద్దేశంతో సంస్థలో ప్రైవేటీకరణకు ఆజ్యంపోసిన యాజమాన్యం ముందు వెనక చూడకుండా సంస్థలో సగానికిపైగా విభాగాల్లో కాంట్రాక్ట్ కార్మికులకు స్థానం కల్పించింది. తొలుత ప్రైవేటీకరణ రద్దు చేయాలంటూ గగ్గోలు పెట్టిన కార్మిక

*తెలంగాణ ప్రాంత బొగ్గుని తరలించుకపోవడమే కాకుండా, ఇక్కడి రైతులకు సరిపడా విద్యుత్తునూ ఇవ్వకుండా పాలకులు అనుసరిస్తున్న కుటిల నీతిని ఎండగడుతున్నారు* **పిట్టల రవీందర్**

# తెలంగాణ రైతు కరెంట్ కష్టాలు

ప్రాణప్రదంగా తాను పెంచుకున్న పంటపొలాన్ని రైతు తానే స్వయంగా తగులబెట్టుకుంటున్న దృశ్యాలను చూసి గుండెలవిసిపోతాయి. వ్యవసాయ పెట్టుబడికోసం చేసిన అప్పులు తీర్చే దారి కానరాక మరోరైతు ఎండిపోయిన వరిచేనులో బలవంతపుచావుకు బలైపోయిన సంఘటన చూసి మనసు చలించిపోతుంది. భారమైపోయిన వరిసాగు బాధను తట్టుకోలేని రైతు గుండెఆగిన ఉదంతం చదివి ప్రాణం విలవిల్లాడుతుంది. ఏలినవారు హామీ ఇచ్చిన కరెంట్ సరఫరా కోసం తెలంగాణలోని రైతు సమూహాలు విద్యుత్ సబ్-స్టేషన్లను ముట్టడిస్తూ, ధర్నాలు రాస్తారోకోలు చేస్తూ, లాఠీదెబ్బలను తింటూ, పోలీస్ కేసులతో కోర్టులచుట్టూ తిరుగుతున్న దుష్టాంతాలను చూసినప్పుడు ఆలోచనలనిండా అనేక ప్రశ్నలు ముసురుకుంటాయి. సవాలక్ష సమస్యలతో సహవాసం చేస్తున్న తెలంగాణ రైతాంగానికి, తెలంగాణ వ్యవసాయరంగానికి ఇప్పుడు అదనంగా కరెంటు సమస్య కన్నీటి పర్యంతం చేస్తోంది.

తెలంగాణలో ఎవుసం సక్రమంగా కొనసాగాలంటే భూగర్భంలోని జలవనరులు పంటపొలాలకు చేరుకోవాలి. ఇందుకు బోర్లు వేయాలి. ఆ బోర్లు నడవాలంటే నాణ్యమైన కరెంటు, సరైన సమయంలో, సరైన మోతాదులో అందుబాటులో ఉండాలి. ఇవన్నీ సక్రమంగా, నిరాటంకంగా కొనసాగాలంటే అవసరమైన విద్యుత్ అందుబాటులో ఉండితీరాలి. విద్యుత్ ఉత్పత్తికి అవసరమైన ఇంధనం నేలబొగ్గు. దక్షిణ భారతదేశం మొత్తంలోనే నేలబొగ్గు నిక్షేపాలు విస్తారంగా ఉన్న ప్రాంతం తెలంగాణ ఒక్కటే. అటువంటప్పుడు తెలంగాణ రైతాంగం కరెంటు కోసం ఇన్ని కష్టాలు పడటానికి కారణమేమిటి? భూగర్భంలో ఉన్న నేలబొగ్గును మనం వెలికితీయడంలేదా అంటే అదికూడా వాస్తవం కాదు. యేడాదికి సగటున 500లక్షల టన్నుల (50 మిలియన్ టన్నులు) బొగ్గును సింగరేణి సంస్థ విస్తరించిన ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్, ఖమ్మం జిల్లాల నుండి ఉత్పత్తి చేస్తున్నారు. ఇందులో కనీసం పదోవంతు బొగ్గును ఇక్కడి విద్యుత్ అవసరాలకు ప్రత్యేకంగా వినియోగించినా తెలంగాణ ప్రాంత వ్యవసాయ అవసరాలకు పూర్తిగా ఉచిత విద్యుత్తును అందించేందుకు అవకాశం ఉంది. అయినా తెలంగాణ రైతాంగం కరెంటు కోసం కష్టాలు పడటానికి గల కారణాలను కొంచెం లోతైన విశ్లేషణ ద్వారా మాత్రమే తెలుసుకోగలుగుతాం. భూగర్భం నుండి యేటా లక్షలాది టన్నుల నేలబొగ్గును సింగరేణి కంపెనీ వెలికితీస్తున్నప్పటికీ, భూగర్భంలోని జల వనరులను తెలంగాణ రైతులు తమ పంటపొలాల్లోకి పారించుకోలేని దైన్యస్థితినుండి బయటపడలేక వందలాదిగా బలవన్మరణాలకు పాల్పడుతున్న నేపథ్యానికి గల కారణాలను అధ్యయనం చేయవలసిందే.

నిజాం పరిపాలనలోని హైదరాబాద్ సంస్థానం భారతదేశంలో విలీనం కాక పూర్వం తెలంగాణ వ్యవసాయరంగం పూర్తిగా సాంప్రదాయసాగునీటి వనరులైన వాగులు, వంకలు, చెరువులు, కుంటలపైనే ఆధారపడి సాగింది. భూమి ఒక ఉపాధి వనరు స్థానం నుండి లాభనష్టాల వ్యాపార సరుకుగా మారిపోయిన తర్వాత ఈ సాంప్రదాయ సాగునీటి వనరులన్నీ తెలంగాణ ప్రాంతంలో క్రమక్రమంగా కనుమరుగయ్యాయి. తెలంగాణ ప్రాంతంలో నిజాం పరిపాలనా కాలంలో వెలికితీసిన నేలబొగ్గును కేవలం ఆ కాలంలో బొగ్గుతో నడిచిన రైళ్లకోసం, సామాజిక అవసరాలకు సరిపడే మోతాదులో మాత్రమే విద్యుత్‌ను ఉత్పత్తి చేసేవారు. కోస్తాంధ్ర ప్రాంతం ఏటవాలుగా ఉండటంవల్ల ప్రాజెక్టులలో నిలువచేసిన నీటిని కాల్వల ద్వారా నేరుగా పంటపొలాల్లోకి చేరవేయడానికి వెసులుబాటు ఉన్నందువల్ల ఈ ప్రాంతంలోని వ్యవసాయానికి విద్యుత్ అవసరం అంతగా లేకుండాపోయింది. తెలంగాణ ప్రాంతం సముద్రమట్టానికి చాలా ఎత్తుగా ఉండటంవలన

---

సంఘాలు క్రమేపీ సంస్థలో కాంట్రాక్ట్ కార్మికుల సంఖ్య పెరగడంతో ప్రైవేటీకరణ రద్దు మాట పక్కనపెట్టి కాంట్రాక్ట్ కార్మికుల కనీస వేతనాల పాట పాటడం మొదలుపెట్టాయి.

సింగరేణిని ప్రైవేటీకరిస్తే సహించం, ప్రైవేటీకరణకు తాము పూర్తిగా వ్యతిరేకం, ప్రైవేటీకరణ వల్ల సంస్థ భవిష్యత్తు దెబ్బతింటుందని పదే పదే చెప్పే కార్మిక సంఘాల నాయకులు ప్రైవేట్ కంపెనీ ప్రారంభోత్సవాల్లో పాల్గొంటుంటే కార్మికులు నివ్వెరపోయి చూడడం జరుగుతోంది. ఈ మధ్య ఆర్‌జి 2 పరిధిలో ఓసిపి-3 ఓవర్‌బర్డెన్ కాంట్రాక్ట్‌ను దక్కించుకున్న ఆర్‌కె కంపెనీ తను ప్రారంభించే పనులకు సంఘంలో ఇబ్బందులు ఎదురవుతాయని భావించినందున, జాతీయ, ప్రాంతీయ సంఘాలలో అడ్డుకోవాల్సిన కార్మిక సంఘాలు, అధికారులతో పోటీపడి పనులు ప్రారంభించినందుకు ప్రైవేటీకరణను కార్మిక సంఘాలు ఎలా అడ్డుకుంటాయని ప్రశ్నిస్తున్నారు.

బొగ్గు ఆధారిత పరిశ్రమలు నెలకొల్పి ఇక్కడి బొగ్గు సంపదను తరలించకుండా చూడాలని సింగరేణి ఓపెన్‌కాస్ట్, యాంత్రీకరణను అడ్డుకొని సాంప్రదాయ బొగ్గుబావుల ద్వారానే బొగ్గు వెలికితీసి కార్మికుల సమస్యల్ని పరిష్కరించాలంటే ప్రజాస్వామిక ప్రత్యేక తెలంగాణ రాష్ట్రం సాధిస్తేనే సింగరేణికి మనుగడ ఉంటుంది. వీ

కాల్వల ద్వారా నీటిని తరలించుకునే అవకాశం లేకుండా పోయింది. సాంప్రదాయ సాగునీటి వనరుల విధ్వంసం తర్వాత తెలంగాణలోని వ్యవసాయం అనివార్యంగా భూగర్భ జలాలపైననే ఆధారపడవలసిన పరిస్థితి ఏర్పడింది. 2006-07 ప్రభుత్వ గణాంకాల ప్రకారం రాష్ట్రంలో మొత్తం 25లక్షల 27వేల 800 వ్యవసాయ విద్యుత్ కనెక్షన్లు ఉంటే అందులో 15లక్షల 18వేల 695 వ్యవసాయవిద్యుత్ కనెక్షన్లు (సుమారు 60శాతం) ఒక్క తెలంగాణ ప్రాంతంలోనే ఉన్నాయి. రాష్ట్రం మొత్తంలో సాగునీటి ప్రాజెక్టుల కింద 12లక్షల హెక్టార్లు సాగవుతుండగా, ఇందులో కేవలం లక్షన్నర హెక్టార్లు (12శాతం) మాత్రమే తెలంగాణలో సాగవుతోంది. రాష్ట్రంమొత్తంలో 23లక్షల బోర్లు ఉంటే అందులో 16 లక్షలకుపైగా తెలంగాణ ప్రాంతంలోనే (69.56శాతం) ఉన్నాయి. అంటే ఏ లెక్కన చూసినా తెలంగాణలో వ్యవసాయరంగం నిలదొక్కుకోవడానికి 'విద్యుత్ ఉత్పత్తి, సరఫరా' అనేవి అత్యావశ్యకమైనవిగా కనిపిస్తున్నాయి.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అవతరణ తర్వాత, అప్పటికే సాగునీటి వనరులు సమృద్ధిగా కలిగి ఉన్న కోస్తాంధ్రలోని వ్యవసాయరంగంలో అందుబాటులోకి వచ్చిన ఆదాయ మిగులు ఆ ప్రాంతంలో పారిశ్రామిక అభివృద్ధికి దోహదం చేసింది. ఈ పరిశ్రమలు నిర్వహించడానికి పెద్దయెత్తున విద్యుత్ అవసరమయ్యింది. అందువల్ల సమైక్య ఆంధ్రప్రదేశ్‌లో భాగమైన తెలంగాణ ప్రాంతంలో మాత్రమే లభ్యమయ్యే నేలబొగ్గుపై వలసపాలకుల కన్నుపడింది. విజయవాడ నుండి కొత్తగూడెం వరకు రైల్వేలైన్ నిర్మాణమైంది. భారీయెత్తున బొగ్గును తరలించుకు పోయేందుకు ఈ రైల్వేలైన్ ఉపయోగపడింది. మద్రాసు-కొత్తఢిల్లీ గ్రాండ్‌ట్రంక్ రైల్వే మార్గమధ్యంలోనే సింగరేణి బొగ్గుగనులు విస్తరించి ఉండటం వల్ల తెలంగాణ ప్రాంతంలోని నేలబొగ్గును ఇతర ప్రాంతాలకు తరలించుకు పోవడం మరింత సులువయ్యింది. విజయవాడలో థర్మల్ (బొగ్గుతో ఉత్పత్తి చేసే విద్యుత్) కేంద్రం ప్రారంభమైంది. ఈ థర్మల్ కేంద్రం కృష్ణా, గుంటూరు జిల్లాల పారిశ్రామిక అవసరాలను తీరుస్తోంది. కొత్తగూడెంలో ఏర్పాటు చేసిన థర్మల్ విద్యుత్ కేంద్రం ఖమ్మంజిల్లాలోని ఆంధ్రా ఆధిపత్య ప్రాంతాలతోపాటు ఉభయగోదావరి జిల్లాల పారిశ్రామిక అవసరాలకు ఉపయోగపడుతోంది. అదేవిధంగా మద్దనూర్‌లో ఏర్పాటు చేసిన థర్మల్ కేంద్రం రాయలసీమ ప్రాంతానికి కొంతమేరకు ఉపయోగపడుతోంది. ఇక తెలంగాణ ప్రాంత విద్యుత్ అవసరాలకు నిజాం కాలంలో నిర్మించిన రామగుండం 'ఏ', 'బి' థర్మల్ విద్యుత్ కేంద్రాలు మాత్రమే. అదికూడా అతిస్వల్ప స్థాపిత విద్యుత్ ఉత్పత్తి సామర్థ్యంతో, ఉన్నాయి. ఇందులో రామగుండం 'ఏ' థర్మల్ విద్యుత్ కేంద్రాన్ని ఎన్నడో మూసివేసారు. ఇక ఇప్పుడు మిగిలింది రామగుండం 'బి' థర్మల్ విద్యుత్ కేంద్రం మాత్రమే.

తెలంగాణ ప్రాంతం ఆంధ్రప్రదేశ్‌లో విలీనమైన తర్వాత, గడచిన 54 సంవత్సరాల సమైక్యాంధ్ర రాష్ట్రంలో కనీసం ఒక్క విద్యుత్ ఉత్పత్తి కేంద్రాన్ని కూడా కొత్తగా ఈ ప్రాంతంలో చేపట్టలేదు. మరోవైపున సింగరేణి బొగ్గుగనులను విస్తరించి, తద్వారా అందుబాటులోకి వచ్చిన లక్షలాది టన్నుల బొగ్గును తెలంగాణేతర ప్రాంతాలకు తరలించుకు పోవడం మాత్రం శరవేగంతో ఊపందుకున్నది. సింగరేణిలో ఉత్పత్తి అవుతున్న బొగ్గులో దాదాపు 77శాతం బొగ్గు ఇతర ప్రాంతాలకు తరలించుకుపోతున్నారంటే, ఉమ్మడి రాష్ట్రంలో తెలంగాణ వనరుల దోపిడీ ఏ స్థాయిలో కొనసాగుతున్నదో ఎవ్వరైనా సులభంగానే అర్థం చేసుకోవచ్చు. రాష్ట్ర విద్యుత్ ఉత్పత్తి సంస్థ (ఎ.పి. జెన్‌కో) ప్రస్తుతం 2962.50 మెగావాట్ల థర్మల్ విద్యుత్‌ను మన రాష్ట్రంలో ఉత్పత్తి చేస్తోంది. ఇందులో ఐదు దశల్లో విస్తరించిన కొత్తగూడెం థర్మల్ స్టేషన్‌లోని 10 యూనిట్ల ద్వారా మొత్తం 1200 మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి సామర్థ్యాన్ని కలిగి ఉన్నది. విజయవాడ థర్మల్ స్టేషన్ (దీనిని డాక్టర్ నార్ల తాతారావు పవర్ స్టేషన్‌గా పేరుమార్చారు)లోని ఆరు యూనిట్ల ద్వారా 1260 మెగావాట్ల విద్యుత్ ఉత్పత్తి సామర్థ్యానికి పెంచారు. అట్లాగే రాయలసీమ థర్మల్ పవర్ ప్రాజెక్ట్‌ను నాలుగు యూనిట్లతో 840 మెగావాట్లకు చేర్చారు. కానీ నిజాంకాలంలో నిర్మించిన రామగుండం 'బి' థర్మల్ కేంద్రాన్ని శాశ్వతంగా మూసివేసి, రామగుండం 'ఎ' థర్మల్ కేంద్రాన్ని 62.5 మెగావాట్ల స్వల్ప సామర్థ్యానికే స్థిరీకరించారు. తెలంగాణ ప్రాంతంలో వరంగల్ జిల్లాలోని భూపాలపల్లి బొగ్గుగనులను ఆనుకుని 500 మెగావాట్ల థర్మల్ విద్యుత్ కేంద్రాన్ని నెలకొల్పడానికి వలసపాలకులకు 25 సంవత్సరాలు పట్టింది. 'ఎపిజెన్‌కో' సంస్థ ప్రకటించిన భవిష్య ప్రణాళికలో కూడా తెలంగాణపట్ల వివక్ష ధోరణే కొనసాగుతున్నది. 1600 మెగావాట్ల భారీ విద్యుత్ సామర్థ్యంతో కృష్ణపట్నం థర్మల్ కేంద్రాన్ని ప్రతిపాదించారు. ఇందుకు సంబంధించిన పనులు చురుకుగానే కొనసాగుతున్నాయి. అదేవిధంగా రాయలసీమ థర్మల్ కేంద్రాన్ని మరోదశలో 420 మెగావాట్ల అదనపు విద్యుత్ ఉత్పత్తి సామర్థ్యాన్ని జోడిస్తామని ఈ ప్రణాళికలో ప్రకటించుకున్నారు. అయితే బొగ్గు నిక్షేపాలు విస్తారంగా ఉన్న తెలంగాణలో మాత్రం - కరీంనగర్‌లో సహజవాయువు ఆధారంగా 2100 మెగావాట్ల విద్యుత్ కేంద్రాన్ని నెలకొల్పుతామని 2004లో ప్రభుత్వం ప్రకటించింది. ఐదు సంవత్సరాలు గడచినా కరీంనగర్ విద్యుత్ కేంద్రం ప్రతిపాదన అంతా 'గ్యాస్'గానే మిగిలిపోయింది. ఎప్పుడు పూర్తవుతుందో, ఎట్లా పూర్తి చేస్తారో తెలియని ప్రాణహిత-చేవెళ్ల ఎత్తిపోతల ద్వారా 188 మెగావాట్ల జల విద్యుత్తును ఉత్పత్తి చేస్తామని కూడా 'ఎపిజెన్‌కో' తన భవిష్య ప్రణాళికలో పొందుపరచింది.

బొగ్గు వినియోగంలోనూ, విద్యుత్ ఉత్పత్తిలోనూ తెలంగాణ ప్రాంతంపట్ల కొనసాగుతున్న ప్రాంతీయ వివక్ష, విద్యుత్ కేటాయింపుల్లోనూ, పంపిణీలోనూ నిరాటంకంగా కొనసాగుతోంది. జాతీయ విద్యుత్ ఉత్పాదక సంస్థ (ఎన్టీపీసీ) మన రాష్ట్రంలో రెండు సూపర్ థర్మల్ విద్యుత్ కేంద్రాలను నిర్వహిస్తున్నది. వీటిల్లో రామగుండం సూపర్ థర్మల్ విద్యుత్ కేంద్రంలో 2600 మెగావాట్ల విద్యుత్‌ను ఉత్పత్తి చేస్తున్నారు. ఇందుకు అవసరమైన బొగ్గును సింగరేణి సంస్థ అందిస్తున్నది. శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్ ద్వారా 6.5 టిఎంసిల నీటిని కేటాయిస్తున్నారు. అయితే ఈ సూపర్ థర్మల్ కేంద్రంలో ఉత్పత్తి అవుతున్న విద్యుత్‌ను మాత్రం ఆంధ్రప్రదేశ్‌తో సహా దక్షిణాది రాష్ట్రాలన్నింటికీ దామాషా పద్ధతిలో పంపిణీ చేస్తున్నారు. కానీ ఎన్టీపీసీ సంస్థ విశాఖపట్టణం (సింహాద్రి)వద్ద నిర్వహిస్తున్న థర్మల్ విద్యుత్ కేంద్రం పరిస్థితులు ఇందుకు పూర్తి భిన్నంగా ఉన్నాయి. ఈ థర్మల్ విద్యుత్ కేంద్రానికి అవసరమైన బొగ్గును ఒరిస్సాలోని మహానది కోల్ ఫీల్డ్స్ నుండి దిగుమతి చేసుకుంటున్నారు. సముద్రజలాలను శుద్ధిచేసి ఈ కేంద్రం అవసరాలకు ఉపయోగించుకుంటున్నారు. కానీ ఇక్కడ ఉత్పత్తి చేస్తున్న 1000 మెగావాట్ల విద్యుత్‌ను మాత్రం మూడు జిల్లాల ఉత్తరాంధ్ర అవసరాలకే పూర్తిస్థాయిలో (100శాతం) కేటాయిస్తున్నారు. సింగరేణి బొగ్గును వాడుకుని 70 వేల ఎకరాల

| క్ర. సం. | జిల్లా | కోటా విద్యుత్తు | పంపిణీ జరిగిన కరెంట్ | తేడా |
|---|---|---|---|---|
| ఈస్ట్రన్ పవర్ డిస్ట్రిబ్యూషన్ కంపెనీ లిమిటెడ్ (ఈపిడిసిఎల్) (శాతంలో) | | | | |
| 1. | శ్రీకాకుళం | 2.71 | 2.52 | -6.91 |
| 2. | విజయనగరం | 3.67 | 3.52 | -4.06 |
| 3. | విశాఖపట్టణం | 7.76 | 9.23 | 18.95 |
| 4. | తూర్పు గోదావరి | 6.53 | 7.99 | 22.38 |
| 5. | పశ్చిమ గోదావరి | 8.07 | 9.60 | 18.95 |
| | **మొత్తం** | **28.74** | **32.87** | **+14.35** |
| సదరన్ పవర్ డిస్ట్రిబ్యూషన్ కంపెనీ లిమిటెడ్ (ఎస్‌పిడిసిఎల్) | | | | |
| 6. | కృష్ణా | 7.64 | 9.19 | 20.33 |
| 7. | గుంటూరు | 9.05 | 9.25 | 2.24 |
| 8. | ప్రకాశం | 4.87 | 5.51 | 13.04 |
| 9. | నెల్లూరు | 5.69 | 6.83 | 19.96 |
| 10. | చిత్తూరు | 10.39 | 11.12 | 6.99 |
| 11. | కడప | 7.53 | 7.49 | -0.50 |
| | **మొత్తం** | **45.17** | **49.39** | **+9.33** |
| సెంట్రల్ పవర్ డిస్ట్రిబ్యూషన్ కంపెనీ లిమిటెడ్ (సిపిడిసిఎల్) | | | | |
| 12. | అనంతపురం | 8.19 | 9.13 | 11.39 |
| 13. | కర్నూలు | 5.72 | 6.85 | 19.81 |
| 14. | మహబూబ్‌నగర్ | 10.56 | 9.46 | -10.41 |
| 15. | నల్గొండ | 14.85 | 11.73 | -21.04 |
| 16. | మెదక్ | 14.21 | 13.04 | -8.25 |
| 17. | రంగారెడ్డి | 18.52 | 17.72 | -4.33 |
| 18. | హైదరాబాద్ | 15.58 | 23.52 | 50.96 |
| | **మొత్తం** | **87.63** | **91.43** | **+ 4.34** |
| నార్తర్న్ పవర్ డిస్ట్రిబ్యూషన్ కంపెనీ లిమిటెడ్ (ఎన్‌పిడిసిఎల్) | | | | |
| 19. | ఖమ్మం | 4.31 | 3.71 | -13.95 |
| 20. | వరంగల్ | 9.26 | 5.65 | -39.01 |
| 21. | కరీంనగర్ | 7.95 | 5.96 | -25.03 |
| 22. | నిజామాబాద్ | 6.82 | 4.56 | -33.14 |
| 23. | ఆదిలాబాద్ | 4.52 | 4.53 | 0.15 |
| | **మొత్తం** | **32.86** | **24.40** | **-25.73** |

సాగువిస్తీర్ణానికి గండికొట్టి శ్రీరాంసాగర్ ప్రాజెక్ట్ నుండి తరలిస్తున్న నీటిని వినియోగించుకుని ఉత్పత్తి చేస్తున్న విద్యుత్‌లో కేవలం 27శాతం విద్యుత్‌ను మాత్రమే రాష్ట్రం మొత్తం వాటాగా కేటాయిస్తూ, పొరుగు రాష్ట్రం బొగ్గును, వ్యవసాయానికి పనికిరాని సముద్ర జలాలను వాడుకుంటున్న సింహాద్రి థర్మల్ కేంద్రం నుండి ఉత్పత్తి అవుతున్న మొత్తం విద్యుత్‌ను కేవలం ఉత్తరాంధ్ర జిల్లాల అవసరాలకే పూర్తిగా కేటాయించడం – పాలకులు అనుసరిస్తున్న ప్రాంతీయ వివక్షకు నిలువెత్తు నిదర్శనం కాదా!

విద్యుత్ ఉత్పత్తి రంగంలోనూ, కేటాయింపుల్లోనూ, విస్తరణలోనూ తెలంగాణ ప్రాంతానికి జరుగుతున్న అన్యాయాలు చాలవన్నట్లు, విద్యుత్ పంపిణీలోనూ ఈ ప్రాంతానికి తీరని అన్యాయమే జరుగుతోంది. విద్యుత్ పంపిణీ వ్యవస్థను నియంత్రించేందుకు మన రాష్ట్రంలో ప్రభుత్వం నాలుగు కంపెనీలను ఏర్పాటు చేసింది. ఇందులో ఈస్ట్రన్ పవర్ డిస్ట్రిబ్యూషన్ కంపెనీ లిమిటెడ్ (ఈపిడిసిఎల్) ద్వారా శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్టణం, ఉభయగోదావరి జిల్లాలకు ముందుగా నిర్ణయించిన దామాషా పద్ధతిలో కరెంటు సరఫరాను కొనసాగిస్తారు. అట్లాగే సదరన్ పవర్ డిస్ట్రిబ్యూషన్ కంపెనీ లిమిటెడ్ (ఎస్‌పిడిసిఎల్) ద్వారా కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు, చిత్తూరు, కడప జిల్లాలకు, సెంట్రల్ పవర్ డిస్ట్రిబ్యూషన్ కంపెనీ లిమిటెడ్ (సిపిడిసిఎల్) ద్వారా అనంతపురం, కర్నూలు, మహబూబ్‌నగర్, నల్లగొండ, మెదక్, రంగారెడ్డి, హైదరాబాద్ జిల్లాలకు, నార్తర్న్ పవర్ డిస్ట్రిబ్యూషన్ కంపెనీ లిమిటెడ్ (ఎన్‌పిడిసిఎల్) ద్వారా ఖమ్మం, వరంగల్, కరీంనగర్, నిజామాబాద్, ఆదిలాబాద్ జిల్లాలకు ముందుగా నిర్ణయించిన కేటాయింపుల మేరకు కరెంటును సరఫరా చేస్తారు. కానీ జిల్లాలవారీగా విద్యుత్ కేటాయింపుల విషయంలో కాగితాలపై చూపించిన పారదర్శకత వాస్తవంగా పంపిణీలో భూతద్దంతో వెదికినా ఎక్కడా కనిపించదు. విద్యుత్ కేటాయింపులు, సరఫరాకు సంబంధించి ఈ పట్టికను (మే మాసంలో రోజువారీ సగటు – మిలియన్ యూనిట్లలో) గమనిస్తే ఎవ్వరైనా ప్రాంతీయ వివక్షకు సంబంధించిన వాస్తవాలను అర్థం చేసుకోవచ్చు.

విద్యుత్ కేటాయింపులతోపాటుగా సరఫరాలోనూ తెలంగాణ ప్రాంతానికి అన్యాయమే కనిపిస్తున్నది. కాలువల కింద వ్యవసాయం జరిగే విశాఖపట్టణం, తూర్పుగోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణా, ప్రకాశం, నెల్లూరు, అనంతపురం, కర్నూలు జిల్లాలకు కేటాయించిన విద్యుత్ కంటే అదనపు విద్యుత్తు సరఫరా జరిగింది. ఇదే సమయంలో కరెంట్ ఆధారిత బోర్లమీద ఎవుసంసాగే తెలంగాణ జిల్లాలకు కేటాయించిన విద్యుత్తు కూడా సరఫరా కాలేదు. తెలంగాణ ప్రాంతానికి కేటాయించిన విద్యుత్తులో దాదాపు 26శాతం కరెంట్ సరఫరాకు గండికొట్టారు. కరెంటు సరఫరా సక్రమంగా లేని కారణంగా రైతులు వరిపొలాలను దగ్ధం చేసుకున్న సంఘటనలు, బలవంతపు మరణాలు వెలుగులోకి వచ్చిన వరంగల్ జిల్లాకు కేటాయించిన విద్యుత్తులో 39శాతం కరెంట్ సరఫరాకు గండికొట్టారు. అదేవిధంగా రాష్ట్ర విద్యుత్ శాఖమంత్రి ప్రాతినిధ్యం వహించిన నిజామాబాద్ జిల్లాలోనూ కేటాయించిన విద్యుత్తులో 33.14 శాతం కరెంట్ సరఫరాకు గండిపడింది. రాష్ట్రం మొత్తంలో నార్తర్న్ పవర్ డిస్ట్రిబ్యూషన్ కంపెనీ లిమిటెడ్ పరిధిలో ఉన్న ఉత్తర తెలంగాణ ఐదు జిల్లాలలోనే కరెంట్ కోసం రైతులు ఆందోళనలు, ధర్నాలు, రాస్తారోకోలు, సబ్–స్టేషన్ల ముట్టడింపులు, రైతులపై పోలీసుల వేధింపులు, కోర్టు కేసులు అధికంగా చోటుచేసు కుంటున్నాయి. ఈ జిల్లాలకు కేటాయించిన విద్యుత్‌ను సరఫరా చేయడంలోనే వివక్షను పాటిస్తున్నారు. విద్యుత్ ఉత్పత్తి కేంద్రం ఏర్పాటు లోనూ, విస్తరణలోనూ, విద్యుత్ కేటాయింపుల్లోనూ, కేటాయించిన కరెంటును సరఫరా చేయడంలోనూ ఇంతటి తీవ్రమైన వివక్ష కళ్లకు కట్టినట్లుగా కనిపిస్తుంటే రాష్ట్రంలో రైతురాజ్యం నడుస్తున్నదంటూ ప్రభుత్వాధినేతలు పదేపదే చేస్తున్న ప్రకటనలను ప్రజలనెట్లా నమ్మమంటారు!? వీ

*ఉగ్రవాద అణచివేత పేరిట స్వాత్ ప్రాంత పష్తూన్, బెలూచీ జాతి ప్రజలపై పాకిస్థాన్ సైన్యం అమలు చేస్తున్న దమనకాండను వివరిస్తున్నారు* **పి. ప్రసాద్**

# పష్తూన్ జాతీయ విమోచనోద్యమం

ప్రపంచంలోనే పాకిస్థాన్ అతిపెద్ద 'టెర్రరిస్ట్ నిలయం'గా అమెరికా ఇటీవల ప్రకటించింది. అది 'ఉగ్రవాద తండాలకు' చక్కని 'స్వర్గధామం'గా రూపొందిందని ఒబామా ప్రభుత్వం ప్రకటించింది. ముఖ్యంగా పాకిస్థాన్‌లోని వాయువ్య సరిహద్దు రాష్ట్రం 'ప్రపంచ శాంతి'కి అత్యంత ప్రమాదకర స్థలంగా మారిందని ప్రకటించింది. నేడు ప్రపంచాన్ని వణికిస్తున్న ఆర్థిక మాంద్యం కంటె అక్కడ బలపడుతున్న ఉగ్రవాదమే ఎక్కువ ప్రమాదకరమని అమెరికా అభివర్ణించింది. నిజానికి పాకిస్థాన్ ఒక చిన్న వెనుకబడిన దేశం. అందులో వాయువ్య సరిహద్దు రాష్ట్రం అంతకంటె మరింత వెనుకబడిన చిన్న ప్రాంతం. అందులో భాగమైన ట్రైబల్ ప్రాంతం (ఫెడరల్ అడ్మినిస్టర్డ్ ట్రైబల్ ఏజెన్సీ - ఎఫ్.ఎ.టి.ఎ.-ఫాటా) వాటన్నింటికంటె కడు దుర్భరమైన మారుమూల కొండ ప్రాంతం. ఇంతటి ఘోర దుర్భర దారిద్ర్య జనుల నివాస ప్రాంతాలు అగ్రరాజ్యానికి ఎందుకంత ప్రమాదకరంగా కనిపించాయి?

స్వాత్ నేడు నెత్తురోడుతోంది. పాకిస్థాన్ సేనల ముట్టడిలో తల్లడిల్లుతోంది. స్వాత్ జిల్లాలో దాగిన 'ఉగ్రవాద తండాల' ఏరివేత పేరిట పాకిస్థాన్ ఇరవై వేల సైన్యాల, వందలాది యుద్ధ హెలికాప్టర్ల అండతో యుద్ధం సాగిస్తోంది. కేవలం పది రోజులలోనే పాకిస్థాన్ ప్రభుత్వ అధికారిక లెక్కల ప్రకారమే 11 లక్షల మంది నిర్వాసితులయ్యారు. పొట్ట చేతపట్టుకొని కట్టుబట్టలతో, పసిబిడ్డలతో సహా పుట్టి పెరిగిన నేలను వదిలి పరుగులు తీస్తున్నారు. వేలమందిని పిట్టలవలె కాల్చి చంపుతున్నారు. 17 లక్షల జనాభా గల ప్రాంతం నుంచి కేవలం 10 రోజులలోనే 11 లక్షల మంది కాందిశీకులుగా మారడం ప్రపంచ చరిత్ర లోనే మొదటిది కావచ్చు. 'నరరూప రాక్షసులు'గా, 'నరహంతకులు'గా అమెరికాచే చిత్రించబడిన ఐదారు వందల మంది తాలిబన్ మిలిటెంట్లను మట్టుబెట్టే పేరిట ఈ నరమేధం సాగుతోంది. అయినా సోకాల్డ్ నాగరిక ప్రపంచం ప్రేక్షకపాత్రను పోషిస్తోంది. తాలిబన్ల మీద పథకం ప్రకారం అదే పనిగా నూరిపోసిన విషం, విద్వేషాలు వంటబట్టిన సభ్యసమాజం మౌనంగా ఉంది. ఫలితంగా నరమేధం సాఫీగా సాగుతోంది.

స్వంత పౌరుల మీద ఆయా దేశాల ప్రభుత్వాలు ఫాసిస్టు యుద్ధాలు చేయడం ప్రపంచంలో కొత్తకాదు. సార్క్‌లో మూడు సభ్య దేశాలు నేడు సాగిస్తున్న యుద్ధాలు అలాంటివే. కాశ్మీర్ జాతీయ విమోచనోద్యమాన్ని భారత పాలకవర్గాలు నెత్తురుటేరుల్లో ముంచుతున్నాయి. శ్రీలంక ప్రభుత్వం తమిళుల మీద సింహళ జాత్యహంకార యుద్ధాన్ని సాగిస్తోంది. పాకిస్థాన్ ప్రభుత్వం పష్తూన్, బెలూచీ జాతుల మీద సాగిస్తున్న యుద్ధం కూడా ఇలాంటిదే. ఇలాంటి ఘటనలు ప్రపంచ చరిత్రలో అనేకం ఉన్నాయి. అయితే మన దక్షిణాసియాలోని కాశ్మీరీ, తమిళ జాతుల సమకాలీన విమోచనోద్యమాలకు లభించిన కనీస ఆదరణ, ప్రాచుర్యాలు పష్తూన్ జాతీయ విమోచనోద్యమానికి లభించలేదు. అందుకు గల చారిత్రక, రాజకీయ నేపథ్య కారణాలలోకి ఈ వ్యాసంలో వెళ్లడం లేదు. కానీ స్వాత్‌పై సాగిస్తున్న తాజా యుద్ధం ప్రపంచం కళ్లలో కొత్త కోణాలను ఆవిష్కరిస్తోంది.

స్వాత్‌పై ఇప్పుడు జరిగే యుద్ధం హఠాత్తుగా ఆకాశం నుంచి ఊడిపడింది కాదు. దీని వెనుక సుదీర్ఘ యుద్ధ పరిణామ చరిత్ర ఉంది. అందులో పాప పంకిలమైన దుష్ట చరిత్రను అమెరికా, పాకిస్థాన్‌లు మూటకట్టుకున్నాయి. కనిపించే 'దృశ్య' సంఘటనల వెనుక అగుపించని 'అదృశ్య' పరిణామాలు అనేకం ఉన్నాయి. అవి దాచేస్తే దాగని సత్యాలిప్పుడు. స్వాత్‌పై తాజా యుద్ధం పాత చరిత్రను బయటకు పెకిలిస్తున్నది. గతాన్ని వర్తమానం తవ్వి వెలికి తీస్తున్నది. స్వాత్ మీద డాలరు బాకారాయుళ్లు గుమ్మరించడం వల్ల వెల్లువెత్తుతున్న విద్వేష విషోన్మాద ప్రవాహపు కింది పొరలలో దాగిన ఊట బుగ్గలను కనుగొనాల్సిన సమయమిది. వాటిని కదిలిస్తే ఉబికి బయటకు తన్నుకొచ్చే పన్నీటి జలధారలను సేవించి, తరించాల్సిన అవసరముంది. నేడు అక్కడ ప్రవహిస్తున్న ప్రజల నెత్తుటి ధారల నుంచి పుట్టుకొస్తున్న కొత్త తిరుగుబాటు చిగుళ్లను దర్శించుదాం.

నేడు స్వాత్‌లో పరాకాష్ఠ దశకు చేరిన తాజా ఫాసిస్ట్ యుద్ధానికి పూర్వదశలున్నాయి. స్వంత దేశపౌరుల మీద పాకిస్థాన్ ప్రభుత్వం తన తొలిదశ యుద్ధాన్ని దక్షిణ వజిరిస్థాన్‌లో 2004లో ప్రారంభించింది. జార్జిబుష్ రెండవసారి అమెరికా అధ్యక్షునిగా గెలిచేందుకు అవసరమైన ఉన్మాద సృష్టికి ఇది కూడా ఒక అవసరంగా ముందుకొచ్చింది. లాడెన్, ముల్లా ఉమర్, ఆల్‌జవహరి వంటి తన లక్షిత అంతర్జాతీయ నేరస్తులను బంధించే పేరిట తొలుత పై యుద్ధాన్ని ప్రారంభం చేయించింది. వందలాది మందిని చంపించింది. వేలమందిని నిర్బంధింపజేసింది. ఆడమన్నట్లు ఆడిన ముషారఫ్ ప్రభుత్వ సేనలతో దక్షిణ వజిరిస్థాన్‌ను వల్లకాడును చేసింది. ఆనాడు 10వేల సైన్యం పాల్గొన్నది. ఆ తర్వాత ఉత్తర వజిరిస్థాన్‌ను ఎంచుకున్నది. ఆ తర్వాత ఖుర్రం ఏజెన్సీ మీద

విరుచుకుపడింది. ఆ తర్వాత ఖైబర్, మహమండ్, బజౌర్ ఏజెన్సీల మీద వరుసగా యుద్ధం సాగించింది. పైన పేర్కొన్న ఆరు ఏజెన్సీలను ఫాటాగా పిలుస్తారు. 2004లో 10 వేల సైన్యంతో ప్రారంభించి 2005 నాటికి 50 వేలకి పెంచింది. 2006 సెప్టెంబర్‌లో వజిరిస్థాన్‌తో పాక్ ప్రభుత్వం శాంతి ఒప్పందం చేసుకునే నాటికి 80 వేల సైన్యానికి చేరింది. ఒక చిన్న ట్రైబల్ ఏజెన్సీల (ఫాటా) స్వంత పౌరుల మీద యుద్ధానికి 80 వేల ఆధునిక సైనికబలగాలను కేంద్రీకరించడం అక్కడి పరిస్థితి తీవ్రతను తెలియజేస్తోంది.

పాక్ రాజ్యాంగం ప్రకారం వాయువ్య సరిహద్దు రాష్ట్రం (ఎన్.డబ్ల్యు.ఎఫ్.పి.) పాలనాపరంగా రెండు భాగాలుగా ఉంటుంది. ఎన్.డబ్ల్యు.ఎఫ్.పి. ప్రావిన్షియల్, ప్రభుత్వ ప్రత్యక్ష పౌర పరిపాలనలోని ప్రాంతాలు ఒక భాగంగా ఉంటాయి. ఎన్.డబ్ల్యు.ఎఫ్.పి. ప్రభుత్వం నియమించిన పొలిటికల్ ఏజెంట్ల ద్వారా పరోక్ష పాలనా ప్రాంతాలు మరో భాగంగా ఉంటాయి. ఈ రెండవ భాగాన్నే ఫాటా గా పిలుస్తారు. ఈ ఫాటాకు చెందిన ఏజెన్సీ ప్రాంతాలలో సాంప్రదాయ గిరిజన పెద్దల మండలి (షురు) నిర్వహించే ఆదివాసుల పంచాయతీ వ్యవస్థకు పాకిస్థాన్ రాజ్యాంగం ప్రత్యేక మినహాయింపు నిచ్చింది. అందుకే ఫాటాకు స్వయం పాలిత ప్రాంతాల హోదా ఉంది. ఇది భారత్‌లో ఆర్టికల్ 370 ద్వారా లభించిన స్వయం ప్రతిపత్తి గల జమ్మూ కాశ్మీర్ వలెనే పాకిస్థాన్‌లోని ఫాటాకు మరో రూపంలో ప్రాంతీయ ప్రత్యేక ప్రతిపత్తి ఉంది. ఇందులో పైన పేర్కొన్న ఏడు ఏజెన్సీలుంటాయి. ప్రత్యక్ష పాలనా ప్రాంతంలో మాలాఖండ్ డివిజన్ ఒకటి. ఈ డివిజన్‌లోని ఏడు జిల్లాలలో స్వాత్ ఒకటి. ప్రస్తుతం వార్తల్లోకెక్కిన బునేర్, దీర్ జిల్లాలు కూడా మాలాఖండ్ డివిజన్‌లోనివే. ప్రత్యక్ష పాలనా ప్రాంతాలలోని చిత్రాల్, ఎగువ దీర్, దిగువ దీర్ జిల్లాలు అఫ్ఘానిస్థాన్‌తో సరిహద్దును కలిగి ఉన్నాయి. కానీ స్వాత్, బునేర్ జిల్లాలకు అలాంటి సరిహద్దు లేదు. అఫ్ఘానిస్థాన్‌తో సరిహద్దు లేని స్వాత్ జిల్లా మీద నేడు యుద్ధం అతి తీవ్ర దశకు చేరుకోవడం గమనార్హం. దీనిని బట్టి అఫ్ఘానిస్థాన్‌కు చెందిన అల్‌ఖైదా, తాలిబన్ అజ్ఞాత నేతలు ఇక్కడ తలదాచుకోవడం ఇక్కడి సమస్య తీవ్రతకు ప్రధాన కారణం కాదని అర్థమౌతోంది. ఇది పష్తూన్ జాతీయ విమోచనోద్యమానికి ఇరుసుగా మారడమే అందుకు కారణం.

5 సెప్టెంబర్ 2006న వజిరిస్థాన్ తాలిబన్లతో స్థానిక గిరిజన పెద్దల సభ మధ్యవర్తిత్వంతో ఎన్.డబ్ల్యు.ఎఫ్.పి. ప్రభుత్వం ఒక శాంతి ఒప్పందం చేసుకునే నాటికి ఫాటాకు చెందిన అన్ని ట్రైబల్ ఏజెన్సీలలో 80 వేల సైన్యం ఆపరేషన్‌లో ఉంది. రెండేండ్ల పాటు దశలవారిగా అదనపు సేనల చేరిక పరంపరతో ఈ సైనికుల సంఖ్య 10 వేల నుంచి 80 వేలకు పెరిగింది. ఈ విధంగా నిరంతరం సాగిన యుద్ధంలో పాకిస్థాన్ తీవ్రంగా నష్టపోయింది. ఆనాటికి యుద్ధంలో వందలమంది పాకిస్థాన్ సైనికులు మరణించారు. సైన్యంలో తీవ్ర అసంతృప్తి పెరగసాగింది. స్వంతపౌరులే కాకుండా స్వమతస్తులు కూడా అయిన ట్రైబల్ ప్రజల మీద యుద్ధం చేయడం పట్ల దిగువస్థాయి సైనిక శ్రేణులు వ్యతిరేకించసాగాయి. మరోవైపు యుద్ధాన్ని మరింత ఉధృతం చేయాల్సిందిగా ముషారఫ్ ప్రభుత్వం మీద అమెరికా ఒత్తిళ్లు కొనసాగాయి. ఈ సంఘర్షణ క్రమం ఒక దశకు చేరాక శాంతి ఒప్పందం కుదిరింది. అప్పటికే పాక్ తాలిబన్ల బందీలుగా ఉన్న సుమారు 50 మంది సైనికుల విడుదల, సుమారు 200 మంది పాక్ తాలిబన్ల, ఆదివాసీ బందీల విడుదలకై పరస్పరం అంగీకారం కుదిరింది. ఇంకా వజిరిస్థాన్‌లో సైనిక క్యాంపుల ఎత్తివేత, నిషేధాజ్ఞల ఉపసంహరణ జరగాలి. అదే విధంగా పాక్ తాలిబన్లు ఆయుధాలతో సంచరించకూడదు. ఇది ఆచరణలో పాక్ తాలిబన్లను బలోపేతం చేసింది. ప్రశాంతత ఏర్పడింది, ప్రజలు హర్షించారు. అమెరికా ఒత్తిళ్లు, పాక్‌కు అదనపు రుణ మంజూరు ఎరల ఫలితంగా ముషారఫ్ ప్రభుత్వం అర్థాంతరంగా ఒప్పందం నుంచి కుంటిసాకులతో వైదొలిగింది. తిరిగి అదనపు సేనలను మోహరించి మరో దశ యుద్ధాన్ని మరింత విస్తృతంగా తలపెట్టింది. ఫలితంగా ట్రైబల్ ఏజెన్సీలు కల్లోల ప్రాంతాలుగా మారాయి. పాక్ తాలిబన్లతో పాటు వారిని ఆదరించి, ఆశ్రయిస్తున్నట్లు (శాంతి ఒప్పందం తర్వాత స్వేచ్ఛ కాలంలో) ప్రభుత్వం ధృవీకరించిన వాంటెడ్ టెర్రరిస్టలను వేటాడే పేరిట మరోసారి నరమేధం ప్రారంభమైంది. ఫలితంగా మరోసారి ప్రజలు ఇబ్బంది పాలయ్యారు.

శాంతి ఒప్పందానికి సరిగ్గా మూడు నెలల ముందు 7 జూన్ 2006న హిందూ పత్రికకు ఇస్లామాబాద్ నుంచి ప్రముఖ పాత్రికేయుదు నిరుపమ సుబ్రహ్మణ్యం పంపిన ఒక వార్త ఇలా ఉంది. 'వజిరిస్థాన్ ట్రైబల్ ప్రాంతాల్లో 80 వేల పాక్ సైన్యం ఉంది. ఇప్పటికే పోరులో 350 నుంచి 400 మంది వరకు సైనికులు మృతి చెందారు. 800 మంది గాయపడ్డారు.' ఈ విషయాలను బట్టి ప్రతిఘటన తీవ్రతను అంచనా వేసుకోవచ్చు. ఫలితంగానే ప్రభుత్వం రాజీకి సిద్ధపడింది. అయితే విదేశీ ఒత్తిళ్లు ఈ ప్రశాంతతను భగ్నం చేశాయి. ప్రజల బతుకులను మళ్లీ ఛిద్రం చేశాయి. ఇటు ప్రజలతో పాటు, అటు సైనికులు కూడా అమెరికా నెత్తుటి దాహానికి మళ్లీ బలి పశువులయ్యారు.

ముషారఫ్ తదనంతర ఎన్నికల ద్వారా గద్దెనెక్కిన పౌర ప్రభుత్వం కూడా పాక్ తాలిబన్ సంస్థలతో ట్రైబల్ ఏజెన్సీల ఒప్పందాలకు సిద్ధపడింది. కొన్ని ప్రాంతాలలో స్థానిక స్థాయిలో జరిగాయి. అవి ప్రజలకు ఊరటనిచ్చాయి. కానీ వాటిని ఎక్కువకాలం అమెరికా మిగల నివ్వకుండా చేసింది. ఇవన్నీ ఒక ఎత్తు! 16 ఫిబ్రవరి 2009న జరిగిన స్వాత్ ఒప్పందం మరో ఎత్తు.

స్వాత్ ఒప్పందానికి పది రోజుల ముందు పాకిస్థాన్ ప్రభుత్వం 6 ఫిబ్రవరి 2009న ఒక రిపోర్ట్‌ను విడుదల చేసింది. గత ఐదేండ్ల కాలంలో వాయువ్య సరిహద్దు రాష్ట్రంలో మిలిటెంట్ల అణచివేతకై తమ ప్రభుత్వం సాగించినపోరు తగిన ఫలితాలనివ్వడంలేదని అంగీకరించింది. పైగా తాము ఎక్కువ నష్టాలు పొందామన్నది. ఇంతవరకూ పోరులో తాము 1450 మంది సైనికులను కోల్పోయామన్నది, మూడున్నర వేల మందికి పైగా గాయపడ్డారని చెప్పింది. ఈ నేపథ్యంలో 16 ఫిబ్రవరి 2009న సూఫీ మహమ్మద్ (మతపెద్ద) మధ్యవర్తిత్వంతో ఒప్పందం కుదిరింది. ఈ శాంతి ఒప్పందం పట్ల లక్షల మంది ప్రజలు హర్షిస్తూ కేరింతలు కొట్టారు. స్వాత్‌లో భారీ ర్యాలీ జరిగింది. కాని ఈ ఒప్పందం పట్ల అమెరికా, నాటో దేశాలు పచ్చి విద్వేషాన్ని వెళ్లగక్కాయి. పాకిస్థాన్ పౌరశక్తులతో ఒప్పందాలు చేసుకునే హక్కు పాకిస్థాన్ పౌర ప్రభుత్వాలకు ఉంది. కానీ 'నీ ప్రజలతో ఒప్పందాలు చేసుకునే హక్కు నీ ప్రజల చేత ఎన్నికైన నీ పౌర ప్రభుత్వానికి

లేదు' అంటూ ఒబామా ప్రభుత్వం ఆదేశాలు జారీ చేయడం గమనార్హం. తమ ఒత్తిళ్లకు లొంగకపోతే ఒకవైపు రుణాల ఎరలను వేస్తుంది. మరోవైపు ఉగ్రవాద తండాలకు పాక్ ప్రభుత్వం అమ్ముడుబోయిందంటూ తన బాకా మీడియాతో ప్రపంచంలో అప్రతిష్ఠపాలు చేస్తుంది. ఇదీ అమెరికా తీరు.

పాలస్తీనాలో ఓస్లో శాంతి ఒప్పందం, శ్రీలంకలో నార్వే శాంతి ఒప్పందం, ఆంధ్రప్రదేశ్‌లో మావోయిస్టులతో శాంతి చర్చల అనుభవాలున్నాయి. ప్రభుత్వాలు తాము చేసుకున్న ఒప్పందాలను తామే ఉల్లంఘించాయి. ఏనాడు ఆయా ప్రభుత్వాలు శాంతి ఒప్పందాలను చిత్తశుద్ధితో గౌరవించలేదు. చర్చల ద్వారా కొన్ని తక్షణ ఫలితాలతో పాటు తాత్కాలిక ప్రశాంతతను సాధిస్తే ప్రజలకు ఒకింత ఉపశమనం లభిస్తుందని పోరాట సంస్థలు చిత్తశుద్ధితో అందుకు కృషి చేశాయి. కానీ ఇంటా, బయటా దోపిడీ వర్గ శక్తుల ఒత్తిళ్లకు ప్రభుత్వాలు తలవంచి ఒప్పందాల ఉల్లంఘనకు బరితెగిస్తున్నాయి. పైగా తమ చెప్పు చేతుల్లోని మీడియా ద్వారా పోరాట సంస్థలే ఉల్లంఘనకు పాల్పడుతున్నాయంటూ తీవ్ర నిందా ప్రచారం చేయిస్తాయి. అంతవరకూ అదే మిలిటెంట్ సంస్థలతో చక్కగా చర్చలో పాల్గొంటాయి. కుంటిసాకులతో ఒప్పందాలు రద్దు చేశాక అదే సంస్థలను ఉగ్రవాద తండాలుగా నిందిస్తారు. సరిగ్గా ఇదే చరిత్ర స్వాత్ ఒప్పందంలోనూ పునరావృతమైంది.

స్వాత్ మిలిటెంట్లు క్రూరులనీ, ఆటవికులనీ, అనాగరికులనీ, స్వాత్ శాంతి ఒడంబడిక తర్వాత విపరీతంగా ప్రచారం చేయడంలో ఆంతర్యం ఉంది. తద్వారా ప్రపంచదేశాల అభిప్రాయాలను మరో యుద్ధానికి అనుగుణంగా మలిచే లక్ష్యం ఉంది. మరోవైపు ఒప్పందం చేసుకున్న పాకిస్థాన్ ప్రభుత్వాన్ని మెడలు వంచే లక్ష్యం కూడ ఉంది. ఈ ద్విముఖ లక్ష్యాలను అమెరికా ఆచరణలో చాలావరకు సాధించగలిగింది.

ఈ సందర్భంగా తొలుత చారిత్రక కోణంలో స్వాత్ తిరుగుబాటు దార్ల లక్ష్యాలను విశ్లేషించాల్సి ఉంది. స్వాత్ మిలిటెంట్ల భావజాలంతో ప్రగతిశీల శక్తులు ఏకీభవించవు. వారు సాంఘికంగా తిరోగామి పాత్రను పోషించినప్పటికినీ నేటి అంతర్జాతీయ పరిస్థితుల్లో వారి రాజకీయ కార్యాచరణ సామ్రాజ్యవాద వ్యతిరేకమైనది. భారత స్వాతంత్ర్యోద్యమంలో కూడా ఝాన్సీ లక్ష్మిబాయి, తిలక్ వంటి రాజకీయ విప్లకారుల భావజాలం సాంఘికంగా తిరోగామి స్వభావం గలది. అయినా, వలసవాదం ప్రజలకు ప్రమాదకరమైన శత్రువుగా ఉన్నంతకాలం అలా ఉన్న దేశాలలో దానికి వ్యతిరేకంగా సాగే రాజకీయ కార్యాచరణకే ప్రత్యేక ప్రాధాన్యత ఇవ్వాల్సి ఉంటుంది. 1857 నాటి తిరుగుబాటు నేతలు రైల్వే, తంతి, తపాలా, టెలిగ్రాఫ్ వంటి సాంకేతిక పరిజ్ఞానాన్నే మౌలికంగా వ్యతిరేకించారు. అది మత ధార్మిక దృక్పథంతో కూడిన సనాతన భావన. అయినా వారి రాజకీయ కార్యాచరణ జాతీయ స్వభావం గలది. ఈ చారిత్రక పరిమితులకు లోబడి ఏదేని ఒక దేశంలో జరిగే రాజకీయ, సాంఘిక పరిణామాల మంచి, చెడులను అంచనా వేయాల్సి ఉంది. స్వాత్ మిలిటెంట్లు పోషించే చారిత్రక, రాజకీయ, సాంఘిక పాత్రలను కూడా ఈ చారిత్రకకోణంలో నుంచి పరిశీలించాల్సి ఉంది. సామ్రాజ్యవాద వ్యతిరేకపాత్రను వారు పోషించుతున్న మేరకు చారిత్రకంగా విప్లవకరమైనదే. ఒకవైపు సాంఘికంగా వారి మత ఛాందస, సనాతన భావజాలాన్ని ధృడంగా వ్యతిరేకించుతూనే, మరోవైపు విప్లవ రాజకీయ కార్యాచరణను స్వాగతించాల్సి ఉంది.

పర్షియా (ఇరాన్)లో ఇస్లామిక్ విప్లవం తలెత్తినపుడు జారిస్టు రష్యా సేనలు (కొసక్కులు) క్రూరంగా అణిచివేశాయి. ఆ సందర్భాన్ని ప్రస్తావించుతూ 1908లో లెనిన్ 'రష్యా దేశపు క్రైస్తవ సేనలు అంతర్జాతీయ శిరచ్ఛేదకుల పాత్రను పోషించడం ఇది మొదటిసారి కాద'ని అంటాడు. 'మేల్కొంటున్న ఆసియా'ను గూర్చి 7 మే 1913న లెనిన్ రాసిన ఒక వ్యాసంలో 'జావాలో జాతీయ ఉద్యమం ఇస్లామిక్ బ్యానర్ కింద నడుస్తున్నద'న్నారు. ఇంకా 'మహా ఇస్లామిక్' ఉద్యమాన్ని అణచివేసే పేరిట నాగరికత ముసుగులోని యూరప్‌దేశాలు సమైక్యం కావడాన్ని లెనిన్ తీవ్రంగా వ్యతిరేకించాడు. ఇండియా వంటి సోకాల్డ్ సెక్యులర్ ప్రజాస్వామిక నాగరిక దేశాలతో సహా ఇప్పుడు సోకాల్డ్ నాగరిక ప్రపంచం తాలిబన్లను పిచ్చికుక్కలుగా ముద్రవేసింది. వారిని నిర్దాక్షిణ్యంగా మట్టుబెట్టడమే పరమ పవిత్రమని మీడియా తెగ ప్రచారం చేస్తున్న కాలమిది. ప్రజలు కూడా నమ్ముతున్న సమయమిది. పాక్ తాలిబన్ల వైపు నుంచి ఏ ప్రచారానికీ అవకాశం లేని పరిస్థితి ఉంది. ఒకవేళ భిన్న స్వరం ఏదో ఒక మేరకు వినిపించినా విద్వేషం ఎదుట తెరమరుగున పడుతోంది. స్వాత్ శాంతి ఒప్పందాన్ని పాక్ తాలిబన్లు ఉల్లంఘించారన్న పాకిస్థాన్ ప్రభుత్వ ప్రచారమే నేడు రాజ్యమేలుతున్నది. నిష్పాక్షిక దృష్టితో పరిశీలిస్తే నిజానికి ఒప్పంద ఉల్లంఘనకి పాక్ ప్రభుత్వమే పాల్పడిందని తేటతెల్లమౌతోంది.

శాంతి ఒప్పందంలో ఒక షరతు మాలాఖండ్ డివిజన్‌లోని ఏడు జిల్లాలలో షరియత్ చట్టం అమలు కావడం. మాలాఖండ్‌లో ప్రతిపాదిత షరియత్ చట్టం కొత్తది కాదు. 1969కి ముందు అక్కడ షరియత్ చట్టం అమలులో ఉండేది. తద్వారా తమకు న్యాయం సత్వరంగానూ, తక్కువ వ్యయంతోనూ అమలు జరిగిందని ప్రజలు విశ్వసిస్తున్నారు. నేటి పాకిస్థాన్ చట్టాల ప్రకారం అప్పీళ్ల పేరిట పెషావర్ హైకోర్టు, ఇస్లామాబాద్ సుప్రీం కోర్టు వరకూ దశాబ్దాల పాటు కాళ్లు అరిగేలా తిరగాల్సి వస్తుందనే అసంతృప్తి ప్రజల్లో ఉంది. అందుకే పాత షరియత్ చట్టం పునరుద్ధరణ గూర్చి ప్రజలు పదే పదే కోరుతున్న భౌతిక పరిస్థితి అక్కడ ఉంది. దీనికంటె ఇందులో దాగిన మరో ముఖ్యమైన రాజకీయ కోణాన్ని పరిశీలించాల్సి ఉంది.

ఇటీవల ఎన్.డబ్ల్యు.ఎఫ్.పి. రాష్ట్రంలో, ముఖ్యంగా ఫాటా ప్రాంతంలో కూంబింగ్ పేరిట అరెస్టు చేసిన సుమారు ఆరు వందల మంది స్థానిక మిలిటెంట్లను ప్రావిన్షియల్ ప్రభుత్వం ఫెడరల్ ప్రభుత్వానికి అప్పగించింది. అందులో కొందరు ముఖ్యులను అమెరికా ఎఫ్.బి.ఐ.కి ఇస్లామాబాద్ ఫెడరల్ ప్రభుత్వం అప్పగించింది. వీరిని చిత్రహింసల శిబిరాలలో నెలల తరబడి విచారణ లేకుండా హింసిస్తున్నది. అఫ్ఘానిస్థాన్ దురాక్రమణ తర్వాత, ఎన్.డబ్ల్యు.ఎఫ్.పి. బెలూచిస్థాన్ రాష్ట్రాలలో 54 వేల ఎకరాల స్థలాలను అమెరికాకు ముషారఫ్ ప్రభుత్వం సైనిక అవసరాలకిచ్చిన విషయం తెలిసిందే. తమ సాటి అఫ్ఘన్ దేశభక్తుల అణచివేతకు 99 ఏండ్లకు లీజికిచ్చిన ఈ చర్యను పాకిస్థాన్ దేశభక్తియుత శక్తులు తొలి నుంచి వ్యతిరేకిస్తున్నాయి. ఇప్పుడు పాకిస్థాన్ పౌరుల అణచివేతకు కూడా వాటిని వినియోగించడాన్ని భరించలేకపోతున్నారు. ముఖ్యంగా వాయువ్య సరిహద్దు రాష్ట్రంలోని 107 మంది మహిళా

మిలిటెంట్లను కూడా ఇలాగే హింసించడం తమ సాంప్రదాయ, సాంస్కృతిక కోణంలో ప్రజలు తీవ్రంగా అసహ్యించుకుంటున్నారు. అమెరికా ఎఫ్.బి.ఐ. కి అప్పగించిన మిలిటెంట్లు 'మిస్సింగ్' కేసులుగా మిగిలిపోతున్నారు. అందుకే ఇది ఆచరణలో పూర్వ ఆదివాసీ చట్టాలే తమకు కావాలన్న డిమాండ్ ప్రజల్లో బలపడడానికి దారితీసింది. 'షరియత్ చట్టం' ప్రకారం స్థానికంగా ప్రజలందరి సమక్షంలోనే ఎటువంటి ఆలస్యం లేకుండా కేసులు పరిష్కారమౌతాయనేది ప్రజల ఆకాంక్ష.

27 మార్చ్ 2009 ఫ్రంట్‌లైన్ సంచికలో నిరుపమ సుబ్రహ్మణ్యం రాసిన వ్యాసంలో 'స్వాత్ శాంతి ఒప్పందం జరిగిన వార్త తెలిసిన వెంటనే అక్కడి ప్రజలు మిఠాయిలు పంచుకున్నారు. అంతవరకూ మూతపడిన పాఠశాలలు, మార్కెట్లు తెరుచుకున్నాయి' అని పేర్కొనడం గమనార్హం. అదే విలేకరి ఇస్లామాబాద్ నుంచి పంపిన ఒక వ్యాసం 24 మార్చ్ 2009 నాటి హిందూలో ప్రచురితమైంది. పేరు వెల్లడించడానికి ఇష్ట పడని ఒక లాయరు మింగోరా టౌన్ (స్వాత్ జిల్లా ముఖ్యపట్టణం) నుంచి తనకి చెప్పిన ఒక విషయాన్ని ప్రస్తావించారు. 'స్వాత్ జిల్లా ప్రజలు శాంతి ఒప్పందాన్ని ఆమోదిస్తున్నారు. షరియత్ చట్టం వల్ల తమకు సత్వర న్యాయం జరుగుతుందని ఇక్కడి ప్రజలు భావిస్తున్నారు. మింగోరా టౌన్‌లో మేం 300 మంది లాయర్లం ఉన్నాం. షరియత్ చట్టంతో మేమందరం నిరుద్యోగులయ్యాం. కానీ ఇక్కడ ప్రజలు మా పక్షాన లేరు. వారు మా తరఫున పోరాడరు. మా కోసం పోరాడగల శక్తి మా లాయర్లకి ఇక్కడలేదు' అని పై న్యాయవాది చెప్పినట్లు పేర్కొనడం గమనార్హం.

షరియత్ చట్టం మీద 'నాగరిక' ప్రపంచం నేడు నిప్పులు కక్కుతున్నది. కానీ ఒప్పందం అమలు జరగాల్సిన ప్రాంత ప్రజలు షరియత్ చట్టాన్ని స్వాగతిస్తున్నారు. స్వాత్‌తో పాటు మాలాఖండ్ డివిజన్‌లో మొత్తం ఏడు జిల్లాల ప్రజల పరిస్థితి కూడా ఇదే. ఈ సోకాల్డ్ నాగరిక ప్రపంచానికీ, ఆదివాసీ జాతికీ మధ్య షరియత్ చట్టం పట్ల దృక్కోణంలో మౌలిక వైరుధ్యం ఎందుకు ఏర్పడింది? ఇందులో ఎవరిది చారిత్రకంగా, రాజకీయంగా అభివృద్ధికరమైనది? ఈ ప్రశ్నలకు చారిత్రక దృష్టితో సమాధానాలు వెదకాల్సి ఉంది.

అల్లూరి సీతారామరాజు నడిపించిన మన్యం తిరుగుబాటు కాలంలో బ్రిటిష్ అటవీ చట్టాలతో పాటు, అటవీ ప్రాంతంలో బ్రిటిష్ క్రిమినల్, సివిల్ చట్టాల అమలును స్థానిక గిరిజనులు వ్యతిరేకించారు. ఆదివాసీ తెగలు తరతరాలుగా అవలంబిస్తున్న సాంప్రదాయ పంచాయతీ స్వయం పాలనా వ్యవస్థనే కొనసాగించాలని గిరిజన ప్రజలు కోరుకున్నారు. బ్రిటిష్ చట్టాలను తమ ఆంతరంగిక సాంప్రదాయ వ్యవస్థలో అక్రమ జోక్యంగానే గిరిజనులు భావించారు. ముఖ్యంగా అటవీ సంపద మీద తమకు అనుభవించే హక్కు లేకుండా దాన్ని విదేశీయులు స్వంతం చేసుకునే అటవీ చట్టాలను వారు ధిక్కరించారు. అల్లూరి కూడా వారి నిరసనలకు నేతృత్వం వహించాడు. పెళ్లీ, విడాకులు, ఆస్తి, దొంగతనం, నేరాలకు ఆంగ్లేయులు ఆధునిక పార్లమెంటరీ ప్రజాస్వామ్య, లౌకిక, స్త్రీవాద నీతితో చేసిన సివిల్ క్రిమినల్ చట్టాలను మన్యం ప్రజలు ఏకీభవించలేదు. లండన్ పార్లమెంట్‌లోని సోకాల్డ్ ప్రగతిశీల పార్లమెంట్ సభ్యులు ఇలాంటి సందర్భాలలో తెగ ఆందోళన చెందేవాళ్లు. ఉదారబుద్ధితో తాము రూపొందించిన లౌకిక, ప్రజాతంత్ర చట్టాల ప్రకారం సముచిత ఆధునిక ప్రజాతంత్ర, లౌకిక న్యాయాన్ని ఆదివాసులకు అందించాల్సి ఉందన్నారు. అలా అందనివ్వకుండా అడ్డుపడుతున్న వివిధ ఆదివాసీ తిరుగుబాట్ల నేతలను అణచాలంటూ 'నాగరికులు' నిప్పులు కక్కేవాళ్లు. కానీ మన్యం ప్రజల ధిక్కారంలో ఒక లక్ష్యం ఉంది. అది ఆదర్శప్రాయమైనది. ఒకవేళ విదేశీ సామ్రాజ్యవాదుల దోపిడీ, అణచివేతల వల్ల ఒక్కొక్కసారి ఏదేని దేశం లేదా జాతి లేదా తెగలో సనాతన, ఛాందస భావాల పునరుద్ధరణ కూడా జరగవచ్చును. అయినా, నేరం ప్రజలది కాదు. అందుకు దోపిడీ శక్తులే బాధ్యత వహించాలి. అంతిమంగా ప్రజలు తమ స్వానుభవంతో నిత్య భౌతిక కార్యాచరణ ద్వారా మంచి చెడులను గ్రహిస్తారు. ప్రజల తీర్పే శిరోధార్యం.

సోకాల్డ్ నాగరిక అమెరికా దురాక్రమించిన అఫ్ఘానిస్థాన్‌లో కర్జాయ్ ప్రభుత్వం షరియత్ చట్టాన్నే అమలు చేస్తున్నది. అమెరికా తొత్తు దేశాలైన సౌదీ అరేబియా, కువైట్ తదితర ఇస్లామిక్ దేశాలు షరియత్ చట్టాలను అమలు చేస్తున్నాయి. తన వ్యూహాత్మక మిత్రదేశమైన పాకిస్థాన్ రాజ్యాంగంలో షరియత్ చట్టం అమలుకు ఒక ఆప్షన్ ఉంది. అంతెందుకు, అతిపెద్ద ప్రజాస్వామిక, లౌకిక, సోషలిస్ట్ రాజ్యాంగంగా చెప్పుకునే మన దేశంలో కూడా షాబానో కేసులో షరియత్ నీతికనుగుణంగా పార్లమెంట్‌లో రాజీవ్ ప్రభుత్వం చట్టం చేసింది. ఇవన్నీ ఈ నాగరిక ప్రపంచానికి నేరాలుగా కనిపించవు. కానీ శతాబ్దాలుగా సోకాల్డ్ నాగరిక రాజ్యాల దోపిడీ, అణచివేతలకు మగ్గి, పద్దెనిమిది నెలల పాటు మిలిటరీ కూంబింగ్‌లో నెత్తురోడిన బాధిత జాతి షరియత్ చట్టాన్ని కావాలంటే నేరమైపోయింది. నాకు భారత రాజ్యాంగం ప్రకారం విడాకులు కావాలని చైతన్యవంతంగా కోరిన షాబానో వంటి ముస్లిం స్త్రీలకు దాన్ని అందనివ్వకుండా, షరియత్ నీతిని బలవంతంగా వారిమీద రుద్దింది. అందుకోసం ప్రత్యేకంగా ఒక అభివృద్ధి నిరోధక చట్టాన్నే చేసింది. కానీ వెనుకబాటుతనం వల్లనో, సామాజిక, రాజకీయ, భౌతిక పరిస్థితుల వల్లనో షరియత్ చట్టం కావాలని కోరుకుంటే అంతర్జాతీయ నేరమైపోయింది. 'నాగరిక రాజ్యాల' ద్వంద్వ నీతిని వ్యతిరేకించడం నిజమైన ప్రజాతంత్ర, లౌకిక శక్తుల కర్తవ్యం కావాలి.

సోవియట్ రష్యాలో నూతన సోషలిస్ట్ రాజ్యాంగం అమలులోకి వచ్చిన సందర్భంగా లెనిన్ నేతృత్వంలో ఇలాంటి విషయాల మీద కమ్యూనిస్టు పార్టీ చేపట్టిన వైఖరి ఆదర్శప్రాయం కావాలి. మధ్యాసియా లోని ముస్లిం రిపబ్లిక్ ప్రజలకు రాజ్యాంగ లౌకిక న్యాయాన్ని అమలు చేయడంలో కేవలం ఆదేశాలు ఫలించవని భావించింది. వెనుకబాటు తనంవల్ల తమ పాత సనాతన, ఛాందసమత చట్టాలనే అవలంబించాలను కుంటున్న ప్రజలను వారి ఇష్టానికే వదలాలన్నది. బలవంతంగా సోషలిస్టు న్యాయాన్ని వారిమీద రుద్దజూస్తే ప్రతికూల ఫలితాలు వస్తాయన్నది. సోషలిస్టు రాజ్యాంగం వల్ల తమ సాంఘిక అభ్యున్నతి ఎలా సాధ్యమౌతుందో ముస్లిం ప్రజలకు ఓపిగ్గా వివరించాలని తన శ్రేణులకు కమ్యూనిస్టు పార్టీ డైరెక్షన్ ఇచ్చింది. ప్రాచ్యదేశాల, ముస్లిం దేశాల కమ్యూనిస్టులకు లెనిన్ ప్రత్యేక జాగ్రత్తలను బోధించాడు. ముస్లిం రిపబ్లిక్కులలో కమ్యూనిస్టులు వారి మత విశ్వాసాలను గాయపరచకుండా అత్యంత మెలకువలను పాటించాలని పదే పదే పార్టీ శ్రేణులకు లెనిన్ చెప్పాడు.

(ఇంకావుంది) వీ

*ఉత్పత్తి సామర్థ్యం కలిగి, ప్రభుత్వాలు చేపట్టిన 'అభివృద్ధి'లో భాగం కాలేకపోయిన మిగులు మనుషుల శ్రమకు విలువనిచ్చే ఉపాధి హామీ పథకం పరిధి, పరిమితులను విశ్లేషిస్తున్నారు* **ముదునూరి భారతి**

# గ్రామాభివృద్ధి - గ్రామీణ ఉపాధి పథకం

స్వాతంత్ర్యం వచ్చిన అరవై సంవత్సరాల తరువాత కూడా తగ్గని పేదరిక సమస్యకు ఒక తాత్కాలిక సమాధానం కాకుండా, ఒక దీర్ఘకాలిక సమాధానం వెతికే ప్రయత్నంలో భాగంగా కనిపించే ఒక నిర్దిష్టమైన చట్టాన్ని కేంద్రం రూపొందించింది. ఇదే జాతీయ గ్రామీణ ఉపాధి హామీ చట్టం 2005. దీనివలన గ్రామీణ ప్రాంతంలో ఉండే పేద ప్రజల కుటుంబాలకు వంద రోజుల వరకు ఉపాధి దొరకటం, పనికి సరిపడ కూలీ దొరకటంతో వారి జీవనోపాధికి ఒక దారి దొరకటమే కాకుండా, సమాజానికి మౌలిక సౌకర్యాలు ఏర్పడి అభివృద్ధి మార్గం సుగమం అవగలదు అనే భావన కూడా దీనిలో ఇమిడి ఉంది. అమలులో ఈ చట్టం ప్రభావాన్ని అధ్యయనం చేసిన వాళ్లలో కొందరు అవినీతి, లంచగొండితనం పెరిగాయని సూచించినా, మరికొందరు గ్రామీణ ప్రాంతాలలో ఈ చట్టం ప్రభావం వలన పై ప్రాంతాలకు, పై రాష్ట్రాలకు పేద ప్రజలు సామాన్యంగా పోయే వలసలు తగ్గిపోయాయని సూచించారు. ఈ వలసలు తగ్గటం అనేది ఒక గుణాత్మక మార్పుగా, ఒక శుభసూచకంగా మన ప్రభుత్వం భావించింది. పేదరిక సమస్యకు ఒక సమాధానం దొరికినట్టయింది. కాంగ్రెస్ పార్టీ 2009 ఎన్నికల మానిఫెస్టోలో ఈ పథకాన్ని కూడా చేర్చి, కుటుంబంలో ఒకరికి కాకుండా పేద ప్రజలందరికీ ఈ ఉద్యోగ హామీని విస్తరించే ప్రతిపాదన పెట్టింది.

ఇదే సమయంలో మన 'అభివృద్ధి'కి ధనసహాయాన్ని అప్పుగా ఇచ్చే ప్రపంచబ్యాంక్ తన 'ప్రపంచ అభివృద్ధి నివేదిక - 2009'ని విడుదల చేసింది. విడుదల చేయటమే కాకుండా భారతదేశ అభివృద్ధిని గురించి ప్రస్తావిస్తూ, ప్రభుత్వం ప్రతిష్ఠాత్మకంగా భావించి రూపొందించిన ఈ జాతీయ గ్రామీణ ఉపాధి హామీ చట్టం అమలులో అవినీతి పుష్కలంగా ఉందని అభిప్రాయపడింది. అభివృద్ధికి వలసలే మూల కారణమనీ, దీని వలన వలసలు ఆగిపోయాయనీ, అందుచేత ఈ వలసలు ఆగిపోవడమనే ఫలితం భారతదేశంలో అభివృద్ధికి పెద్ద గొడ్డలిపెట్టు అనీ, ఈ చట్టం నిరర్థకమని స్పష్టంగా పేర్కొంది. ఈ సందిగ్ధ పరిస్థితిలో, అంటే భారత ప్రభుత్వ విధి విధానాలలో, ముఖ్యంగా ఈ గ్రామీణ ఉపాధి హామీ చట్టం అధిక ప్రాముఖ్యత చెందిన నేపథ్యంలో, దీనిని ప్రపంచ బ్యాంక్ పూర్తిగా విభేదించిన సందర్భంలో, అసలు ఈ గ్రామీణ ఉపాధి హామీ చట్టం ఏమిటి? అమలులో ఇది ఎదుర్కొంటున్న సమస్యలు ఏమిటి? ఈ చట్టం విజయవంతం కావటానికి అవసరమైన సవరణలు ఏమిటి? ఒకసారి చూద్దాం.

సెంటర్ ఫర్ స్టడీస్ ఆన్ సోషల్ ట్రాన్స్‌ఫర్మేషన్ (సిఎస్ఎస్‌టి) అనే సంస్థ ఆధ్వర్యంలో భువనేశ్వర్‌లో 8 మార్చ్ 2009న జరిగిన సదస్సులో ప్రవేశపెట్టిన పత్రం, దానిమీద జరిగిన చర్చ ప్రస్తుత వ్యాసానికి మూలం.

గత అరవై సంవత్సరాలుగా మన కేంద్ర ప్రభుత్వం దేశ పురోగతి నిమిత్తం పెద్ద పెద్ద డ్యాంలు, ఫ్యాక్టరీలు లాంటి భారీ ప్రాజెక్ట్‌లను నిర్మించింది. వ్యవసాయరంగాన్ని ప్రభావితం చేసే కార్యక్రమంలో భాగంగా ఒరిస్సాలో మహానది మీద కట్టిన హిరాకుడ్ డ్యాంతో మొదలుపెట్టిన మన ప్రగతి ప్రస్థానం, ప్రస్తుత కాలంలో రాయితీలనేకం ఇచ్చి ఇన్ఫర్మేషన్ టెక్నాలజీ, బయో టెక్నాలజీ, కంప్యూటర్ సైన్స్ మొదలగు పరిశ్రమల స్థాపనకు చేరుకుంది. ఈ అభివృద్ధి క్రమాన్ని వేగవంతం చేసే కార్యక్రమంలో భూమి, నీరు, విద్యుత్తు, రవాణా సౌకర్యాలు లాంటి మౌలిక సౌకర్యాలకు ప్రాముఖ్యత ఇవ్వడం వెనుక 'మౌలిక సౌకర్యాల ద్వారానే అభివృద్ధి సాధ్యం' అనే భావజాలం బలంగా ఉంది. ఈ అరవై సంవత్సరాల అభివృద్ధి అనుభవాలను పరిశీలిస్తే, ఈ అభివృద్ధి కార్యక్రమాలు అనుకున్న లక్ష్యాలను సాధించలేకపోయాయని తెలుస్తోంది. అంతే కాకుండా వీటి వలన నిర్వాసితులైన ప్రజానీకం ఈ అభివృద్ధి క్రమంలో తిరిగి భాగం కాలేక సమాజపు అంచులకు నెట్టివేయబడ్డారు. కాలం గడిచేకొద్దీ ఇంకొన్ని అభివృద్ధి పథకాల ద్వారా ఇంకొంత మంది ప్రజలు నిర్వాసిత ప్రజానీకంతో కలియడంతో వీరి సంఖ్య మరింత పెరిగింది. వీరే నిర్వాసిత ప్రజలు, పేద ప్రజలు, పనిలేని వారుగా గుర్తించబడుతున్నారు. మళ్లీ వీరినే ఆదివాసులు, దళితులు, స్త్రీలుగా చూడటం జరుగుతోంది. వీరందరిని మనం 'మిగులు మనుషులు'గా గుర్తిస్తే, అంటే ఉత్పత్తి చేయగలిగిన శక్తి, సామర్థ్యం ఉండి కూడా, సమాజపు ఉత్పత్తి సంబంధాలలో భాగం కాలేక మిగిలిపోయిన వ్యక్తులుగా చూడగలిగితే వీరి ప్రాముఖ్యత మనకి తెలుస్తుంది.

వ్యవసాయం మీద ఆధారపడే మన దేశంలో ఈ మిగులు మనుషుల సమస్య గ్రామీణ ప్రాంతాలలో చాలా ఎక్కువగా ఉంటోంది. ఈ మిగులు మనుషులు దేశ ఆర్థిక ప్రగతికి అడ్డంకి అనీ, ఆర్థికంగా సమాజ ప్రగతిలో భాగం కాలేకపోయిన కారణంగా ఆకలి, పేదరికం, నిరుద్యోగం, నిరక్షరాస్యత, అనారోగ్య సమస్యలు మొదలయినవి తీవ్రరూపం దాల్చి వీటికి ఒక దీర్ఘకాలిక సమాధానం వెతకవలసిన అవసరం వచ్చింది. దేశ జనాభాలో మూడవ భాగం ఉన్న వీరిని మిగులు మనుషులుగా ఉత్పత్తి సంబంధాలలో భాగస్తులుగా గుర్తించక, పేద ప్రజలుగా మాత్రమే గుర్తించి దయా, దాక్షిణ్యాలతో బతికేవారుగా చూడటంతోనే సమస్య మొదలవుతుంది.

మన దేశంలో జరిగిన అభివృద్ధి క్రమాన్ని పరిశీలిస్తే, ముఖ్యంగా రెండు విషయాలు ముందుకు వస్తాయి. ఒకటి, ఉత్పత్తి చేయగల సామర్థ్యం ఉండి కూడా ఉత్పత్తి సంబంధాలలో భాగం కాలేకపోయిన అధిక సంఖ్యలో ఉన్న మిగులు మనుష్యులు. రెండవది, ప్రగతి పథంలో వేగంగా వెళ్లడానికి అనుకూలపడే మౌలిక సౌకర్యాల కరువు. ఈ రెంటిని అభివృద్ధికి పెద్ద అడ్డంకులుగా భావించి వాటిని ఒకేసారి తొలగించే ప్రయత్నాలు మొదలయ్యాయి. మొట్టమొదటి పంచవర్ష ప్రణాళికలో కమ్యూనిటీ డెవలప్‌మెంట్ ప్రాతిపాదికగా కమ్యూనిటీలోని మనుషులు శ్రమదానం చేసి గ్రామానికి కావలసిన మౌలిక సౌకర్యాలు తయారు చేస్తే, వీటి సహాయంతో గ్రామ అభివృద్ధి జరిగి, దానితో పాటే గ్రామంలోని మనుషులు కూడా అభివృద్ధి చెందుతారనే భావన వచ్చింది. కాని ఈ ప్రయత్నాలను విశ్లేషించిన నిపుణులు వ్యతిరేక అభిప్రాయానికి వచ్చారు. అంటే ఈ ప్రయత్నాల వలన శ్రమదానం చేసిన ప్రజలకు ఫలితం దక్కలేదు కాని, దానం చెయ్యని మిగతా ప్రజలకు లాభం జరిగింది అనే అభిప్రాయానికి వచ్చారు. ఇది సఫలమయిందా లేదా, ఫలితాలు ఏమయ్యాయి అనే ప్రశ్నలు పక్కన పెడితే దీనిని స్పష్టంగా చెప్పింది మనకందరికీ తెలిసిన కారా 'యజ్ఞం' కథ. దీనిలో సుందరపాలెంలో గ్రామానికి ఉపయోగపడే ఎన్నో సదుపాయాలను – హైస్కూలు భవంతిని కట్టడం, గ్రామాన్ని పట్టణానికి కలిపే రోడ్లు వెయ్యడం లాంటివి – గ్రామ ప్రజల శ్రమదానంతో తెచ్చినా, దాని పర్యవసానం 'శ్రమ చేసినవారి బతుకు బుగ్గి అయి, దానిలో నుండి మరికొందరికి బువ్వ పుట్టడం' జరిగిందని అప్పల్రాముడు గ్రామ అభివృద్ధి పథకాల మీద చేసిన విమర్శ మనకి కనువిప్పు చేస్తుంది. మిగులు మనుషులను శ్రమదానం చెయ్యమనడం ఎంత తప్పో, వాళ్ల ద్వారా మౌలిక సదుపాయాలలో మార్పులు చేసి తద్వారా పురోగతి సాధించవచ్చును అనుకోవడం కూడా అంతే తప్పుగా కనిపిస్తుంది. ప్రభుత్వం కూడా ఈ కమ్యూనిటీ డెవలప్‌మెంట్ కార్యక్రమాలను మూడవ పంచవర్ష ప్రణాళికలో ఆపేసింది.

తరువాతి కాలంలో మిగులు మనుషులు నిరుద్యోగులుగా, నిరుపేదలుగా, పేదరికం ఒక సమస్యగా ప్రభుత్వానికి కనపడింది. అప్పటినుండి వీరిని ఒకింత ఉత్పత్తి శక్తులుగా గుర్తించి వీరికి ఐఆర్‌డిపి ద్వారా ఒక మేక, ఆవు, గొర్రె, పంది ఇచ్చి వాటిద్వారా కొత్త ఉత్పత్తి సంబంధాలు వస్తాయేమోననేది దారిద్ర్య నిర్మూలన పథకాలలో ఒక ప్రధాన అంశం. దీని పరాకాష్ట 'వెలుగు' కార్యక్రమం.

ఒక పారిశ్రామికవేత్తకాని, వ్యవసాయరంగంలోని ధనిక భూస్వామి కాని ఉత్పత్తి సంబంధాలను మార్చగలగడం, లేక కొత్త ఉత్పత్తి సంబంధాలను తేవడం భావ్యమేకాని భూమితో ముడిపడిన వారి ఉత్పత్తి శక్తులు పక్కనపెట్టి కురియన్ అముల్ ఆనంద్ పద్ధతిలో వీరిద్వారా ఒక పాలపరిశ్రమ, లేక ఒక తోళ్ల పరిశ్రమ పెట్టి దాని ద్వారా ఉత్పత్తి సంబంధాలను మార్చాలనుకోవడం, ఇందులో మిగులు మనుషులు భాగం అవుతారనుకోవడం ఒక అత్యాశ. వీళ్ల ఉత్పత్తి శక్తి భూమి మీద ఉంది. దీనిని వదిలిపెట్టి మరొక ఉత్పత్తిలో ఈ మిగులు మనుషులు భాగమవడం ద్వారా ఉత్పత్తి సంబంధాలు మార్చాలనుకోవడం ఒక అత్యా శలా కనిపిస్తుంది. ఈ మిగులు మనుషుల సమస్య దీర్ఘకాలిక సమస్యగా గుర్తించి, ఈ సమస్యకు మౌలిక సదుపాయాలకు సంబంధించిన కార్యక్రమాలతో ముడిపెట్టి వీరికి జాతీయ గ్రామీణ ఉపాధి గ్యారంటీ పథకం (ఎన్‌ఆర్‌ఇజిపి) ద్వారా ఒక సమాధానం వెతకడమే ఈ చట్టం ముఖ్యోద్దేశ్యం. శ్రమదానంగా కాక శ్రమకి విలువ ఇచ్చే పథకమిది.

**2**

మొదటిసారిగా మిగులు మనుషుల సమస్యను రాజ్యాంగపరంగా, గుర్తించి ఒక సమాధానంగా మిగులు మనుషుల ఉద్యోగపు హక్కును పార్లమెంట్ ఒక చట్టం ద్వారా కల్పించింది. ఎన్‌ఆర్‌ఇజి చట్టం 2005లో రూపొందించబడి, మొదటి దశ (2006)లో దేశంలోని రెండు వందల గ్రామీణ ప్రాంత జిల్లాలకు, రెండవ దశ (2008-09)లో దేశంలోని మూడు వందల గ్రామీణప్రాంత జిల్లాలకు, తరువాతి కాలంలో అన్ని జిల్లాలకు వర్తింపచేసారు. ఈ హక్కును డిమాండ్ డ్రివెన్‌గా, హక్కుల పోరాటంగా వచ్చే పథకం కింద చాలామంది ఉద్ఘాటిస్తూ ఉంటారు. ఈ చట్టం ఉపాధి అనేది వ్యక్తుల హక్కుగా కాకుండా కుటుంబ హక్కుగా గుర్తించింది. ఈ చట్టం కింద కుటుంబానికి ఒక సంవత్సరంలో వంద రోజుల పాటు ఉపాధి తప్పక కల్పించాలి. దీనికి మరొక ఆకర్షణ ఉపాధి ఇచ్చిన వారిలో మూడవ వంతు స్త్రీలు ఉండాలనే షరతు కూడా ఉంది. భూమి మీద తక్కువ నైపుణ్యత కలిగి శారీరక శ్రమ చేయటానికి సంసిద్ధులయిన వాళ్లు ఈ ఉపాధి పొందటానికి అర్హులు. ఇటువంటి మనుషులు ఒక అర్జీపత్రం దాఖలు చేస్తే, దాని ఆధారంగా ఆ కుటుంబానికి ఒక జాబ్ కార్డ్ ఇస్తారు. ఈ జాబ్ కార్డ్ వచ్చిన తరువాత నేను ఇప్పుడు నిరుద్యోగిని, నాకిప్పుడు పని కావాలి అని పంచాయతీకి వినతిపత్రం సమర్పించాలి. ఆ వినతిపత్రం సమర్పించిన పదిహేను రోజులలో ఆ కుటుంబానికి ఉపాధి కల్పించవలసిన బాధ్యత పంచాయతీ మీద ఉంటుంది. ఒకవేళ కల్పించలేకపోతే 1/4 వంతు కూలీని తరువాతి కాలంలో 1/2 వరకు నిరుద్యోగ భృతిని చెల్లించవలసి ఉంటుంది. ఇది వారి హక్కు. ఈ కార్యక్రమానికి అయ్యే ఖర్చు కేంద్ర ప్రభుత్వం భరిస్తుంది.

కేంద్ర ప్రభుత్వం జాతీయ ఉపాధి హామీ నిధిని (నేషనల్ ఎంప్లాయ్‌మెంట్ గ్యారంటీ ఫండ్) ని ఏర్పరచి చట్టం అమలుకు కావలసిన ధనసహాయాన్ని వార్షిక బడ్జెట్ ద్వారా ప్రతిపాదిస్తుంది. గత మూడు సంవత్సరాలలో నిధులు మొత్తం సాలీనా 10,000 కోట్ల రూపాయల నుండి 30,100 కోట్ల రూపాయల వరకు, తాత్కాలిక బడ్జెట్ (2009) ద్వారా సమకూర్చింది. ఈ నిధుల నుండి కేంద్ర ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలకు కొంత మొత్తం మంజూరు చేయడంతో పాటు ఈ చట్టం ద్వారా గ్రామాలలో నిరుద్యోగులకు ఉపాధి ఇచ్చే నిమిత్తం అమలు చేయగల పథకాల పట్టి, దానికి కావలసిన సూచనలు తయారు చేస్తోంది. ఈ క్రమానికి కేంద్రం వంద శాతం కూలీల ఖర్చును భరిస్తే, రాష్ట్రం వస్తు సామాగ్రికి, నిరుద్యోగ భృతికి అయ్యే ఖర్చులో 75 శాతం భరిస్తుంది. కేంద్రం నుండి మొదలుపెట్టి గ్రామం ద్వారా ఈ కార్యక్రమాలను అమలు చేయటానికి, విధి నిర్వహణలో లోపాలు రాకుండా ఉండటానికి కావలసిన చెక్స్ అండ్ బాలెన్సెస్ చాలా స్పష్టంగా చట్టంలోనే పొందుపరచారు. దీని సహాయంతో సాగునీటికి సంబంధించిన వివిధ పథకాలు, ఇందులో ఆదివాసీ దళిత స్త్రీలకు చెందిన భూములకు ప్రాముఖ్యతనివ్వడం, వరద నియంత్రణ మొదలైన వాటికి సహాయ పడగల ఏ ఇతర పథకాలనైనా రాష్ట్ర ప్రభుత్వ సలహామేరకు కేంద్ర ప్రభుత్వ అనుమతితో ఎంచు కోవచ్చును. ఈ

పథకాలన్నీ కూడా గ్రామంలో మౌలిక సదుపాయాలను మెరుగుపరచగలవని, అది అభివృద్ధికి దోహదపడుతుందనే నమ్మకం కూడా అంతర్లీనంగా ఉంది.

ఈ చట్టం ప్రకారం గ్రామ పంచాయతీకి ఒక ముఖ్యమైన బాధ్యత అప్పగించడమైంది. ఆ బాధ్యత గ్రామానికి ఒక అభివృద్ధి ప్రణాళిక తయారుచేసుకోవడం, ఆ అభివృద్ధి జరగటానికి కావలసిన పథకాలను ఎంచుకోవటం, ఎంచుకున్న పథకాలను అమలు చేయడం, అమలులో వచ్చే లోపాలను సవరించుకునేందుకు ఒక సామాజిక పర్యవేక్షణ (సోషల్ ఆడిట్) చేయడం, వీటన్నిటినీ గ్రామ పంచాయితీ మీద ఉంచారు. ఈ పథకాల ఎంపికకు, దాని అమలుకు మిగులు మనుషుల ఎంపికకు, పథకాల అమలుకు కావలసిన సాంకేతిక, ఆర్థిక పరిజ్ఞానం ఒక ప్రోగ్రాం ఆఫీసర్ ద్వారా సమకూర్చటానికి ఒక చట్టం చేసారు. ఈ గ్రామ పంచాయతీకి ఒక మెట్టుపైన ఉన్న కొన్ని పంచాయతీల సముదాయమైన బ్లాక్ లెవల్‌లో, పంచాయతీలు ఎంపిక చేసిన పథకాలను క్రోడీకరించి, క్రమబద్ధీకరించి, ఇంకా పై స్థాయిలో ఉన్న జిల్లా కలెక్టర్ కార్యాలయానికి (డిఆర్‌డిఒ) పంపాలి. ఏ గ్రామంలో ఏ పథకం, ఏ సాంకేతిక పరిజ్ఞానంతో చెయ్యాలి (అంటే ఎంతమంది మిగులు మనుషులకు ఉపాధి కల్పించాలి, ఎంత ఖర్చు అవుతుంది) అనే నిర్ణయం ఈ జిల్లా ప్రోగ్రాం కోఆర్డినేటర్ కార్యాలయానికి వెళుతుంది. గ్రామానికి గల సాంకేతిక నైపుణ్యం బట్టి దానికి ఏ పథకం మంజూరు చెయ్యవచ్చును అనే నిర్ణయం ఈ కార్యాలయం మీద ఆధారపడుతుంది. ఈ క్రమంలో ఎన్‌ఆర్‌ఇజిఎ అనేది రూపాంతరం చెంది మిగులు మనుషుల కేంద్రం నుండి పథకాల కేంద్రంగా తలకిందులయిపోయింది. గ్రామపంచాయతీ, ఇందులో ఉండే నిరుద్యోగ సమస్య నుండి ఉద్భవించిన చట్టం ఒక మౌలిక సదుపాయాల లేమి సమస్యగా మారడంతో, ప్రజల ఆకాంక్షల నుండి, అవసరాల నుండి ప్రభుత్వయంత్రాంగం (బ్యూరోక్రసీ) చేతిలోకి మారిపోయింది. చిక్కుకు పోయింది. నిరుద్యోగం అనే ప్రశ్నకి సమాధానంగా వచ్చే ఉద్యోగమూ, అది లేకపోతే వచ్చే నిరుద్యోగ భృతి ఇవే ఎన్‌ఆర్‌ఇజిఎలో ప్రధాన సమస్యలుగా మిగిలిపోయాయి.

చట్టం ప్రకారం కేంద్రం ఉద్యోగావకాశాల నిమిత్తం రాష్ట్రానికి నిధులు విడుదల చేస్తూ ఒకవేళ నిధులు ఉపయోగించుకోలేకపోయినా, ఉపయోగించినా కూడా ఇంకా నిరుద్యోగులు ఉండి, ఉద్యోగం గురించి దరఖాస్తులు పెట్టుకుంటే ఆ నిరుద్యోగులకు భృతి ఇవ్వవలసిన బాధ్యతని రాష్ట్ర ప్రభుత్వం మీద వేసింది. ఒక విధంగా నిరుద్యోగ భృతి తక్కువ చేయడం గురించి రాష్ట్ర ప్రభుత్వాలు కేంద్రం నుంచి వచ్చే నిధులను సక్రమంగా వినియోగించుకుంటాయనీ, ఇంకా నిధులు కావాలని కోరుతాయనీ, అది కేంద్రం తయారు చేసిన చెక్స్ అండ్ బాలెన్సెస్‌లో ఒక భాగంగా ఊహించింది. ఇది చదవటానికి ఆశించటానికి చాలా మంచిదే కాని ఆచరణలో చాలా లోపాలు తీసుకుని వస్తోంది. ఈ లోపాలు రాష్ట్రస్థాయి నుంచి గ్రామ సర్పంచ్ వరకు వ్యాపిస్తాయి. ఉదాహరణకు గ్రామపంచాయతీకి పథకాలు మంజూరు కాని కాలంలో కూడా అర్జీపత్రాలు నమోదు చేసుకోవచ్చును. అవి నమోదు చేసినా జాబ్‌కార్డ్స్ సరఫరా చెయ్యకపోవచ్చును. వీటిని సరఫరా చేసినా కూడా ఉద్యోగం కావాలని కోరుకునే వినతి పత్రాలు నమోదు చేసుకోక పోవచ్చును. ఒకవేళ నమోదు చేసుకున్నా కూడా అందులో ఉండవలసిన సర్పంచ్ సంతకం / ప్రాజెక్ట్ ఆఫీసర్ సంతకం ఉండకపోవచ్చును. ఈ క్రమం మొత్తంలో అవినీతి దానంతటదే చోటు చేసుకుంటుంది. ఎన్‌ఆర్‌ఇజిపి పనితీరు మీద విశ్లేషించే చాలా రిపోర్ట్‌లు ఈ అవినీతి మీదే కేంద్రీకరిస్తాయి. వేసిన రోడ్లే వేస్తున్నారనీ, తవ్విన చెరువులే తిరిగి తవ్వుతున్నారనీ, మనిషి శ్రమద్వారా కాకుండా మెషీన్ల ద్వారా పని చేయిస్తున్నారనీ, దొంగ జాబ్‌కార్డ్స్‌తో పని చేయిస్తున్నారనీ, పోస్టు ఆఫీసుల లోనో, బ్యాంకులలోనో జమ చేయవలసిన కూలీ డబ్బు అవినీతిలో కూరుకుపోయిందనీ ఒకవైపు చాలా రిపోర్ట్‌లు వస్తుండగా ఈ అవినీతికి ముఖ్యపట్టు ఏమిటి అనే ప్రశ్న చాలా వరకు ముందుకు రావడం లేదు. ఈ ప్రశ్నకి సమాధానం చూడాలంటే మళ్లీ మొదటికి వచ్చి చట్టం ముఖ్యోద్దేశాలు, చట్టంలో అంతర్లీనంగా ఉన్న ఆలోచనా విధానం గురించి చూడవలసి ఉంటుంది.

### 3

గ్రామీణ ప్రాంతంలో నిరుద్యోగం ఒక తీవ్రమైన సమస్య అనీ, ఆ నిరుద్యోగ సమస్య వ్యవసాయపు పనులు లేనికాలంలో చాలా తీవ్రతరమనీ, ఆ వ్యవసాయపు పనులు లేనికాలంలో కుటుంబానికి ఒక వంద రోజుల వరకు పని కల్పించవలసిన బాధ్యత ప్రభుత్వానిదనీ, పని కోరుకోవడం అనేది ఒక హక్కు అని గుర్తించడం ఈ చట్టం ముఖ్యోద్దేశం. అంతేకాకుండా ఈ పని కల్పించడం ద్వారా గ్రామాభివృద్ధి సాధ్యమనీ, అభివృద్ధికి నోచుకోని గ్రామప్రాంతాలలో ఈ చట్టం ద్వారా అభివృద్ధి క్రమాన్ని ప్రవేశపెట్టగలమని కూడా చట్టం మరో ఉద్దేశం. అందువల్లనే చట్టంలో గ్రామపంచాయతీల గురించి చెబుతూ ప్రతి పంచాయతీ తన గ్రామానికి ఒక అభివృద్ధి పథకాన్ని తయారు చేసుకోవాలని కోరారు. గ్రామాభివృద్ధి ఎందుకు ఆగిపోయింది? అది తిరిగి జరగాలంటే కావలసిన ఆచరణ కార్యక్రమాలేమిటి? అవి సాధించే ప్రక్రియలేమిటి? దానికి సరిపడా అధికారం పంచాయతీలకు ఉన్నదా? ఆ గ్రామాభివృద్ధికి కావలసిన ఆర్థిక, సామాజిక అవగాహన పంచాయతీలకు ఉన్నదా? అనే ప్రశ్నలు ఊహాగానానికే వదిలివేసారు. గ్రామాభివృద్ధి అంటే గ్రామమంతా అభివృద్ధి అనే కోణం ఎక్కువగా కనిపిస్తుంది. ప్రస్తుతమున్న భావజాలంలో అభివృద్ధి ఒక పెట్టుబడి సమస్యగా, అది కూడా మౌలిక సదుపాయాల మీద పెట్టుబడి సమస్యగా చూడటం ఒక ప్రధానాంశం. అందుచేత అభివృద్ధి అంటే ఈ సదుపాయాలు (ఇన్‌ఫ్రాస్ట్రక్చరల్ ఫెసిలిటీస్) కలిగించటమేనని చట్టంలో ఇటువంటి ప్రాజెక్టుల ప్రమేయం గురించి విస్తృతంగా వివరించారు. ఈ కారణంగా చట్టం రూపొందించబడే క్రమంలోనే ఉపాధి ప్రాముఖ్యత వెనుకకుపోయి ప్రాజెక్టుల ప్రాముఖ్యత పెరిగింది. ఈ చట్టం పనితీరు, ఆచరణలో వివరాల మీద చర్చకూడా ఈ పథకాల కేంద్రంగానే జరుగుతోంది.

ఎన్ని ప్రాజెక్ట్‌లు చేసారు? ఎంతమందికి ఎన్ని రోజులు ఉపాధి కల్పించారు అనేవి ప్రాజెక్ట్ సఫలమైందా లేదా అనేదానికి గీటురాయి కింద చూడటం జరుగుతోంది. ఏ ప్రాజెక్ట్ ఎంత గ్రామాభివృద్ధి జరగటానికి దోహదపడింది అనే అంశం మీద చర్చ చాలా తక్కువ. ఒక రోడ్డు వేసినందువలన గ్రామంలో వచ్చిన ఆర్థిక, సామాజిక మార్పులేమిటి? ఒక పంటకాలువ పథకం ద్వారా వ్యవసాయోత్పత్తులు పెరిగాయా? అనే ప్రశ్నలు అభివృద్ధి సూచికలు. ఒక చట్టం అమలులో విజయవంతమైంది లేదు అని చూడటానికి కావలసిన గీటురాయి.

ఒకవేళ ఈ మార్పులనేవి జరిగి ఉంటే, ఏ వర్గానికి, ఏ కులానికి, అంటే వ్యవస్థాగతమైన మార్పులు ఏమన్నా వచ్చాయా? అనేది చూడకపోతే గ్రామాభివృద్ధి ధ్యేయంగా పెట్టుకున్న ఉపాధి గ్యారంటీ చట్టంలో ముఖ్యోద్దేశ్యం నెరవేరిందా లేదా అనేది చెప్పడం చాలా కష్టం. గ్రామాభివృద్ధిని పక్కనపెడితే ఉపాధి కల్పించటమే చట్టం ముఖ్యోద్దేశ్యంగా చూస్తే చట్టం వలన ఆదాయం పెరిగిన కుటుంబాలు పెరిగిన తమ ఆదాయాన్ని ఎలా వినియోగించుకుంటున్నాయి, తమ అప్పుల తీవ్రత తగ్గిందా, మంచి పౌష్ఠికాహారం దొరుకుతోందా, పిల్లల చదువుల మీద, కుటుంబ సభ్యుల ఆరోగ్య అవసరాల మీద ఖర్చు చేస్తున్నారా, వాళ్ల స్థితిగతులు మెరుగయ్యాయా అనే కోణం గురించి కూడా ఆలోచించ వలసిన అవసరం చాలా ఉంది. ఈ పెరిగిన ఆదాయం ఏ వస్తువుల మీద డిమాండ్ పెంచుతోంది, గ్రామీణ ప్రాంతంలో తయారవుతున్న వస్తువుల మీద గిరాకి పెరుగుతోందా, అలా జరిగితే గ్రామీణ వ్యవస్థలోనే మార్పు ఉంటుంది. గ్రామాభివృద్ధిని కేంద్రంగా చూసే క్రమంలో ఈ చట్టం విజయవంతమైంది అని చెప్పటానికి ఇది మరొక కొలమానం.

సాధారణంగా వాడుకలో వాడే ఒక మాట అభివృద్ధి. ఏ విషయం లోనైనా ఒక మార్పు కనిపిస్తే ఆ మార్పుని అభివృద్ధిగా చూడడం మనకి పరిపాటి. మార్పు రెండురకాలు, ఒకటి పరిమాణాత్మకమైన మార్పు, దీన్నే రాశిలో మార్పు అని కూడా అంటారు. పరిమాణాత్మకమైన మార్పు వృద్ధి (గ్రోత్) అయితే, గుణాత్మకమైన మార్పు అభివృద్ధి (డెవలప్‌మెంట్) గా చూడవచ్చును. వృద్ధికి కారణం బాహ్యశక్తులైతే అభివృద్ధికి కీలకం అంతర్గత శక్తులు. అంతర్గత శక్తుల ప్రభావం వలన వచ్చిన గుణాత్మకమైన మార్పు ఒక పాతరూపం నుండి కొత్త రూపం రూపు తీసుకునే క్రమం అభివృద్ధికి కీలకం. ఉదాహరణకి ఒక విత్తనం నుండి మొక్క రావడం మనందరికీ తెలిసినదే. ఒక కోడి గుడ్డు నుండి కోడిపిల్ల రావడం, మరుగుతున్ననీరు ఆవిరిగా మారడం ఇలా ఏదైనా చెప్పుకో వచ్చును. ఇక సమాజానికి వస్తే ఒక వ్యవస్థ నుండి మరొక వ్యవస్థలోకి రూపాంతరం చెందటం అభివృద్ధి అవుతుంది. ఒక ఫ్యూడల్ సమాజం లోంచి పెట్టుబడిదారీ సమాజంగా మారడం లేదా ఫ్యూడల్ సమాజం లోంచి పెట్టుబడిదారీ సమాజం రూపుతీసుకోవడం, అలాగే పెట్టుబడిదారీ సమాజం ఒక సోషలిస్టు సమాజంగా మారడం లేదా పెట్టుబడిదారీ సమాజం లోంచి సోషలిస్టు సమాజం పుట్టడం. ఈ వ్యవస్థాగత మార్పులు అభివృద్ధిని సూచిస్తాయి. అంతర్గత కారణాల వలన వచ్చిన ఈ ప్రక్రియ సామాజికంగా మౌలికమైన మార్పులు తెచ్చేక్రమం మనిషిలో చైతన్యాన్ని కూడా మార్చే క్రమం కిందే చూడవలసి వస్తుంది.

అలా కాకుండా బాహ్యకారణాల వలన వస్తే ఈ వ్యవస్థాగత మార్పులు మానవ చైతన్యాన్ని మార్చగలవా అనేది సందేహాత్మకం. మానవ చైతన్యంలో మార్పులేని వ్యవస్థాగత మార్పులు అభివృద్ధి అని చెప్పడం కష్టతర పరిస్థితి. అంతర్గతంగా వ్యవస్థలో మార్పులు అని చూసినపుడు ఏ వ్యవస్థకైనా ఉపయోగపడే నాయకత్వంలో కూడా మార్పులు రావలసి ఉంటుంది. ఒక ఫ్యూడల్ సమాజంలో ఉండే నాయకత్వం పోయి పెట్టుబడిదారీ వ్యవస్థగా మారుతున్న క్రమంలో సమాజానికి పెట్టుబడిదారులే నాయకులుగా వ్యవహరిస్తారు. అలాగే సోషలిస్టు సమాజంగా మారే క్రమంలో సమాజానికి నాయకత్వం పెట్టుబడిదారు నుండి శ్రామిక నాయకత్వంలోకి మారవలసి వస్తుంది. అలా జరిగితే దానిని ఒక పరిపూర్ణ అభివృద్ధి అంటాం.

అభివృద్ధికి కీలకం అంతర్గత కారణాలు ఒక పక్కనయితే ఒక కొత్త నాయకత్వం రావటం ఇంకొకవైపు. ఈ కొత్త నాయకత్వం వనరుల దుర్వినియోగం, వినియోగించుకోలేక పోవటం, వనరులను ఒక కొత్త తరహాలో కొత్త ఉపయోగాలకు వాడుకోవడం, ఇప్పటివరకూ వనరులుగా కనిపించని వాటిని వనరులుగా గుర్తించి ఉపయోగించుకోవటం, ఇత్యాది కార్యక్రమాలను ప్రవేశపెట్టటం ద్వారా ఒక కొత్త వ్యవస్థకు పునాదులు వేస్తుంది. అదే అభివృద్ధి క్రమం. గ్రామీణ ఉపాధి పథకంలో గ్రామాలకు తమ అభివృద్ధి క్రమం తయారు చేసుకోవడం, దానికి కావలసిన ప్రక్రియలు, ప్రాజెక్ట్స్ (పథకాలు) తయారు చేసుకోవడం, వాటిని క్రమబద్ధీకరించి అమలు చేసుకోవడం అనే క్రమంలో గ్రామంలో ఉండే ముఖ్యమైన మానవ వనరులను కేంద్రంగా తీసుకుని అభివృద్ధి క్రమాన్ని అమలు చేయాలనేది చట్టం ముఖ్యోద్దేశ్యం.

## 4

గ్రామీణ ఉపాధి పథకం ఉపాధిని ఒక హక్కుగా గుర్తించడం వలన మిగిలిన దారిద్ర్య నిర్మూలన కార్యక్రమాల కంటే ఒక మెరుగైన పథకం. ఈ పథకం ముఖ్య ఉద్దేశ్యం అమలులో విజయవంతం కావాలంటే కొన్ని సవరణలు కావలసి ఉంటుంది. ఆ సవరణలలో ముఖ్యమైనది గ్రామ పంచాయతీలు ఒక అభివృద్ధి కేంద్రంగా రూపుదిద్దు కోవడానికి కావలసిన వెసులుబాట్లు, అధికారాలు పంచాయతీలకు ఇవ్వవలసి ఉంది. పంచాయతీ పరిధిలో ఏ వనరులున్నాయి, వాటి దుర్వినియోగం కాని, అసంపూర్ణ వినియోగం కాని ఉంటే ఆ వనరుల వినియోగాన్ని మార్చగలిగే అధికారం పంచాయతీకి ఉండాలి. ఉదాహరణకు కౌలుదారీ చట్టం వనరుల ఉపయోగాన్ని పెంపొందించేది అనుకుంటే, దానిని అమలు చేసే అధికారం పంచాయతీలకి ఉండాలి. గ్రామంలో పెద్ద పెద్ద రైతులు భూములను సక్రమంగా ఉపయోగించుకోలేకపోతే దానిని ఉపయోగించే క్రమానికి పంచాయతీకి అధికారం ఉండాలి. గ్రామంలో బంజరు భూములుంటే ఆ భూములను పంట భూములుగా మార్చే అధికారం పంచాయతీకి ఉండాలి. వనరులకు కొత్త ఉపయోగాలు ప్రవేశపెట్టడం కూడా పంచాయతీ అధికార పరిధిలో ఉండాలి. స్థూలంగా ఒక అభివృద్ధి క్రమానికి రూపం ఏర్పరుచుకునే అవకాశం, అధికారం పంచాయతీకి ఉండాలి. అది లేనంత కాలం ప్రస్తుత చట్టం అమలులో కేంద్రం రూపొందించిన పథకాలలో ఒక దాన్ని ఎంపిక చేసుకోవడమే పంచాయతీకి ఉండే కర్తవ్యంగా మిగిలిపోతుంది.

పంచాయతీ రాజ్ చట్టానికి 73వ సవరణ ఒక ముఖ్యమైన వికేంద్రీకరణ. అంటే ఆ సవరణ ద్వారా గ్రామ అధికార యంత్రాంగంలో అణిచివేయబడుతున్న కులాలు, మహిళలకు రాజ్యాధికారం ఇవ్వడం జరిగింది. ఒక రకంగా ఇది ఒక నూతన నాయకత్వం కిందే చూడవచ్చును. గ్రామ పంచాయతీకి పైన చెప్పిన అధికారం, వెసులుబాటు వనరుల మీద లేనంతకాలం ఈ నాయకత్వం కొత్త అభివృద్ధి రూపాన్ని గ్రామానికి తీసుకుని రాగలదు అనేది చాలా చర్చనీయాంశం.

ఏ చట్టమైనా ఆచరణయోగ్యంగా ఉండాలంటే కొన్ని చెక్స్ అండ్ బాలెన్సెస్ ఆ చట్టంలోనే ఇమడ్చటం జరుగుతుంది. ఉదాహరణకి కేంద్రం నిధులు మంజూరు చేస్తే రాష్ట్రం ఆ నిధులను ఉపయోగించు కోలేని పరిస్థితిలో నిరుద్యోగ భృతి ఇవ్వవలసిన బాధ్యత రాష్ట్రం మీద ఉంటుంది.

రాష్ట్రం నిధులను జిల్లాలకు పంపిణీ చేసే క్రమంలో జిల్లా అధికారి డిఆర్‌డిఒ పథకాల ఎంపిక చేసి వాటిని మదింపు చేయిస్తారు. పంచాయితీలకు నిధుల వితరణ బాధ్యత, అధికారం డిఆర్‌డిఒ ది. పథకాలలో తప్పయినా, ఉపాధి ఇవ్వలేకపోయినా, అనధికారంగానైనా, డిఆర్‌డిఒ మీద ఒత్తిడి పెరుగుతుంది. పంచాయితీకి ఉండే మూడుమెట్లలో ఈ జిల్లాస్థాయి మెట్టు కీలకమైంది. దాని కింద ఉండే మెట్టు బ్లాక్ లేదా మండలం. ఈ మండలంలో ఉండే గ్రామాల పథకాలను క్రోడీకరించి పైమెట్టుకి అందించే బాధ్యత ఈ బ్లాక్‌లెవల్ మెట్టుది. అసలయినది గ్రామ పంచాయితీ అనే మూడవ మెట్టు. దాని బాధ్యత నిరుద్యోగం పట్టిక తయారు చెయ్యడం, జాబ్ కార్డ్స్ ఇవ్వడం, వారి దగ్గర నుండి ఉద్యోగం కావాలనే వినతిపత్రం తీసుకోవడం, గ్రామ సభనుండి వచ్చిన వాటిలోంచి పథకాలను ఎంపిక చేయడం, ఎంపిక చేసిన వాటిని అమలు చేయడం, దానికి ఒక సోషల్ ఆడిట్ జరిపించడం పంచాయితీ కర్తవ్యం.

ఇలా చూస్తే ఒక పథకం గ్రామసభ నుండి గ్రామపంచాయతీకి వస్తే, గ్రామ పంచాయతీ నుండి మండలంకి, మండలం నుండి జిల్లా పరిషత్‌కి ప్రయాణించి, అక్కడి నుండి ఆ పథకం తిరుగు ప్రయాణంలో గ్రామ పంచాయతీకి వస్తుంది. ఇందులో కాలయాపనే కాకుండా అవినీతికి కూడా చాలా అవకాశం ఉంది. చెక్స్ అండ్ బాలెన్సెస్ ద్వారా పథకం అమలులో జరిగే లోపాలను అదుపు చెయ్యాలని చూసిన చట్టం, ఒక మంచి పంచాయితీ ఒక అభివృద్ధి క్రమంలో వెళ్లేదానికి కావలసిన ఇన్సెంటివ్ సిస్టమ్స్ తయారు చెయ్యలేదు. ప్రజల చుట్టూ తిరగవలసిన అభివృద్ధి, దీనికి అవసరమైన పథకాలు బ్యూరోక్రసీ (ప్రభుత్వ యంత్రాంగం) చుట్టు తిరగడంతో ఒక మంచి ఉద్దేశ్యంతో రూపొందించిన చట్టం మంచికంటే చెడే ఎక్కువ చేసే పరిస్థితి ఉంది.

## 5

దేశంలో పేదరిక సమస్య తీవ్రంగా ఉన్న నేపథ్యంలో, ఈ ఎన్‌ఆర్‌ఇజిఎ ప్రాముఖ్యతని ఒకసారి పరిశీలిద్దాం. ఇప్పటివరకు ప్రవేశపెట్టిన దారిద్ర్య నిర్మూలన పథకాలన్నీ కూడా పేదలమీద సానుభూతితో, నైతిక బాధ్యతతో 'ఉచితంగా' సహాయాన్ని ఇస్తున్నట్లు భావిస్తున్న పథకాలే. కానీ ఈ చట్టం వీటికి భిన్నంగా ప్రతి కుటుంబానికి వంద రోజుల ఉపాధి హామీ ఇవ్వడమే కాకుండా, నిరుద్యోగులయి ఉండి శారీరక శ్రమ చెయ్యడానికి ఇష్టపడే వ్యక్తులు ఉపాధి కావాలని, దానికి అర్జీపత్రం ఇచ్చి నమోదు చేయించుకోవడం, ఉపాధి దొరకకపోతే నిరుద్యోగ భృతికి అర్హులని ఈ చట్టంలోనే రూపొందించబడింది. అంటే ఉపాధి కావలసిన వ్యక్తి తనకు తానుగా ముందుకురావడం, తనకు ఎటువంటి పని చెయ్యగల సామర్థ్యం ఉందో గ్రహించుకోవటం, దానికి కావలసిన ప్రయత్నాలు చెయ్యడం ద్వారా ఉపాధి పొందే అవకాశాలు ఈ చట్టం ద్వారా వచ్చాయి. దీన్ని మరొక రకంగా చూస్తే, చట్టం ఒక వ్యక్తికి తన స్వశక్తితో ముందడుగు వేసే ప్రయత్నాలకు (ఇండివిడ్యుల్ ఇనిషియేటివ్) ప్రాముఖ్యతనిచ్చింది. (దీన్నే కొంతమంది డిమాండ్ డ్రివెన్ స్కీంగా వర్ణిస్తున్నారు) ఈ చట్టం రూపొందించటం ద్వారా స్వశక్తి మీద ఆధారపడే వ్యక్తులకు ఉపాధి కోరే డిమాండ్ చేసే హక్కు రావడమే కాకుండా, వ్యక్తులు కోరినపుడు ఉపాధి ఇవ్వవలసిన బాధ్యతను కూడా ప్రభుత్వం చేపట్టింది. ప్రతి మనిషికి సంవిధానం ద్వారా జీవించే హక్కు ఉన్నట్లే, ప్రతి మనిషికి ఈ చట్ట రూపేణా ఉపాధి కూడా ఒక హక్కుగా సంవిధానంలో చేర్చబడింది. ఇదే ఈ చట్టానికి ఉన్న ప్రాముఖ్యత.

రెండవ అంశం, వలసల మీద ప్రపంచ బ్యాంక్ తన నివేదిక (2009)లో, మన దేశంలో ప్రభుత్వం రూపొందించిన ఎన్‌ఆర్‌ఇజిఎ అనే పబ్లిక్ పాలిసీ మీద స్పందిస్తూ, ఈ చట్టం అమలు అయ్యే క్రమంలో వలసలు ఆగిపోవడం అనే పరిణామం వలన అభివృద్ధి కుంటుబడుతుందనే అభిప్రాయం వెలిబుచ్చింది. ఇక్కడ వలసల మీద ప్రపంచ బ్యాంక్‌కి, ప్రపంచదేశాలలోని అభివృద్ధి మార్గం మీద ఉన్నట్లుగానే, ఒక అసంపూర్ణమైన అవగాహన వ్యక్తమౌతోంది. కొంచెం లోతుగా ఈ వలసక్రమాన్ని పరిశీలించితే ఇవి రెండురకాలుగా కనిపిస్తాయి. జీవనోపాధి దొరకని ప్రాంతం నుండి ఉపాధి ఎక్కువగా దొరికే ప్రాంతాలకు మనుషులు అనుసరించే ప్రక్రియని వలసగా నిర్వచించుకుంటే, ఒక తరహా వలసలతో ప్రజలు తమ స్వస్థలాన్ని ఒదిలి, వలస ప్రాంతంలో శాశ్వతంగా స్థిరపడిపోయే ప్రక్రియ. ఈ క్రమం వలన వలస ప్రాంతంలోని వ్యవస్థకి, ఒక స్థిరత్వం వస్తుంది. పట్టణాలలో మౌలిక సౌకర్యాలు పెరిగే కొద్దీ, పట్టణ అభివృద్ధిలో వలస ప్రజలు భాగమవుతారు. అలా కాకుండా, రెండవ తరహా వలసలో మరొక ప్రాంతానికి వలసపోయినా కూడా, వలస ప్రాంతంలో ఆర్థిక, సామాజిక భద్రత కరువైన కారణంగా, ఈ అభద్రతా భావం కారణంగా, తమకు తెలిసిన భద్రతను వెతుకుతూ స్వస్థలానికి తిరిగి వచ్చేస్తారు. ఇటువంటి వలసలు తమ స్వస్థలంలో, వలసస్థలంలో కూడా అస్థిరపరిస్థితులను కల్పిస్తాయి. ప్రపంచ బ్యాంక్ తమ నివేదికలో సూచించిన వలసలు మొదటిరకం శాశ్వత వలసలు. వీటివలన అభివృద్ధి సాధ్యమే. అభివృద్ధి చెందిన ప్రపంచ దేశాలలో పెద్ద పెద్ద పట్టణాలన్నీ కూడా ఈ క్రమంలోనే ఏర్పడ్డాయి. కాని మన దేశంలో, ఇతర అభివృద్ధి పథకాలలో జరిగినట్లుగానే, వలసలన్నీ కూడా రెండవ తరహా వలసలే. పాలమూరు కూలీలవవచ్చును, ఒరిస్సా నుండి అహమ్మదాబాద్ మిల్లులకు లేక ఢిల్లీలాంటి ప్రదేశాలకు భవన నిర్మాణానికి వెళ్లేవారు తమ స్వస్థలానికి తిరిగి వెళ్లిపోయే ఆశతోనే ఉంటారు. ఎన్‌ఆర్‌ఇజిఎ చట్టం అమలు మొదటిరకం శాశ్వత వలసలను ప్రభావితం చెయ్యదు, రెండవ రకం తాత్కాలిక వలసలను ఆపుతుంది. దీనివలన వలసలు మానివేసిన ఆ వ్యక్తులే కాకుండా, వ్యవసాయరంగంలో మౌలిక మార్పులు సాధ్యమై, ప్రపంచబ్యాంక్ సూచించినట్లుగా అభివృద్ధికి అడ్డంకిగా కాకుండా అభివృద్ధికి మూలంగా గుర్తించవలసి ఉంటుంది. (ఈ క్రమం సాధ్యం కావాలంటే ఈ కింది మార్పులవసర మౌతాయి.)

వికేంద్రీకరణ ద్వారా పంచాయితీకి, ఇతరులు ఎంపిక చేసిన పథకాలు కాకుండా, తమ విలేజ్ డెవెలప్‌మెంట్ కౌన్సిల్ రూపొందించిన అభివృద్ధి పథకాలను ఎంపిక చేసే అధికారం ఉండాలి. వీటిని అమలు చేసే క్రమంలో గ్రామంలోని వివిధ వనరుల వినియోగాన్ని, దీనికనుగుణంగా కావలసిన మార్పులు చేసుకోగల సామర్థ్యం, వాటిని అమలు చేయగల అధికారం ఉండాలి. ఈ క్రమంలో రూపు తీసుకునే నూతన నాయకత్వానికి బలం, ఇలా అభివృద్ధిని పెంపొందించగలిగే గ్రామ పంచాయితీలకు ప్రోత్సాహకాలు ఇవ్వడం చేయగలిగితే ఈ చట్టం సుదీర్ఘమైన మార్పులకు దోహదకారి అవుతుంది. లేకపోతే ఇది కూడా మిగతా పథకాలలాగా వ్యవస్థలో మార్పులు తేకుండా ఇప్పుడున్న వ్యవస్థనే బలపరుస్తుంది. వీ

*పెట్టుబడి సంఘవ్యతిరేక పోటీతత్వాన్ని పెంచుతుందనీ, ఆస్తిని పోగు చేసుకోవడాన్ని ప్రోత్సహిస్తుందనీ, పర్యావరణాన్ని ధ్వంసం చేస్తుందనీ చెబుతూ పెట్టుబడా, మనిషి మనుగడా అనేది మనమే తేల్చుకోవాలనంటున్నారు* **కె. నరేంద్రమోహన్**

# వాతావరణ సంక్షోభ మూలాలు

వేగంగా సంభవిస్తున్న వాతావరణ మార్పుల వల్ల ఎదురయ్యే విపరీత ప్రభావాల గురించి రెండు దశాబ్దాల నుంచి శాస్త్రవేత్తలు, పర్యావరణ కార్యకర్తలు చర్చిస్తూనే ఉన్నారు. వాతావరణ మార్పులేకావు అంటూ దానిని గుర్తించటానికి నిరాకరించిన అమెరికా అధ్యక్షుడు జార్జ్ బుష్‌తో పోలిస్తే, ఈ సమస్యను ఎదుర్కోటానికి పారిశ్రామిక పాశ్చాత్య దేశాలు పూనుకోవటాన్ని పరిశీలిస్తే దీనివల్ల ముప్పులను గుర్తించాయని తెలుస్తోంది. ఈ అంశాల పట్ల సాధారణ అవగాహన కూడ ఎంతో పెరిగింది.

క్లుప్తంగా చెప్పుకోవాలంటే వాతావరణంలో బొగ్గు పులుసు వాయువు, హైడ్రోకార్బన్ల స్థాయి పెరగడం వల్ల ప్రపంచ ఉష్ణోగ్రతలు పెరిగి తీవ్రమైన వాతావరణ మార్పులకు, పర్యావరణ వినాశనానికి కారణమవుతోంది. ఈ మార్పుల వల్ల కీలక వనరు అయిన నీటి మీద ప్రభావం ఎలా ఉంటుందో చూద్దాం. వాతావరణ మార్పుపై ఐక్యరాజ్య సమితి అంతర్ ప్రభుత్వ ప్యానెల్ ప్రకారం ప్రపంచ ఉష్ణోగ్రతలు సగటున 2.5 డిగ్రీల ఫారన్‌హీట్ పెరిగితే ఉత్తరార్ధగోళంలో అకాలంగా భారీ వర్షాలు పడతాయి. అదే సమయంలో భూగోళ మధ్య ప్రాంతంలోని మెట్ట, ఉష్ణమండల ప్రాంతాలలో నదీ జలాలు తగ్గిపోతాయి.

గ్లేసియర్లు, మంచు కొండలనుంచి అందే నీటిపై ప్రపంచ జనాభాలో 16 శాతం ఆధారపడి ఉంది. వాతావరణ మార్పుల వల్ల ఇలా అందే నీటి మోతాదు తగ్గి ఈ ప్రాంతాలలో ఎండాకాలంలో నీటి కొరత తీవ్రతరమవుతుంది. గ్లేసియర్లు కరగటం వల్ల సముద్ర నీటి మట్టం పెరుగుతుంది. దాని ఫలితంగా భూగర్భ జలాలు ఉప్పుగా మారతాయి. కొన్ని దీవులు మునిగిపోయే ప్రమాదముంది. మాల్దీవులు అన్న ద్వీప దేశంలో అత్యంత ఎత్తైన ప్రదేశం సముద్ర మట్టానికి ఆరడుగులలో మాత్రమే ఉంది. ఇది పూర్తిగా మునిగిపోయే అవకాశం ఉంది.

యూనియన్ ఆఫ్ కన్‌సర్నడ్ సైంటిస్ట్స్‌కి చెందిన హెన్రీ డబ్ల్యు కెండాల్ 1992లో 'మానవాళికి ప్రపంచ శాస్త్రవేత్తల హెచ్చరిక' అన్న పత్రాన్ని జారీచేశారు. దీనికి సుమారు 1700 మంది శాస్త్రవేత్తలు సంతకాలు చేశారు. నోబెల్ బహుమతి పొందిన సమకాలీన శాస్త్రజ్ఞులలో సగానికి పైగా దీనిపై సంతకం చేశారు. అందులో ఇలా పేర్కొన్నారు. 'మానవులు, ప్రకృతి ఒకరితో ఒకరు తలపడుతున్నారు. మానవచర్యల వల్ల పర్యావరణానికి, కీలకమైన వనరులకి సరిచెయ్యలేని నష్టం వాటిల్లుతోంది. మన ప్రస్తుత చర్యలను అదుపు చేసుకోకపోతే పరిస్థితులు మారి మనకు తెలిసిన విధంగా జీవనం కొనసాగించటం సాధ్యం కాకపోవచ్చు...'

వాళ్లు ఇచ్చే సందేశం ఇది, 'పెద్ద ఎత్తున మానవాళి కష్టాలకు గురికాకుండా ఉండాలన్నా, ఈ పుడమిపై మన నివాసస్థానం శాశ్వతంగా దెబ్బతినకుండా ఉండాలన్నా మన జీవిత విధానంలోనూ, వనరుల వినియోగంలోనూ గణనీయమైన మార్పులు చేపట్టాలి.' అనేక పాశ్చాత్య ప్రభుత్వాలు, ప్రత్యేకించి అమెరికాలో రిపబ్లికన్ ప్రభుత్వాలు ఇటువంటి హెచ్చరికలను తోసిపుచ్చాయి, పెడచెవిన పెట్టాయి. అయితే ప్రజలలో ఆందోళన పెరగటం వల్ల, పర్యావరణం కూడా ఎన్నికల అంశంగా మారటం వల్ల కొన్ని ఉదారవాద ప్రభుత్వాలు ఆలస్యంగానైనా ఈ అంశాలను గుర్తిస్తున్నాయి. అయితే మార్పులతో తలపడటానికి అవి ఇంకా మనస్ఫూర్తిగా సిద్ధం కావటంలేదు.

వాతావరణ సంక్షోభాన్ని ఎదుర్కోటానికి ప్రపంచస్థాయిలో విస్తృతంగా కుదుర్చుకున్న ఒప్పందంగా క్యోటో ఒప్పందాన్ని పేర్కొనవచ్చు. 1980ల నుంచి పర్యావరణవేత్తలు, శాస్త్రజ్ఞులు చేస్తున్న నిరంతర హెచ్చరికల ఫలితంగా 1997 డిసెంబర్‌లో ఈ ఒప్పందంపై వివిధ ప్రభుత్వాలు సంతకాలు చేశాయి. అయితే ఈ ఒప్పందం ఫిబ్రవరి 2005లో గానీ అమలులోకి రాలేదు. ప్రపంచ చమురులో 25 శాతాన్ని వినియోగిస్తున్న అమెరికా ఈ నాటికి కూడా దీనిని ఆమోదించలేదు.

ఈ ఒప్పందం ప్రకారం పారిశ్రామిక దేశాలు 1990లతో పోలిస్తే బొగ్గుపులుసు వాయువు, మిథేన్, నైట్రస్ ఆక్సైడ్, సల్ఫర్ హెక్సాఫ్లోరైడ్‌ల విడుదలతో పాటు హైడ్రోఫ్లోరో కార్బన్లు, పెర్‌ఫ్లోరో కార్బన్ల విడుదలను 5.2 శాతం తగ్గించుకోవాలి.

అయితే తమ లక్ష్యాలను పూర్తి చేసిన దేశాల నుంచి ఇతర దేశాలు, వ్యాపార సంస్థలు కార్బన్ 'క్రెడిట్ల'ను కొనుక్కోవచ్చు. దాని కోసం యూరోపియన్ యూనియన్, ఇతర ప్రభుత్వాలు, కార్పొరేట్ సంస్థలు ప్రపంచ బ్యాంక్ యాజమాన్యంలోని 'ప్రోటోటైప్ కార్బన్ ఫండ్' వంటి సంస్థలను ఏర్పాటు చేస్తున్నాయి. దీని అర్థం ప్రపంచ మార్కెట్లో కొని, అమ్మగల, స్పెక్యులేషన్‌కి పాల్పడగల మరొక సరుకుని తయారు చేశారు. క్యోటో ఒప్పందాన్ని సూక్ష్మంగా విశ్లేషిస్తే ఎన్నో విషయాలు బయటపడతాయి. అసలైన అంశం పక్కదారి పట్టకుండా ఉండటానికి ఆ విమర్శకు ఇక్కడ పూనుకోవడం లేదు. క్లుప్తంగా చెప్పాలంటే

ప్రభుత్వాలు, స్వచ్ఛంద సంస్థలలోని ఒక వర్గమూ ప్రతిపాదిస్తున్న పరిష్కారం వీటి మిశ్రమంగా ఉంది. మార్కెట్ విధానాలు, ప్రత్యామ్నాయం అని చెప్పబడుతున్న సాంకేతిక విజ్ఞానాల అభివృద్ధి (సౌరశక్తి, వాయుశక్తి, భూగర్భ ఉష్ణశక్తి, అణుశక్తి వంటివి) వ్యక్తిగత ప్రయత్నాల ప్రోత్సాహం (మెరుగైన బల్బులు, హైబ్రిడ్ కార్లు, సౌర ప్యానెల్‌ల వినియోగం, బల్బులు, ఇతర ఉపకరణాల వినియోగం వంటి వాటిని తగ్గించుకోవడం వంటివి.)

ఇటువంటి ప్రతిపాదనలు, వ్యక్తిగత చర్యలు ఆశించదగినవే, వ్యక్తిగత ఆరోగ్యానికీ, బడ్జెట్‌కీ మంచివే. అయితే సంక్షోభానికి కారణమైన ప్రక్రియలను ఎదుర్కోటానికి గాని, సమస్యలను కూకటివేళ్లతో పెకిలించ టానికిగాని ఇవి దోహదపడతాయా అన్నది ముఖ్యమైన ప్రశ్న.

మానవ చర్యల వల్ల ప్రకృతి ప్రభావితం అవుతూనే ఉంది. వ్యవసాయం కోసం అడవులను నిర్మూలించినప్పుడు, ఆస్ట్రేలియాలో ఆదిమవాసులు కంగారూల (వాటిని తిరిగి వేటాడతారు) మేత కోసం అడవులు తగలపెట్టినప్పుడు ప్రకృతి ప్రభావితం అయ్యింది. అయితే వీటివల్ల కొన్నిసార్లు జీవావరణం విధ్వంసానికి గురయినప్పటికీ ప్రస్తుతం మనం ఎదుర్కొంటున్న పెను వాతావరణ సంక్షోభం దృష్ట్యా అవి పరిగణనలోకి తీసుకోదగినవిగా అనిపించవు.

ఏప్రిల్ 2009లో ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయంలో పర్యావరణ శాస్త్రజ్ఞులైన మైలెస్ అల్లెన్, పోట్స్‌డం ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ క్లైమేట్ ఇంపాక్ట్ రిసెర్చ్ కి చెందిన మాల్టే మైన్‌హౌసెన్‌ల అంచనాల ప్రకారం బొగ్గుపులుసు వాయువుల విడుదలను ఒక ట్రిలియన్ టన్నులకు తగ్గించగలిగితే ప్రపంచ ఉష్ణోగ్రత పెరుగుదలను 2 డిగ్రీల సెంటిగ్రేడ్‌కు పరిమితం చెయ్యవచ్చు. మొదటి ఐదు వందల మిలియన్ టన్నుల బొగ్గుపులుసు వాయువు విడుదలకు ప్రపంచ ఆర్థిక వ్యవస్థ ఐదు వందల సంవత్సరాలు తీసుకోగా, రెండవ ఐదు వందల మిలియన్ టన్నుల విడుదల 2040 నాటికి పూర్తికావచ్చు. (న్యూ సైంటిస్ట్, ఏప్రిల్ 2009).

పారిశ్రామికీకరణకు ముందు ప్రజలు చేపట్టిన మనుగడ ఆర్థిక వ్యవస్థలు, బాగా ఆలోచించి ప్రణాళికాబద్ధంగా రూపొందించిన ఆర్థిక వ్యవస్థల స్థానంలో కార్పొరేట్, గుత్తాధిపత్య పెట్టుబడిదారీ విధానం ఉండటమే సమస్యకు మూలం.

చిన్న ఉత్పత్తిదారుడు – ఉదాహరణకి రైతు లేదా వృత్తి కళాకారుడు – ఉత్పత్తిని పరిమిత, సాధారణంగా స్థానిక వినియోగం కోసం చేపడతాడు. అలా వచ్చిన ఆదాయాన్ని ఇతర సరుకులు, లేదా సేవల కోసం – ఆహారం, బట్టలు, పెళ్లిళ్లు, వైద్య ఖర్చు, చదువు వంటి వాటి కోసం – వినియోగిస్తాడు. ఈ ప్రక్రియ సరుకుల ఉత్పత్తితో మొదలయ్యి, వాటి వినియోగంతో ముగుస్తుంది. మారకానికి సాధనంగా డబ్బు పనిచేస్తుంది. మార్కెట్ పరిమాణం, సాంకేతిక విజ్ఞానం, శ్రమ వంటివన్నీ ఈ ప్రక్రియను పరిమిత స్థాయిలో ఉంచటానికి దోహదం చేస్తాయి.

అయితే పెట్టుబడిదారీ విధానం తన అతిసాధారణ రూపంలో సైతం దీనికంటే పూర్తిగా భిన్నమయింది. పెట్టుబడిదారుడు లాభం కోసం అమ్మటానికి సరుకులను ఉత్పత్తి చేస్తాడు, లేదా సమీకరిస్తాడు. ఈ లాభాలను తిరిగి పెట్టుబడిగా పెట్టి మరింతగా ఉత్పత్తి పెంచుతాడు. లేదా సరుకులను కొంటాడు. ఈ విధంగా వ్యాపారాన్ని విస్తరింప చేసుకుంటాడు.

ఈ ప్రక్రియ డబ్బుతో మొదలవుతుంది. సరుకుల ఉత్పత్తి ద్వారా మానవ శ్రమతో పెట్టిన పెట్టుబడినీ, కొంత లాభాన్నీ పొందుతారు. గత పెట్టుబడుల నుంచి సమకూరిన అదనపు మొత్తాలను నిరంతరం తిరిగి పెట్టుబడిగా పెట్టడంపై ఎటువంటి పరిమితులూ లేవు. (అయితే ఈ పెట్టుబడులను కొత్త రంగంలోకి మళ్లించవచ్చు.)

పోటీ, ప్రత్యేకించి అతిపెద్ద గుత్తాధిపత్య కార్పొరేట్ బృందాల మధ్య పోటీ ఫలితంగా మనుగడ కోసం ప్రతి ఒక్కరూ ఎదుటవాళ్లు రంగంలో లేకుండా నిర్మూలించటానికి ప్రయత్నిస్తుంటారు. ఉత్పత్తి, సరుకులను త్వరితంగా అమ్మివెయ్యడానికి ప్రయత్నాలు నిరంతరం వేగం పుంజుకుంటూ ఉంటాయి. ఇది చివరికి వేగంగా తిరుగుతున్న రంగుల రాట్నం మాదిరి అవుతుంది. కాలానుగత మాంద్యం వల్లనో, మహా ఆర్థిక సంక్షోభం వల్లనో, యుద్ధం వల్లనో తప్పించి ఈ చక్రభ్రమణం ఆగదు.

వ్యక్తిగత పెట్టుబడిదారుల కోర్కెలతో సంబంధం లేకుండా పెట్టుబడిదారీ విధానం ఉద్దేశం పర్యావరణ, సామాజిక పర్యవసానాలతో సంబంధం లేకుండా అనంతంగా సంపదను సమీకరించుకుంటూ పోవటమే. లాభం లాభమే – అది ప్రాణాలను కాపాడే మందుల ద్వారా రావచ్చు, లేదా తాగుడుని, మితిమీరి తినటాన్ని ప్రోత్సహించటం ద్వారా రావచ్చు.


**వచ్చే సంచికలలో...**

- **ఫోకస్ - జూలై 2009 : మన పాఠశాల విద్యారంగం**
- **ఫోకస్ - ఆగస్ట్ 2009 : సింగరేణి బొగ్గు గనులు - నిన్నా, నేడూ, రేపూ**
- **ప్రపంచ బ్యాంక్ అభివృద్ధి నివేదిక పై సమీక్ష - ముదునూరి భారతి**
- **ఆకలి చావులు - అసలు కారణాలు - రమా ఎస్. మెల్కోటే**
- **కార్ల్‌మార్క్స్ పెట్టుబడి ఎలా చదవాలి? - లూయీ ఆల్థూజర్**

ఈ కారణం వల్లనే వినియోగాన్ని తగ్గించటానికి చేసే వ్యక్తిగత ప్రయత్నాలు వాటంతటవి సమాజం మొత్తం మీద బొగ్గుపులుసు వాయువు విడుదల తగ్గటానికి దారి తియ్యవు. వ్యక్తిగత చర్యలు – సామాజిక ఉత్పత్తికీ మధ్య, వినియోగమూ – వాణిజ్య నిర్వహణకీ మధ్య ఈ తేడాను వివరిస్తూ జీవావరణ శాస్త్రవేత్త జాన్ బెల్లామి ఫాస్టర్ (కల్చరల్ లాజిక్, సంపుటి 3, ఫాల్ 1999) పెట్టుబడిదారీ ఉత్పత్తిలోని ఆరు అంశాలను పేర్కొన్నాడు: 1) సమాజంలో అతి కొద్దిమంది సంపన్నుల చేతులలో సంపద మరింతగా పోగుబడతాయి; 2) స్వయం ఉపాధి నుంచి కార్మికులు కూలీకి పని చెయ్యడం వైపు ఎక్కువగా మళ్లింపబడి, వీరు ఉత్పత్తి విస్తరించడంపై ఆధారపడి ఉంటారు; 3) కార్పొరేషన్ల మధ్య పోటీ ఫలితంగా ఉత్పత్తిని విస్తరింపజేసే సాంకేతిక విజ్ఞానంపై పెట్టుబడులకు దారితీస్తుంది; 4) ప్రజలు నిరంతరం ఇంకా, ఇంకా కొనేలా చెయ్యటానికి 'కోరిక'లను తయారు చేస్తారు; 5) ప్రభుత్వాలు 'జాతీయ ఆర్థిక అభివృద్ధి'ని ప్రోత్సహించటానికి మరింతగా కట్టుబడి ఉంచాయి; 6) ప్రధాన ప్రసార సాధనాలు, విద్యా విధానం ఈ యంత్రంలో సమగ్ర భాగంగా ఉంటూ దాని విలువలను ప్రాధాన్యతలను బలోపేతం చేస్తాయి.

'కోరిక'లను తయారు చెయ్యటం అన్న ఒక్క అంశాన్నే తీసుకుంటే ప్రపంచవ్యాప్తంగా ప్రజల మెదడులను – ప్రత్యేకించి పిల్లలు, యువతను ప్రభావితం చెయ్యటానికి ప్రకటనలపై 29,800 కోట్ల డాలర్ల ఖర్చు పెట్టారు. ఆనందం, విజయం, అందం, గుర్తింపు వంటివి పొందాలంటే నిరంతరం కొంటూ ఉండాలి. ప్రస్తుత ఫ్యాషన్ ధోరణులు, మోడల్‌కి అనుగుణంగా ఉండాలని ఈ ప్రకటనలు గుప్పిస్తూ ఉంటాయి. వినియోగదారీ చెత్తను కొనాలన్న కోరిక వీటితోపాటు పుడుతుంది.

ఏదో ఒక కోలా పానీయాల గుణగణాలను అమితాబ్ బచ్చన్ ఒక వైపున పొగుడుతుంటే వాటి పర్యావరణ ప్రభావం ఎలా ఉంటుందో చూద్దాం. పంచదార, కెఫైన్, ఫాస్ఫారిక్ ఆమ్లం, కృత్రిమ రుచుల మిశ్రమాల ప్రభావం ఆరోగ్యంపై ఎలా ఉంటుందనేది వేరే పెద్ద కథే అవుతుంది. ఖర్చులు తగ్గించి, లాభాల శాతం పెంచుకోటానికి కార్పొరేషన్లు తిరిగి ఉపయోగించే గాజు సీసాలను వదిలేసి ప్లాస్టిక్ సీసాలను, మెటల్ క్యాన్‌లను వాడుతున్నాయి. వీటివల్ల వారికి రవాణా, నిల్వ వంటివి తేలికగా అవుతాయి. యంత్రాల సహాయంతో తేలికగా అమ్మవచ్చు కూడా.

తగరం, లేదా అల్యూమినియం క్యాన్‌లకు కావలసిన ముడి సరుకు ఒరిస్సాలోని గిరిజన సమాజాలను, అడవులను నిర్మూలించటం ద్వారా లేదా బొలీవియాలో అర్ధబానిసలు చేపట్టే గనుల తవ్వకాల ద్వారా పొందుతారు. అత్యంత కాలుష్య కారకాలైన కర్మాగారాలలో మూడవ ప్రపంచ దేశాలలో ఈ క్యాన్‌లను ఉత్పత్తి చేస్తారు. అక్కడి నుంచి ఇవి ప్రపంచవ్యాప్తంగా రవాణా చెయ్యబడి దుకాణాలలో సగటున రెండు వారాలు గడుపుతాయి. ఒక్కసారి ఉపయోగించి వీటిని పారేస్తారు. చివరికి చెత్తతోపాటు నేలలో పాతిపెట్టబడినప్పుడు ఇవి నేలను, నీటిని కలుషితం చేస్తాయి. పర్యావరణం రీత్యా ఇదంతా ప్రమాదకరమైనది. కానీ కార్పొరేట్ సంస్థలకు లాభాలను దండిగా సమకూరుస్తుంది.

సమస్య అసలు మూలాలను తాకని పర్యావరణానికి హాని చెయ్యని సాంకేతిక విజ్ఞానాలు, ప్రచారోద్యమాల డొల్లతనం ఇక్కడ బయట పడుతుంది. ఇద్దరు పిల్లలు ఒక పెద్ద మనిషి కానట్లు, పెట్టుబడిదారీ విధానంలో వ్యక్తుల మంచితనం దానంతట అది సామాజిక సంక్షేమ రూపాన్ని తీసుకోదు.

పైగా ఇంధన వనరులను పొదుపుగా వాడే చర్యల ఫలితంగా ఆ వనరుని వ్యాపారం కోసం వాడటానికి ప్రోత్సహించే పరిస్థితులకు దారితియ్యవచ్చు. ఈ అంశాన్ని 19వ శతాబ్దానికి చెందిన బ్రిటిష్ గణాంక శాస్త్రజ్ఞుడు, ఆర్థికవేత్త అయిన డబ్ల్యు.ఎస్. ఎవాన్స్ 'ది కోల్ క్వశ్చన్' అన్న తన పుస్తకంలో పేర్కొన్నాడు.

ఒక వనరుని ఒక ఆర్థిక రంగంలో ఉదాహరణకి ఇళ్లల్లో సమర్థంగా వినియోగించుకునే సాంకేతిక విజ్ఞాన ఫలితంగా దాని ధర తగ్గి ఇతర రంగాలతో దాని వాడకానికి గిరాకి పెరుగుతుంది. అంటే ఒక రంగంలో పడిపోయిన వాడకాన్ని ఇంకో రంగంలో పెరిగిన వాడకం పూడుస్తుంది. అన్ని సామాజిక సూత్రాల లాగే ఇది కూడా ప్రకృతి సిద్ధాంతంగా కాక ఒక గణాంక సిద్ధాంత రూపం తీసుకుంటుంది.

తన పుస్తకం చివరలో ఎవాన్స్ ఇలా అంటున్నారు: 'కొత్తగా కనుగొన్న ఒక అంశం, ఒక కళే (అంటే ఒక నైపుణ్యం, ఒక పద్ధతి) ఒక వాణిజ్య అభివృద్ధి, సమాజంలో ఒక సమస్త పరిష్కారం కార్యాకారణంలా మరొకదానిని అనుసరిస్తాయి. మనకి మేలు చేసే ప్రభావం మన సంకుచిత విజ్ఞతకి, స్వార్థపూరిత కోరికలకు పరిమితం కాకుండా ఉండడం మంచిదే. మన జ్ఞానాన్ని, మన దూరదృష్టిని సాధ్యమైనంతగా విస్తరింప చేసుకుందాం. కాని చివరికి మన చర్యలు మనం చేతనంగా గుర్తించని లక్ష్యాల దిశగా, గుర్తించని శక్తుల అధీనంలో ఉంటాయి.

సమాజాన్ని నడిపే శక్తుల గురించి మనం ఎంతో మూల్యం చెల్లించి ఎంతో తెలుసుకున్నాం. సంఘవ్యతిరేక పోటీతత్వాన్ని, సంపదలు పోగు చేసుకోవటాన్ని ప్రస్తుత శక్తులు ఆరాధిస్తున్నాయి. మన అంతిమ శత్రువు ఒక వ్యక్తో, బృందమో కాదని, చారిత్రకంగా రూపొందిన సామాజిక, ఆర్థిక వ్యవస్థ అని గుర్తిస్తూ, రానున్న కొద్ది కాలంలో పెట్టుబడి దారీ విధానమా? మానవ మనుగడా అనేది తేల్చుకోవాల్సి ఉంటుంది.

(తెలుగు అనువాదం : కె. సురేష్) వీ

**వీక్షణంకు ఉత్తరాలు రాసేవాళ్లు, మనీఆర్డర్లు పంపేవాళ్లు తమ వివరాలను పూర్తిగా రాయవలసిందిగా కోరుతున్నాం. అలాంటి వివరాలు లేనందువల్ల ఉత్తరాలకు జవాబు రాయడంగాని, మనీ ఆర్డర్ల మేరకు పుస్తకాలు, పత్రికలు పంపడం గాని వీలు కావడం లేదు.**

**- వై. రామచంద్రం (సర్క్యులేషన్ మేనేజర్) 9949 391028**

Email : yatelliram@gmail.com

*సామాజిక మార్పులను అర్థం చేసుకోవడంలో మార్క్సిస్టు చారిత్రక భౌతికవాద దృక్పథం ఎలా మార్గదర్శకంగా ఉంటుందో వివరిస్తున్నారు* **కృష్ణా భరద్వాజ్**

# సామాజిక మార్పును విశ్లేషించడం ఎలా?

*(...గత సంచిక తరువాయి)*

## చైతన్యం రూపొందించడంలో ఒక అంశంగా ఉపరితలం

మతం, కులం, నైతిక అభిప్రాయాలు, విశ్వాసాలు, ఉద్వేగాలు – ఒక్క మాటలో చెప్పాలంటే భావజాల ప్రపంచం అంతా ఉట్టి మూఢనమ్మకమనీ దానివల్ల పరిణామాలేవి ఉండవనీ భావించే 'హేతువాద' దృక్పథాన్ని తీసుకోవడం చాలా పొరపాటు. మనిషి చైతన్యం ఏ విధంగా రూపొందినప్పటికీ, అతని సామాజిక ప్రవర్తనలోనూ, ఆచరణ లోనూ ముఖ్యమైన పాత్ర వహిస్తుంది. ప్రత్యేకించి ఈ భావజాల అంశాలు వర్గసంబంధాలను అదుపు చేసే చైతన్యపూరిత సాధనాలు అయినప్పుడు లేదా, వర్గపోరాట అభివృద్ధికి చోదక శక్తిని అందజేసేటప్పుడు చైతన్యం ముఖ్యమైనదవుతుంది. పెట్టుబడిదారీ వర్గం తన నియంత్రణను కొనసాగించడానికి, వర్గఅంతరాలను, ప్రయోజనాలను పరిరక్షించు కోవడానికి విద్యను చాలా నేర్పుగా వాడుకుంది. అంతేకాదు, తమ ఆధిపత్య స్థానాన్ని దోపిడీకి గురౌతున్న వర్గాలు కూడా అంగీకరించేలా చేయడానికి ఆధిపత్య వర్గాలు విద్యను వాడుకుంటాయి. అందువల్లనే తిరుగుబాటుగా వచ్చిన మత ఉద్యమాలన్నీ (ఉదాహరణకు, భారతదేశంలో భక్తి ఉద్యమమైనా, యూరప్‌లో లూథరన్ తిరుగుబాటు అయినా) ఉన్నత వర్గాల ప్రామాణిక భాషగా తయారైన సంస్కృతాన్ని, లాటిన్‌ను వాడడం మీద తమ దాడిని ఎక్కుపెట్టాయి. ఎందుకంటే ఆ భాషలనే మతగ్రంథాలలో వాడారు. సాధారణ ప్రజానీకానికి అవి అంతుపట్టని భాషలైపోయాయి.

మనిషి తన పరిసరాలను మార్చుకోవడంలోనో, తనను తాను మార్చుకోవడంలోనో చైతన్యం ఎటువంటి పాత్ర వహిస్తుందో, వర్గ పోరాటాన్ని కొనసాగించడంలో చైతన్యం ఎంత గణనీయమైన పాత్ర వహిస్తుందో గుర్తిస్తే చైతన్యపు అభివృద్ధి చాలా ముఖ్యమైనదని స్పష్టమౌతుంది. సామాజిక మార్పు గురించిన చారిత్రక అవగాహనలో ఈ చైతన్యం పాత్ర చాలా కీలకమైన అంశం. చైతన్యం అనేది పూర్తిగానూ, ఏకపక్షంగానూ ఉత్పత్తి సంబంధాల మీద ఆధారపడి ఉంటుందని భావిస్తే అది చారిత్రక భౌతికవాదానికి యాంత్రికమైన అర్థం చెప్పడమే అవుతుంది. చైతన్యానికీ ఉత్పత్తి సంబంధాలకూ ఉన్న సంబంధం ప్రధానంగా పరస్పర చర్యా, ప్రతిచర్యలతో కూడినది. అది క్రమక్రమంగా మారుతూ వస్తోంది.

## చరిత్రలో వ్యక్తుల పాత్ర

ఉత్పత్తి సంబంధాలే మార్పుకు ప్రాథమిక చోదకశక్తి అని నొక్కి చెప్పడం వల్ల ఒకరకమైన నియతివాదం ప్రవేశించి వ్యక్తుల పాత్రను చెరిపివేయడానికి దారితీస్తుందా అని ఒక ప్రశ్న తరచుగా తలెత్తుతుంది. సాధారణ చరిత్ర పాఠ్య పుస్తకాలు చదివితే ఎవరికైనా కలిగే అభిప్రాయమేమంటే చరిత్రలోని ముఖ్యమైన ఘటనలన్నీ అసాధారణ శక్తి సామర్థ్యాలు కలిగిన వీరులో, నాయకులో, ప్రతినాయకులో సాధించినవేనని. అలెగ్జాండరుకు ఉండిన అపరిమితమైన ప్రపంచాన్ని జయించాలనే ఆకాంక్ష; శివాజీకి ఉండిన సైనిక, రాజకీయ చతుర, హిట్లర్ కు ఉండిన దురహంకారం, రాస్పుతీన్‌కు ఉండిన దుర్లక్షణాలు వంటి వాటినే చరిత్రలో రాస్తూ ఉంటారు. ఒక్కమాటలో చెప్పాలంటే ఇ.ఎచ్. కార్ అభివర్ణించినట్టు ఇది చెడ్డ రాజు జాన్ మంచి రాణి బెస్ సిద్ధాంతం. చరిత్రలో అపూర్వమైన స్త్రీ పురుష ఉదాహరణలు నిండి ఉన్నాయనడంలో సందేహం లేదు. అయితే వారు తమ కాలం విధించిన పరిమితుల లోపల మాత్రమే పనిచేసారు. వారి గుణాలైనా, దోషాలైనా వారిని ఆకాశానికెత్తినా, అణగదొక్కినా అందుకు కారణమైనవి ఆనాటి సమాజంలో నైతిక దృక్కోణంలో కొనసాగుతుండిన ప్రమాణాల ఆధారంగా వెలువడిన తీర్పులు మాత్రమే. వారిని ఆ యుగం తలకెత్తుకున్నదన్నా, తిరస్కరించిందన్నా అది ఆ కాలపు రాజకీయ చైతన్యానికి ప్రతిఫలం మాత్రమే. వారి విజయమైనా, అపజయమైనా వారు తమ లక్ష్యాల దిశగా తమ చుట్టూ ఉన్న మనుషుల చైతన్యాన్ని భౌతిక శక్తులను మరల్చగలిగారన్న దానిమీదనే ఆధారపడి ఉంది. వారి సైనిక విజయం వారి సైనిక శక్తి ఆధిక్యత మీద, ఆ కాలపు రాజకీయ ఆవశ్యకతల గురించి వారి అవగాహన మీద ఆధారపడి ఉంది. అదే విధంగా మేధో ప్రపంచపు ఉదాహరణ చూస్తే ఒక న్యూటనో, ఒక ఐన్‌స్టీనో ఆవిర్భవించడానికి కారణాన్ని ఆ కాలానికి అభివృద్ధి చెంది ఉన్న జ్ఞాన సంపదతో సంబంధం లేకుండా అర్థం చేసుకోలేం. ఆ కాలపు జ్ఞాన సంపద అంటే కూడా అది మౌలికంగా అప్పటివరకూ మనుషులు సాధించిన ఆచరణాత్మక కార్యకలాపాల, అనుభవాల స్థాయి మీద మాత్రమే ఆధారపడి ఉంటుంది. అలాగే ఆ శాస్త్రవేత్తలకు పరిశోధన చేయడానికి తమ కాలపు భౌతిక వనరులు ఎంత వరకు అందుబాటులో ఉన్నాయనేది కూడా ముఖ్యమే. అంతేకాదు, విజ్ఞాన శాస్త్రంలో ఏ దృక్పథానికి సాధారణ ఆమోదయోగ్యత వస్తుందనేది కూడా ఆనాటికి

అభివృద్ధి చెందిన ఉత్పత్తి శక్తుల స్థితిపైనా, ఆనాటికి ప్రాబల్యంలో ఉన్న భావజాలం పైనా ఆధారపడి ఉంటుంది. చరిత్రక్రమంలో ఎంతోమంది మౌలిక ఆలోచనాపరులను తమ కాలానికంటే చాలా ముందుకు చూసిన సాహసం చేసినందుకు దైవదూషణ చేసారనే పేరుతో హింసించడం జరిగింది. బ్రూనో, గెలిలియో లాంటివారిని భౌతికంగా నిర్మూలించారు. మరికొన్ని సాధుసమాజాలలో కాలాన్ని అధిగమించిన భావాలను మౌనంతోనో, వేళాకోళంతోనో చంపేశారు. రాజకీయార్థశాస్త్ర చరిత్రలో ఇది స్పష్టంగా కనబడుతుంది. ఉపాంత ప్రయోజనం అనే భావనలను 19వ శతాబ్దం తొలిరోజుల్లో 1820 నుంచి 1850 మధ్య మొదటిసారి ప్రతిపాదించిన గాసెన్, డుపుయిట్ వంటి వారిని విస్మరించడమో, గేలి చేయడమో జరిగింది. అవే భావాలను 1870ల తరవాత చాలా గంభీరమైనవిగా, మౌలికమైనవిగా, రాజకీయార్థశాస్త్రాన్ని సరిగ్గా అర్థం చేసుకునేవిగా ప్రతిపాదించడం జరిగింది. అంటే, నిస్సందేహంగా వ్యక్తులు గొప్ప పాత్ర నిర్వహిస్తారు. కాని, చరిత్ర నిర్దేశించిన పరిస్థితుల లోపలే వాళ్లు పనిచేస్తారు. 'మనుషులు తమ చరిత్ర తామే నిర్మిస్తారు. కాని, వారు కూడా ఆ పనిని తమ ఇష్టారాజ్యంగా చేయజాలరు. గతం నుంచి కొనసాగుతూ, తమదాకా ప్రవహించి, తాము నేరుగా ఎదుర్కొనే పరిస్థితుల లోపల మాత్రమే మనుషులు చరిత్రను నిర్మించగలరు' అన్నాడు మార్క్స్. అంటే, అసాధారణ ప్రజ్ఞావంతులైన వ్యక్తులు కూడా చరిత్ర క్రమంలో ఒక ఘటనే.

## సామాజిక మార్పు స్వభావం

సామాజిక సంబంధాల చరిత్రను పరిశీలిస్తున్నప్పుడు మార్పు స్వభావం గురించి ఏం చెప్పగలం? సామాజిక శాస్త్రవేత్తలలో వారు అనుసరించే సంవిధాన దృక్కోణాలను బట్టి ఈ మార్పు స్వభావం ఏమిటనేది కూడా విభిన్నంగా ఉంటుంది. న్యూటన్ భావాల వ్యాప్తి పెద్ద ఎత్తున సాగుతున్నప్పుడు అంటే, విశ్వాన్ని నిర్దేశించే యాంత్రిక సూత్రమే అన్ని దృగ్గోచర అంశాలకు, మానవ అంశాలకు, మానవేతర అంశాలకు కూడా వర్తిస్తుందనే భావం ఉన్నప్పుడు సామాజిక సంబంధాలను నిర్దేశించే ఏదో ఒక సూత్రం ఉందనే నమ్మకం ఉండేది. ఆ సూత్రం సహజమైన ధర్మమనీ, ఆడమ్ స్మిత్ ఊహించినట్టుగా విశ్వ సృష్టికర్త దాన్ని లిఖించారనీ, ఆ ధర్మం ఒక సమన్వయపూరిత సమతుల్య స్థితివైపు పయనిస్తున్నదని నమ్మకం ఉండేది. ఆ వ్యవస్థలో ఏవైనా మార్పులు రావాలంటే అవి బయటి నుంచి వచ్చే కల్లోలాల రూపంలో ఉండవలసిందే. నిశ్చల స్థితిలో ఉన్న ఒక వస్తువు మీద బయటి నుంచి బలప్రయోగం జరిగినట్టుగా ఉండవలసిందే. ఆ వ్యవస్థ ఒక క్రమబద్ధమైన పరిణామాత్మకమైన పునరావాసాల ద్వారా మాత్రమే మార్పును గ్రహించగలుగుతుంది. ఈ దృక్పథం గురించి నేను తరవాతి ఉపన్యాసంలో వివరంగా చెపుతాను. కాని, ఇక్కడ గుర్తించవలసిందేమంటే ఈ దృక్పథం మార్పులను ప్రాథమికంగా పరిమాణంలో జరిగే స్థాన చలనాలుగా మాత్రమే చూస్తుంది. మార్పులకు కారణాలను బాహ్య శక్తులలో మాత్రమే వెతుకుతుంది. దీనికి భిన్నంగా పరిణామవాద సిద్ధాంతం మొత్తం సామాజిక వ్యవస్థను ఒక ప్రాణస్పందన ఉన్న జీవిగా పరిగణిస్తుంది. దాని దృష్టిలో మార్పులంటే పరిణామక్రమంలో గ్రహించే పరివర్తనలు మాత్రమే. ఈ పరిణామవాద సిద్ధాంతాన్ని దాని అంచులదాకా తీసుకువెళ్లిన స్పెన్సర్ ఆలోచనా ధోరణి సమాజం మొత్తాన్ని ఒక శరీరంగా చూసి దానిలో ఏయే భాగం ఏయే అవయవంతో సరిపోలుతుందో కూడా వివరించింది. ఈ సిద్ధాంతం కొనసాగుతున్న వ్యవస్థను సమర్థించడానికే ఉపయోగపడింది. వేరు వేరు అవయవాలకు వేరు వేరు పనులు అనే పునాది మీద ఒక వ్యవస్థలో అంతరాలు ఉండడాన్ని సమర్థించింది. సమాజ శరీర ధర్మ శాస్త్రాన్ని అధ్యయనం చేసినట్టుగా అందులో నాడీ కేంద్రాలు ఏమిటనీ, మెదడు ఏదనీ, ఏ అవయవం ఏదనీ అన్వేషించింది. ఇటువంటి విద్యుక్త ధర్మాల సిద్ధాంతానికి దాదాపు సమానంగా సమాంతరంగా వచ్చినది హిందూ ధర్మ శాస్త్ర నమ్మకం. బ్రహ్మ ఒక మహా పురుషుడనీ, అతని శరీరంలోని వేరు వేరు భాగాలనుంచి వేరు వేరు కులాలు పుట్టుకువచ్చాయనీ ఆ సిద్ధాంతం చెప్పింది. అందువల్ల అనివార్యంగా బ్రాహ్మణులు ఆ మహాపురుషుడి ముఖం నుంచి పుట్టుకువచ్చారు. కింది కులాల వారు అతని పాదాల నుంచే పుట్టుకురావల్సివచ్చింది. ప్రతి అవయవానికి దాని ధర్మం నిర్ణయమైపోయింది. మొత్తం రాజ్యం శరీరమై అందులో అన్ని అవయవాలకూ అంతరాల వ్యవస్థలో స్థానాలు నిర్ణయమైపోయాయి. పరిణామ సిద్ధాంత వాదులు మార్పులనేవి క్రమానుగతంగా జరిగే పరివర్తనలు అని చెప్పడం ద్వారా అన్ని మార్పులూ మెల్లమెల్లగా జరుగుతాయని అంటు యథాస్థితిని సమర్థించేవారయిపోయారు. మార్పులనేవి స్వాభావికంగానే చిన్న చిన్నవిగా ఉండాలని, అవి సవరణల ద్వారా జరగాలి గాని విప్లవాత్మకంగా జరగకూడదని అన్నారు.

అయితే నిజంగా గడిచిన సామాజిక చరిత్ర లోలోపలే జరిగిన పరిణామంలో మాత్రమే జరిగిన సవరణలకు మాత్రమే పరిమితమైనది కాదు. పరిమాణాత్మక విస్తరణలూ ఉన్నాయనడంలో ఏ సందేహమూ లేదు. కాని, మొత్తంగా సామాజిక అస్తిత్వ పద్ధతినే గుణాత్మకంగా మార్చివేసిన ఆకస్మిక గంతులు కూడా ఉన్నాయి. ఈ సంగతిని గుర్తించడం వల్లనే కావచ్చు కొందరు సామాజిక చింతనాపరులు సామాజిక చరిత్రను కొన్ని యుగాలుగా, తరాలుగా, దశలుగా వర్గీకరించారు. ఈ గుణాత్మక మార్పులే కొత్త తరహా సామాజిక సంబంధాలకు కారణమయ్యాయి. అటువంటి ఒక్కొక్క దశ రావడాన్ని మార్క్స్ ఒక కొత్త ఉత్పత్తి విధానం ప్రాబల్యంలోకి రావడమై దానితోపాటు గుర్తించదగిన ఉత్పత్తి సంబంధాలు ఉనికిలోకి రావడమని అన్నాడు. ఇలా రూపొందిన ప్రతి ఒక్క ఉత్పత్తి విధానాన్ని విశ్లేషించాలంటే దానికే సరిపోయే విశ్లేషణా పరికరాలను, భావనలను తయారు చేసుకోవలసి ఉంటుంది. స్వేచ్ఛాయుతమైన వేతన శ్రమ, ఒక ప్రత్యేక వర్గానికి ఆదాయంగా వచ్చే అదనపు విలువకు నిర్దిష్ట రూపంగా లాభాలు, సమాన మారకం వంటి భావనలన్నీ పెట్టుబడిదారీ ఉత్పత్తి సర్వవ్యాపితమైనప్పుడు మాత్రమే పనికివస్తాయి. అలాగే భూస్వామ్య దశలో శ్రమ కౌలు, వ్యక్తిగత సౌఖ్యాలు, నజరానాలు, వెట్టి శ్రమ వంటి భావనలు పనికివస్తాయి.

అయితే చరిత్ర క్రమంలో ఈ గుణాత్మక గెంతులు జరిగినప్పుడు తలెత్తే ప్రశ్న ఏమంటే, ఈ గెంతులకు కారణం బాహ్యశక్తులా, లేక సామాజిక సంబంధాల లోపల సాగే అంతర తర్కం వల్ల ఈ మార్పులు రూపొందాయా. ఉత్పత్తి శక్తుల అవసరాలకు అనుగుణంగా ఉత్పత్తి సంబంధాలలో సవరణలు జరుగుతాయని, ఆ సవరణలు తక్షణంగానో,

సాఫీగానో జరగవని మనం ఇదివరకే చూసి ఉన్నాం. అంతేకాదు, నిజానికి ఉత్పత్తి సంబంధాలు కాస్త మందకొడిగా సాగుతూ ఉత్పత్తి శక్తుల పురోగమనాన్ని అడ్డుకునే సంకెలగా కూడా మారవచ్చు. ఉదాహరణకు, తొలుత ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి సహాయపడిన భూస్వామ్య ఆస్తి సంబంధాలే పెట్టుబడిదారీ ఉత్పత్తి శక్తుల అభివృద్ధికి ఆటంకంగా పరిణమించి అంతిమంగా పెట్టుబడిదారీ ఉత్పత్తి సంబంధాల చేత తోసివేయబడ్డాయి. మరీ ముఖ్యంగా పురోగమిస్తున్న ఉత్పత్తి శక్తులు భిన్న వర్గాల మీద విభిన్నమైన ప్రభావాన్ని వేస్తాయి గనుక ఉత్పత్తి శక్తులకూ, ఉత్పత్తి సంబంధాలకూ మధ్య వచ్చే ఘర్షణ వర్గ విభేదాలను పెంపొందించే రూపంలో వ్యక్తమవుతుంది. అప్పుడు ఆ ఘర్షణను పరిష్కరించడానికి ఉత్పత్తి సంబంధాలను సంపూర్ణంగా మార్చడమో, లేదా, ఉత్పత్తి శక్తులను తాత్కాలికంగా ఆటంకపర్చడమో అవసరమవుతుంది.

బ్రిటన్‌లో పెట్టుబడిదారీ విధానం అభివృద్ధి చరిత్రను చూస్తే ఈ పరిణామాలు ఎంత వేగవంతంగా జరిగాయో కనబడుతుంది. అవి కొన్నిసార్లు హింసాత్మకంగా ఉన్నాయి. కొన్నిసార్లు దిగిపోబోతున్న వర్గాలు సమయానుకూలంగా లొంగిపోయాయి. కల్లోలాలు నిర్బంధ శిబిరాలు, కార్ఖానాల చట్టం, నిరుపేదల చట్టం వగైరా ఎన్నో రూపాలలో ఈ చరిత్ర కనబడుతుంది. ఈ వర్గాల మధ్య ఘర్షణ అనేక బహిరంగ ప్రచ్ఛన్న రూపాలుకూడా ధరించవచ్చు. ఒకసారి అది మతఘర్షణల రూపంలో కనబడుతుంది, మరోసారి రాజకీయ ఘర్షణగా కనబడుతుంది. ఇంకొకసారి సిద్ధాంత ఘర్షణగా కనబడుతుంది. ఇంకొకసారి ప్రజా ఉద్యమంగా కనబడుతుంది. ఉదాహరణకు, అప్పుడప్పుడే తలెత్తుతున్న పెట్టుబడిదారీ వర్గానికి మార్గం సుగమం చేయడం కొరకు వెలువడిన స్వేచ్ఛా వాణిజ్య నినాదం వ్యక్తి స్వేచ్ఛ, స్వావలంబన, ప్రజాస్వామిక హక్కులు వగైరా నైతిక సూత్రాల రూపం ధరించింది.

మరొకపక్క గుత్తపెట్టుబడిదారీ విధానం శాస్త్ర విజ్ఞాన ఆరాధన, అత్యుత్తన్నత స్థాయి ఉత్పాదకత, సంకేతిక నిపుణుల ఆధిపత్యం వంటి ధోరణులను సమర్థించింది. ఆయా వర్గాలు ఏ సైద్ధాంతిక ఆయుధాలను చేతపట్టి యుద్ధాలు సాగించినప్పటికీ (అయితే ఈ సైద్ధాంతిక ఆయుధాలను వాడడం ఎంత సంక్లిష్టం, ఎంత అమూర్తం అయిపోయిందంటే నిజమైన సమస్యలు కనబడనంతటి కళాత్మక నైపుణ్యంతో ఈ ఆయుధాలను వాడుతుంటారు.) పాత ఉత్పత్తి సంబంధాలు కాలం చెల్లిన తరువాత రద్దయిపోక తప్పదు. వాటి స్థానంలోకి కొత్త ఉత్పత్తి సంబంధాలు రాక తప్పదు. అంటే, ఒక ఉత్పత్తి విధానం రద్దుకు బీజాలు దాని లోలోపలనే ఉంటాయని అర్థం.

ఒక ఉత్పత్తి విధానం ఎంత పురోగమన దిశలో ఉంటే దాని అంతర్గత వైరుధ్యాలు అంతగా పెంపొంది, అంతిమంగా అది ఒక గుణాత్మక మార్పుకు అవసరమైన దశకు చేరుతుంది. యుద్ధాలు, ఆర్థిక జోక్యం వంటి బాహ్య శక్తులు ఈ ధోరణులను త్వరితం చేయగలవు. లేదా, ఆటంకపరచగలవు. అంతే. బాహ్య శక్తులు ఎప్పుడైనా ఒక మార్పుకు తగిన పరిస్థితులను సృష్టించగలవే కాని, మార్పుకు అంతిమ మూలం మాత్రం అంతర్గత శక్తుల నుంచే లభిస్తుంది. 'తగిన ఉష్ణోగ్రత అందినప్పుడు గుడ్డు కోడి పిల్లగా మారుతుంది. కాని ఎంత ఉష్ణోగ్రతను అందించినా ఒక రాయిని కోడిపిల్లగా మార్చలేం. రాయిలో ఉన్న మూలం భిన్నమైనది' అన్నాడు మావో.

## చారిత్రక నియతిని గుడ్డిగా అనుసరిస్తున్నామా?

ఇటువంటి దృక్పథం తీసుకోవడమంటే చారిత్రకవాదం పట్ల గుడ్డి నమ్మకం కలిగి ఉండడమా? ఈ సమాజం ఎటువంటి పరిస్థితిలోనైనా అనివార్యంగా తప్పనిసరిగా విధి లిఖితం వంటి మార్గాన పయనిస్తుంది అని నమ్మడమా? అటువంటి వ్యాఖ్యానంలో అమాయకత్వం మాత్రమే కాదు ధూర్తత్వం కూడా కనబడుతుంది. అది మన చేతిలో ఏమీ లేదనే విధి నిర్ణాయక వాదానికి దారితీస్తుంది. భవిష్యత్తు అంతా అనివార్యంగా నిర్ణయమయిపోయి ఉంటే ఇక చైతన్యయుత మానవ ఆచరణకు అవకాశం గాని, ఆచరణ సాధ్యత గాని ఉంటుందా? అంతేకాదు, ఈ సిద్ధాంతం పలాయనవాదానికి కూడా దారితీస్తుంది. అనివార్యంగా ఏదో జరిగిపోతుందని అంగీకరించడం అంటే, మనిషి తనంతట తానే స్వేచ్ఛను వదులుకోవడమే.

ఇందుకు భిన్నంగా క్రమానుగత ఉత్పత్తి విధానాల ద్వారా చరిత్ర పురోగమించిందని, ఆ చరిత్రలో ఆదిమ, భూస్వామ్య, పెట్టుబడిదారీ, సోషలిస్ట్ దశలు ఉన్నాయని మార్క్స్ చేసిన విశ్లేషణ. ఈ దశల క్రమానికి ఒక అనివార్యతను ఆపాదించింది. ఈ పునాది మీద కొంతమంది విమర్శకులు మార్క్స్ చేసిన సామాజిక చరిత్ర పట్ల భౌతికవాద వ్యాఖ్యానాన్ని విమర్శించారు. కొన్ని సమాజాలు మధ్యంతర దశలను అధిగమించాయని, అందువల్ల ఆ సిద్ధాంతం చెల్లదని అన్నారు. మరోవైపు ఈ దశలన్నీ ఒకదాని తరవాత ఒకటి వస్తాయనే భావనను మొరటుగా ఉన్నది ఉన్నట్టుగా అర్థం చేసుకున్నారు. మరికొందరు విప్లవాత్మక చర్యలకు వ్యతిరేకంగా మితవాద వైఖరులు తీసుకున్నారు. ఈ రకమైన యాంత్రిక వ్యాఖ్యానం మానవ ఆచరణలో చైతన్యానికి గల పాత్ర గురించి విస్మరించింది. 'మనం అర్థం చేసుకోనంత వరకూ అనివార్యత అనేది గుడ్డిగానే ఉంటుంది' అని హెగెల్ చేసిన సూత్రీకరణను విస్మరించింది.

భౌతిక పరిస్థితులు నిర్దేశించే అనివార్యతను గురించి అవగాహన పెంచుకోవడం ద్వారానే వర్గ చైతన్యం, వర్గ పోరాటం తమ చలనశీల స్వభావాన్ని పొందుతాయి. అంతేకాదు, మనుషులకూ, ప్రకృతికీ, ఉత్పత్తి శక్తులకూ, ఉత్పత్తి సంబంధాలకూ, పునాదికీ, ఉపరితలానికీ ఉండే సంబంధాలు సర్వకాలానికి ఏ మార్పులూ లేకుండా స్థిరంగా ఉండేవి కావు. చరిత్ర క్రమంలో అవి కూడా మారుతూ వచ్చాయి. సమాజాల చరిత్రను, వర్తమానాన్ని సరిగ్గా అర్థం చేసుకోవడానికి ఉత్పత్తి సంబంధాలను, దానితో కలిసి ఉన్న వర్గాల పొందికను అర్థం చేసుకోవాల్సి ఉంటుందని భౌతికవాద గతితర్క దృక్పథం నొక్కిచెపుతుంది. అవి అర్థం చేసుకోవడం ద్వారా ఉత్పత్తి శక్తులలో వస్తున్న మార్పులేవో, అందువల్ల రాజ్యాంగ యంత్రంలోనూ, వర్గపోరాట రూపంలోనూ వస్తున్న మార్పులేవో అర్థం చేసుకోవాల్సి ఉంటుంది. వర్తమానాన్ని చరిత్రగా చూసే పునాది పైననే భవిష్యత్తును ఊహించడం సాధ్యమవుతుంది. వర్తమానం సృష్టిస్తున్న అవకాశాల పరిమితులలోనే భవిష్యత్తును రూపొందించడానికి వీలు కలుగుతుంది. 'మానవజాతి తాము పరిష్కరించగలిగిన కర్తవ్యాలను మాత్రమే తన ముందు పెట్టుకుంటుంది' అని మార్క్స్ అన్నాడు. వర్తమానపు సమస్యలన్నిటికీ మూలాలు చరిత్రలో

ఉన్నాయి. భవిష్యత్తులో అవి పరిణమించబోయే రూపాలకూ, వాటి పరిష్కారాల అవకాశాలకూ మూలాలు వర్తమానంలో ఉన్నాయి. సామాజిక తత్వవేత్తల కర్తవ్యం ఏమంటే, వర్తమానాన్ని అర్థం చేసుకోవడం మాత్రమే కాదు, ఆ అవగాహనను ఆచరణలో వినియోగించడం. అందుకే ఫ్యూయర్ బా మీద విమర్శలో మార్క్స్ 'ఇప్పటివరకూ తత్వవేత్తలందరూ ప్రపంచాన్ని విభిన్న పద్ధతులలో వ్యాఖ్యానించడం మాత్రమే చేశారు; కాని చేయవలసిన పని ప్రపంచాన్ని మార్చడం' అన్నాడు.

## సామాజిక పునర్నిర్మాణంలో జ్ఞానం వినియోగం

ఇక చివరి అంశానికి వస్తాను. సమాజాన్ని పునర్నిర్మించడంలో జ్ఞానాన్ని ఎలా వాడాలి? మొట్టమొదట కొన్ని మామూలు తప్పుడు అవగాహనలు తొలగించవలసి ఉంది. ఇప్పటిదాకా నేను చర్చించినదాన్ని బట్టి ఒక విషయం స్పష్టమై ఉంటుందనుకుంటాను. 'సమాజం' అంటే ఒకే రకమైన ప్రయోజనాలు గల కొందరు వ్యక్తుల సమూహం కాదు. అదేదో పిల్లల ఆటలో అటు పావులు ఇటూ, ఇటు పావులు అటూ జరిపి ఉన్న స్థితిలోనే కొత్త నమూనాలో నిర్మించడానికి వీలైన ఆట కాదు సమాజం. సమాజం, ప్రజలు వంటి సామూహిక పదాలన్ని ఒక కీలక వాస్తవాన్ని మరుగుపరుస్తాయి. ఆస్తి మీద ఆధారపడిన సమాజాలన్నీ అనివార్యంగా తప్పించుకోలేని విధంగా వర్గాలుగా విభజించబడి ఉన్నాయి. వాటికి సాధారణంగా పరస్పర వ్యతిరేక ప్రయోజనాలున్నాయి. పౌరచట్టంలో ప్రస్తుత ఆస్తి సంబంధాలను సాధారణ సమాజ సంకల్ప ఫలితంగా రూపొందాయని చెపుతుంటారు. చట్టంలోనే పెట్టుబడిదారీ వర్గం ఒక సాధారణ వ్యక్తీకరణ పొందుతుందంటారు. అంటే, మొత్తంగా ప్రజాసంకల్పం చట్టం రూపంలో, న్యాయవ్యవస్థ రూపంలో, అధికార యంత్రాంగం రూపంలో, రాజ్యాంగ యంత్ర రూపంలో వ్యక్తీకరణ పొందుతుందని చెబుతారు.

అందువల్ల సమాజ పునర్నిర్మాణం అంటే సమాజపు సాధారణ సంకల్ప వ్యవహారమనీ, ప్రజల అందరి కోరికల వ్యవహారమనీ, ప్రజల అందరి శ్రేయస్సు కొరకు జరుగుతుందని భ్రమలు కలుగుతాయి. కాని, ఇటువంటి సార్వత్రిక ఏకీభావం సంపాదించడం వర్గపునాదిగల సమాజాలలో అసాధ్యం. 'సరైన విద్య' అందించడం ద్వారా గాని, 'ఉదాత్త నైతిక ఆదర్శాలను' ప్రచారం చేయడం ద్వారా గాని ఘర్షణ పడుతున్న వర్గ ప్రయోజనాలను చల్లార్చడం సాధ్యం కాదు. ఒక సామాజిక దశలో సమాజం మీద ప్రాబల్యం వహించే భావాలు పాలకవర్గపు భావాలే అయి ఉంటాయి. రాజ్యాంగ యంత్రం అనేది ఆ పాలకవర్గాల రాజకీయ సాధనంగా ఉంటుంది. అంటే, రాజ్యాంగ యంత్రానికి వర్గస్వభావం ఉంటుంది. ఆ వర్గస్వభావం ఎంత సంక్లిష్టంగానైనా ఉండవచ్చు. రాజ్యాంగయంత్రపు విధానాలకు ఒక వర్గ స్వభావం ఉంటుంది. ఆ పాలక వర్గాలు తమ వ్యూహాత్మక తక్షణ అవసరాల కొరకు, మనుగడ కొరకు, విస్తరణ కొరకు ఆ విధానాలలో ఎన్ని రాజీలైనా చేసుకోవచ్చు. అలాగే సామాజిక పునర్నిర్మాణం గురించి ఆలోచించే ఏ ప్రణాళికకైనా తప్పని సరిగా వర్గ దృష్టి ఉంటుంది. దాని లక్ష్యాలలో కావచ్చు, అది అనుసరించే సాధనాలలో కావచ్చు, అది వ్యవహరించే పరిమితులలో కావచ్చు, అది అమలు చేసే విధానాలలో కావచ్చు, ఆ విధానాల వాస్తవ ఫలితాలలో కావచ్చు ఆ వర్గ దృష్టి తప్పనిసరిగా ఉంటుంది.

సామాజిక విధానానికి ఉండే ఈ వర్గ కోణాలను అర్థం చేసుకోవాలంటే మనం తప్పనిసరిగా సామాజిక సంబంధాలను ఉన్నవి ఉన్నట్టుగానూ, చారిత్రకంగా పరిణామం చెందుతూ వచ్చిన క్రమంలోనూ అర్థం చేసుకోవాలి. వర్గాల స్వభావాన్ని, వాటి మధ్య సంబంధాలను అర్థం చేసుకోవాలి. సమాజంలోని వైరుధ్యాలను అర్థం చేసుకోవాలి. వర్తమానంలో ప్రాబల్యం వహిస్తూ ఉన్న ప్రధాన వైరుధ్యాన్ని అర్థం చేసుకోవాలి. వైరుధ్యాలు వ్యక్తీకరణ పొందే రూపాలన్నిటినీ అర్థం చేసుకోవాలి. ఆ వైరుధ్యాలు అభివృద్ధి చెందగల అవకాశాల క్రమాన్ని అర్థం చేసుకోవాలి. రాజ్యాంగ యంత్రపు స్వభావాన్ని అర్థం చేసుకోవాలి. రాజ్య విధానపు సాధనాలను అర్థం చేసుకోవాలి. వర్గ పోరాటపు ప్రస్తుత స్థితినీ, రూపాన్నీ, భవిష్యత్తులో అది ధరించబోయే రూపాన్నీ అర్థం చేసుకోవాలి. భావజాలం మీద, చైతన్యం మీద ఉపరితల ప్రభావాన్ని, దాని పాత్రను, అది వర్గపోరాటాన్ని రూపొందించే తీరును అర్థం చేసుకోవాలి.

ఇవన్నీ అర్థం చేసుకోవాలంటే నిర్దిష్ట పరిస్థితుల పట్ల నిర్దిష్ట విశ్లేషణ అవసరమవుతుంది. ఆ పని ఈ ఉపన్యాసాల పరిధికి మించినది. నా సొంత అవగాహనకూ, సామర్థ్యానికీ మించినది. ఇక్కడ నేను చేసిన ప్రయత్నమల్లా విశ్లేషణా స్థాయిలో కీలకమైన విషయాలను ప్రస్తావించడం మాత్రమే.

*(యూనివర్సిటీ ఆఫ్ మైసూర్, ప్రసారాంగ ప్రచురించిన కృష్ణా భరద్వాజ్ ఉపన్యాసాల సంకలనం 'ఆన్ సమ్ ఇష్యూస్ ఆఫ్ మెథడ్ ఇన్ ది ఎనాలిసిస్ ఆఫ్ సోషల్ ఛేంజ్' లో మొదటి ఉపన్యాసానికి అనువాదం)*

*(ముగింపు)*





చదవండి! **కుల నిర్మూలన** చదివించండి!!

*దళితుల, పీడిత కులాల ప్రజల పోరాట వార్తలు, విశ్లేషణలకై చదవండి, చదివించండి !*
*కులనిర్మూలన కోసం మీవంతు కృషి చేయండి !!*

**చందా వివరాలు :**

| | |
|---|---|
| **విడిప్రతి** | **రు. 10** |
| **సంవత్సర చందా** | **రు. 40** |

చందాలు, రచనలు పంపవలసిన చిరునామ
**డి. ప్రభాకర్**
వర్కింగ్ ఎడిటర్, కులనిర్మూలన
ఓం విహార్ కాలనీ, ప్లాట్ నెం. 30, మేడిపల్లి,
ఘట్‌కేసర్, మండలం రంగారెడ్డి జిల్లా

*చరిత్రలోని పరిణామాలకు మానవాళితో సూటిగా ప్రమేయం లేని భౌతిక, భౌగోళిక అంశాల పాత్ర కూడా ఉందనీ, విజ్ఞాన శాస్త్రపరంగానూ చరిత్రను అర్థంచేసుకోవాల్సి ఉంటుదనీ అంటున్నారు* **డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# చిన్నా, పెద్ద హిమయుగాలు

**చూ**డటానికి ఎంత ప్రశాంతంగా అనిపిస్తున్నప్పటికీ భూమి పుట్టినప్పటినుంచీ ఎన్నో పరిణామాలకు లోనవుతూనే ఉంది. 12 వేల కిలోమీటర్లకు పైబడిన వ్యాసం కలిగిన భూమి అంతర్భాగంలో ఎన్నెన్నో బలమైన ప్రక్రియలు జరుగుతూనే ఉంటాయి. వాటి ప్రభావం అప్పుడప్పుడూ కొద్దిగా ఉపరితలం మీద కూడా కలుగుతూ ఉంటుంది. అలాగే అంతరిక్షం ద్వారా కూడా భూమి కొన్ని ప్రభావాలకు లోనవుతూ ఉంటుంది. మన కాళ్లకు ఎంత స్థిరంగా అనిపించినప్పటికీ భూమి పై పొర వదులుగా తొడుక్కున్న చొక్కావంటిదే. సూర్యచంద్రుల గురుత్వాకర్షణ కారణంగా అది నిరంతరంగా సాగుతూ, కుంచించుకుపోతూ ఉంటుంది. మరొకటేమిటంటే గిరగిరా తిరుగుతున్న బొంగరం నిటారుగా కాకుండా నెమ్మదిగా పక్కలకి ఊగుతున్న పద్ధతిలో భూభ్రమణంలోకూడా దీర్ఘకాలిక మార్పులు కలుగుతూ ఉంటాయి. ఇంతకన్నా సుదీర్ఘ వ్యవధిలో సూర్యుడి చలనంలోనే అతి నింపాదిగా తేడాలు ఏర్పడతాయి. వీటన్నిటివల్లా భూమి మీద పడుతున్న సూర్యరశ్మిలో హెచ్చుతగ్గులు కలుగుతూ ఉండడం సహజం. ఈ వ్యత్యాసాలని ఏ మనిషీ తన జీవితకాలంలో తెలుసుకోలేడు. వేల, లక్షల, కోట్ల సంవత్సరాల తరవాత గాని వీటిలో కొన్ని తెలియరావు. పుట్టినప్పటినుంచీ మనుగడ కొనసాగించడమే అంతంతమాత్రంగా ఉండే జీవాలన్నీ ఎప్పటికప్పుడు ఎదురయే వాతావరణ, పర్యావరణ పరిస్థితులకు తట్టుకునే ప్రయత్నాలు చేస్తూ ఉంటాయి. నమోదయిన సమాచారం ఉంటే తప్ప సగటు ఉష్ణోగ్రతలు ఇప్పటి పారిశ్రామికీకరణ వంటి వాటివల్ల క్రమంగా పెరుగుతున్నాయనిగాని, ఒకప్పటి హిమయుగాల కారణంగా తరుగుతూ ఉండేవనిగాని ఎవరికీ తెలియదు.

మొత్తం మీద భూమి ఉపరితలానికి పరిమితమై ఉండే జీవరాశిని చూస్తే అదేదో పెద్ద బండరాతికి పట్టిన పలచని పాచి పొరలాగా అనుకోవచ్చు. రాయి ఎన్ని రకాల ఆటుపోట్లకైనా తట్టుకోగలదు కాని దానితో పోలిస్తే అతి బలహీనంగా, సున్నితంగా అనిపించే జీవపదార్థం మాత్రం ఏ పాటి స్వల్ప మార్పులు కలిగినా తీవ్రమైన ప్రభావాలకు లోనవుతూ ఉంటుంది. మనుషుల వ్యవహారాలే తప్ప తక్కిన జీవపదార్థపు స్వభావాన్ని కూడా సరిగ్గా అర్థం చేసుకోలేని వేదాంతులు కొందరు, మనుషుల జీవితాలనూ, వారి కష్టనష్టాలనూ గురించి గొప్పగా ఊహించి ప్రకృతిలో వాటికి చాలా ప్రత్యేకస్థానం ఉన్నట్టుగా ప్రవచనాలూ, బోధలూ చేస్తూ ఉంటారు. కాలికి అడ్డొచ్చిన రాతిని తన్నిన మనిషి దానిమీద కాపరం ఉంటున్న బాక్టీరియా గురించి పట్టించుకోనట్టే భౌగోళిక, భౌతిక వైపరీత్యాలకు లోనవుతున్న భూగోళంమీద జీవరాశికి తప్పనిసరిగా కలిగే కష్టాలవల్ల ప్రకృతిలో భూగ్రహం స్థాయిలో లేశమైనా తేడా కలగదు. ఏ కారణం చేతయినా ప్రకృతి 'గట్టిగా తుమ్మితే' మనవని అయిపోయినట్టేనని గుర్తుంచుకోవాలి. ఆధునిక విజ్ఞానం ఇటువంటి ప్రమాదాలను అంచనా వెయ్యడానికీ, ముందుగా పసికట్టి కొన్ని నివారక చర్యలూ, జాగ్రత్తలూ తీసుకోవడానికీ ప్రయత్నిస్తూ ఉంటుంది. కొన్ని ఉత్పాతాలు మాత్రం మనకు అతీతమైనవిగా అనిపిస్తాయి. వాటిని తప్పించుకోవడం అసాధ్యమే. ఎటొచ్చీ ఈ కష్టాలు ఈనాటివి కావు. 'అజ్ఞానపు' యుగాల్లో వీటికి ఏనాడో బలి అయిపోయిన కోట్లాది 'మూగజీవాల్లో' మనుషులూ ఉన్నారని కొన్ని పరోక్ష ఆధారాల ద్వారా తెలుస్తోంది.

ఆఫ్రికాలో ఉద్భవించిన ఆధునిక మానవులు ఏయే యుగాల్లో ఎక్కడెక్కడికెళ్లి స్థిరపడ్డారో తెలుసుకునేందుకు జన్యుపరీక్షలు తోడ్పడుతున్నాయి. ప్రపంచ జనులందరిలోనూ దాదాపు ఒకేరకమైన జన్యువులున్నప్పటికీ ప్రాంతాలవారీగా వారిలో అధికసంఖ్యాకుల్లో కనబడే స్వల్ప వ్యత్యాసాలని గుర్తించడం వీలవుతోంది. కాని, ఆరు వందల కోట్లకు పైబడిన నేటి ప్రపంచ జనాభాలో ఇప్పటికీ అందరూ దాదాపుగా ఒకేలాంటి జన్యునిర్మాణం కలిగి ఉన్నారనే విషయం శాస్త్రవేత్తలకు ఆశ్చర్యం కలిగిస్తోంది. ఇందుకు కారణాలేమిటో వారు అన్వేషిస్తున్నారు. కాలక్రమేణా సహజంగా జరిగే మ్యుటేషన్ల వేగాన్ని బట్టి చూస్తే సుమారుగా లక్ష నుంచి యాభై వేల సంవత్సరాల క్రితం మధ్యకాలంలో ఈ వైవిధ్యంలో తగ్గుదల ఏర్పడినట్టుగా తెలుస్తోంది. ఆ కాలంలో ఇండోనేషియాలోని సుమత్రా దీవిలో మౌంట్ తోబా అనే అగ్నిపర్వతం బద్దలయింది. దానివల్ల ఎనిమిది వందల ఘనకిలోమీటర్ల పరిమాణం కలిగిన భస్మం పైకెగిసింది. ఇంత పెద్ద పేలుడు గత నలభై కోట్ల సంవత్సరాలుగా జరగలేదు. ఆ భస్మంతో మన దేశపు భూభాగమంతా కప్పబడిపోయింది. ఎన్నో వారాల తరబడి ఉత్తరార్ధ గోళంలో మూడోవంతు ఆకాశం పూర్తిగా కమ్ముకుపోయింది. వాతావరణంలో సూర్యకాంతిని వెనక్కి ప్రతిఫలించే గంధక (సల్ఫర్) కణాలతో నిండిపోయింది. ఆరేళ్లకు పైగా శీతాకాలం కొనసాగింది. వేసవి సగటు ఉష్ణోగ్రతలు 21 డిగ్రీలు తగ్గిపోయాయి. మొక్కల్లో ముప్పాతిక భాగం నశించిపోయాయి. మామూలు పద్ధతిలో వేసవిలో మంచు

కరగకపోవడంతో భూమికి వెచ్చదనం అందక శీతాకాలం అంతమవలేదు. వెయ్యేళ్లపాటు హిమయుగం కొనసాగింది. దీనివల్ల అంతులేని జననష్టం కలిగి ఉంటుంది. చావు తప్పించుకున్న కొన్ని వేలమంది ప్రజలూ, వారి సంతానం మాత్రమే దక్కడంతో వారి జన్యువులు మాత్రమే మిగిలాయి. అంతకు మునుపు మనుషుల్లో కానవచ్చిన జన్యు వైవిధ్యమంతా అతి కొద్ది వ్యవధిలోనే తుడిచిపెట్టుకుపోయి ఉండాలి. ఉష్ణోగ్రతలో దీర్ఘకాలిక మార్పులను కలిగించే హిమయుగాలు మన చరిత్రని ఇలా ఎన్నిసార్లు మలుపులు తిప్పాయో మనకీనాడు కచ్చితంగా తెలియదు.

పెద్ద హిమయుగాలేకాక గత కొన్ని శతాబ్దాలుగా మరికొన్ని చిన్న హిమయుగాలు కూడా తలెత్తుతూ వచ్చాయి. ఇవి కొన్ని శతాబ్దాలపాటు కొన్ని ప్రాంతాలకే పరిమితమైనట్టుగా తెలుస్తోంది. భూమి వాతావరణాన్ని శాసించే రుతుపవనాలూ, మహాసముద్రాల జలప్రవాహాలూ మొదలైనవన్నీ సూర్యకాంతి మీదనే ఆధారపడతాయి. తక్కిన అంశాలతోబాటు సూర్యబింబం మీద అయస్కాంత క్షేత్రాల కారణంగా అప్పుడప్పుడూ కనబడే మచ్చలుకూడా కొంత ప్రభావాన్ని కలిగిస్తాయి. ఇవన్నీ రకరాలుగా కలిసి భూమి ఉష్ణోగ్రతలో అప్పుడప్పుడూ తేడాలను కలిగిస్తాయనీ, వీటిలో కొన్ని రెండు మూడు వందల ఏళ్లపాటు కొనసాగుతాయనీ శాస్త్రవేత్తలు అంటారు. ఉదాహరణకు క్రీ.శ. 1150–1460 మధ్యలోనూ, 1560–1850 మధ్యలోనూ యూరప్‌లో ఉష్ణోగ్రతలు బాగా తగ్గిపోయాయి. 1816లో యూరప్‌లో వేసవి అనేది రానేలేదట. వివిధ కాలాల్లో భూమి సగటు ఉష్ణోగ్రతలు ఎలా మారుతూ వచ్చాయో తెలుసుకునేందుకు ఆధునిక విజ్ఞాన పద్ధతులు ఉపయోగపడుతున్నాయి. ధ్రువప్రాంతాల్లో నేల కింది పొరలలోనుంచి తీసిన మంచు నమూనాల విశ్లేషణ పనికొస్తోంది. ఈ పరిశీలనలవల్ల చరిత్రలోని పరిణామాలకు దోహదపడిన భౌతిక, భౌగోళిక అంశాలెటువంటివో తెలుస్తున్నాయి. సమాజంలోని వివిధవర్గాల మధ్య కొనసాగుతూ వస్తున్న సంఘర్షణలకు ఇవి తోడవుతూ ఉండేవి. మనుషులతో తిన్నగా ప్రమేయంలేని కొన్ని విషయాలు చరిత్రను మలుపులు తిప్పాయి.

ఉదాహరణకు పంతొమ్మిదో శతాబ్దంలో రష్యాపై నెపోలియన్ సేనలు జరిపిన దాడివంటిది విఫలం కావడానికి విపరీతమైన చలి కూడా ఒక ముఖ్యకారణమయింది. ఇటువంటి సంఘటనలవల్ల ఆకస్మికం అనిపించని ప్రభావాలు కూడా కనబడ్డాయి. వ్యవసాయంలో మార్పులూ, ప్రజల ఆరోగ్యం, ఆర్థిక, రాజకీయ, సామాజిక ఒత్తిళ్లూ, వలసలు వెళ్లడాలూ, కళలూ, సాహిత్యంలో పరిణామాలూ ఇలా ఎన్నో పరివర్తనలు కలిగాయి. ముఖ్యంగా తిండిగింజల ధరవరలూ, తాత్కాలికంగా ఏర్పడిన కొరతలూ, కరువులూ సామాన్యులను చాలా బాధించాయి. తమ జీవితాలు ఎందుకిలా అస్తవ్యస్తం అవుతున్నాయో అప్పటివారికి అర్థం కాలేదు. ప్రకృతి పగబట్టినట్టుగా మాత్రమే అనిపించింది. ఇవన్నీ తరవాతి కాలంలోని వివిధ పరిణామాలకు కారణమయ్యాయి. ఈ లెక్కన చూస్తే చరిత్రను విజ్ఞానశాస్త్రపరంగా అధ్యయనం చెయ్యడం కూడా సబబుగానే అనిపిస్తుంది. వీ

---

(... 7వ పేజీ తరువాయి)

ఉద్యమం' పై ఎన్. వేణుగోపాల్ విశ్లేషణాత్మక వ్యాసం చాల బాగుంది. అనేక సంవత్సరాల నుండి తెలంగాణ ఉద్యమం కొనసాగుతున్నప్పటికీ ఇప్పటికీ ఇంకా అర్థం చేసుకోవడానికి, ఇవ్వాళ్టి సందర్భంలో అన్వయించుకోవడానికి సరైన చారిత్రక విశ్లేషణ, పరిశోధన ఎంతో జరగవలసిన అవసరం ఉందని విశ్లేషించినందుకు వారికి కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను. ఆంధ్రప్రదేశ్ అవతరణ నుండి అత్యధికంగా వనరులను కొల్లగొడుతూ, అన్ని రంగాలపైన వలస ఆధిపత్యాన్ని కొనసాగిస్తూండడం పై నిరసనగా ప్రజాస్వామ్య పద్ధతిలో, పార్లమెంటరీ విధానం ద్వారా ప్రత్యేక తెలంగాణ ఆకాంక్షలను ఇక్కడి ప్రజలు వ్యక్తపరుస్తూనే ఉన్నారు. ఒక రాష్ట్రంలోని ఒక ప్రాంతంలో అసమ అభివృద్ధి, ఆర్థిక అసమానతలు, ఆధిపత్య ధోరణులు ఏర్పడినపుడు అక్కడి బాధితులు వారి ఆశలను, ఆకాంక్షలను తీర్చుకోవడానికి వివిధ సందర్భాలను వినియోగించుకొంటారు. వారి లక్ష్యాన్ని సాధించేవరకు అప్పుడప్పుడు విరామం తప్ప 'విరమణ' మాత్రం ఉండదని గత చరిత్రను పరిశీలించినట్లైతే తెలుస్తుంది. తెలంగాణ సమస్య పరిష్కారం కోసం గతంలో జరిగిన తప్పొప్పులను పరిశీలించుకొని, చేసిన తప్పులను తిరిగి చేయకుండా సమస్య సాధనకు సరైన మార్గంలో కృషి చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది.

**– బోరెడ్డి మధుసూదన్**
సిద్ధిపేట్, మెదక్

'వీక్షణం' మే 2009 సంచికలో ఎం. శ్రీనివాస్ గారు రాసిన 'రిజర్వేషన్ల వర్గీకరణ – ప్రభుత్వాల మోసపూరిత వైఖరి' వ్యాసంలో దండోరా నేపథ్యం, వర్గీకరణ వాగ్దానం చేసి మాదిగలను ఓటు బ్యాంకులుగా వాడుకున్న టిడిపి, కాంగ్రెస్ పార్టీల ద్వంద్వ వైఖరులను విశ్లేషణ చేసిన విధానం బాగుంది. పార్లమెంట్‌లోనూ, అసెంబ్లీలోనూ ప్రతినిధులున్న టిఆర్ఎస్ తెలంగాణను సాధించోకోలేకపోయిన అనుభవం కళ్లముందు కనపడుతున్నప్పటికీ, సామాజిక ఉద్యమాన్ని రాజకీయ పార్టీగా మార్చిన దండోరా నాయకత్వ నిర్ణయం సరి అయినది కాదని నిక్కచ్చిగా, బాగా చెప్పారు. అయితే రెండు ముఖ్యమైన అంశాలపైన వారి వివరణ అసంపూర్తిగా ఉంది. ఒకటి, భారత రాజ్యాంగంలోని 341, 342 ప్రకరణలు వరుసగా షెడ్యూల్డ్ కులాల, షెడ్యూల్డ్ తెగల జాబితాలకు సంబంధించినవి. ఈ జాబితాలలో కొత్త కులాలను, తెగలను చేర్చేందుకు, అప్పటికే ఆయా జాబితాలలో ఉన్న కులాలను, తెగలను తొలగించేందుకు అధికారం ఒక్క పార్లమెంట్‌కే ఉంది. అంతవరకు సబబుగానే ఉంది. అయితే, షెడ్యూల్డ్ కులాల రిజర్వేషన్ల వర్గీకరణకు ఆ జాబితాలకు సంబంధం ఏమిటి? రిజర్వేషన్‌లను వర్గీకరించడమంటే షెడ్యూల్డ్ కులాల జాబితాలోని కులాలను తొలగించడం కాదు. ఆ జాబితాలోని కులాల మధ్య అవకాశాలను సమ పంపిణీ చేయమని. ఈ సూక్ష్మాన్ని చాలామంది అవగాహన చేసుకున్నట్లు కనిపించడంలేదు. చివరకు వర్గీకరణ చట్టంపైన తీర్పునిచ్చిన సుప్రీం కోర్ట్ న్యాయమూర్తులతో సహా. ఈ విషయాన్నే ప్రధానంగా ఉటంకిస్తూ, సుప్రీం కోర్ట్ న్యాయమూర్తుల అన్యాయ తీర్పును విశ్లేషిస్తూ బాలగోపాల్ 'జస్టిస్ ఫర్ దళిత్స్ అమాంగ్ దళిత్స్' అనే పేర ఎకనమిక్ అండ్ పొలిటికల్ వీక్లీ' 16 జూన్ 2005లో ఒక సమగ్రమైన వ్యాసాన్ని ప్రచురించారు. రెండు, మాదిగ కులానికి చెందిన కొంత మేధావి సెక్షన్‌ను దండోరా ఉద్యమం పోగొట్టుకుందని శ్రీనివాస్‌గారి అభిప్రాయం. అయితే ఉద్యమం ఈ మేధావులను పోగొట్టుకోలేదు. ఈ మేధావులు ఉద్యమం ద్వారా తమకు దొరికిన అవకాశాలను అంది పుచ్చుకుని ఆ ఉద్యమాన్ని నడిసముద్రంలో వదిలేశారు. దండోరా ఉద్యమం మునుపు కళాశాలలో, విశ్వవిద్యాలయాలలో ఏ గుర్తింపులేక, చీకటి బతుకులు బతుకుతున్న ఎందరో మాదిగ అధ్యాపకులను వెలుగులోకి తెచ్చింది. దండోరా అండతో వి.సి. లయిన వారు, ప్రొఫెసర్లయిన వారు, శాఖాధిపతులయిన వారు ఎందరో ఉన్నారు. రాజకీయంగా ఎదిగినవారు ఇంకా ఎందరో ఉన్నారు. తమ అవకాశవాదాన్ని వర్తమానంలో ఈ మేధావులు కప్పి పుచ్చుకోవచ్చు. కాని చరిత్ర వారి అవకాశవాద ముసుగును తప్పక తొలిగిస్తుంది.

**– సాంబయ్య గుండిమెడ**
లండన్, యు.కె.

*తెలంగాణ విద్యావంతుల వేదిక లక్ష్యాలనూ, కార్యాచరణనూ వివరిస్తూ, విమర్శకులు కేవలం విమర్శకు మాత్రం పరిమితం కాకూడదంటున్నారు* **శ్రీధర్ దేశ్‌పాండే, పిట్టల రవీందర్**

# ఇవి కూడా గమనంలో ఉండాలె !

వీక్షణం మే 2009 సంచికలో ఆకుల భూమయ్య వ్యాసం 'ప్రత్యేక తెలంగాణ ఉద్యమం-ఒక పరిశీలన' చదివిన తర్వాత తెలంగాణ విద్యావంతుల వేదిక ప్రతినిధులుగా మా ప్రతిస్పందనను తెలియజేస్తున్నాం.

మొదటగా ప్రత్యేక తెలంగాణ ఉద్యమంపై భూమయ్యచేసిన పరిశీలనపై మాకెలాంటి భిన్నాభిప్రాయం ఉండాల్సిన అవసరం కనిపించడంలేదు. " ... ఇలాంటి పార్టీలకు కొమ్ముకాస్తున్న మేధావులను, విద్యావంతుల పేరిట చెలామణీ అవుతున్న అవిద్యావంతులను దూరం చేయకుండా ఉద్యమం ఎంతమాత్రం ముందుకు పోదని ప్రజలంతా గ్రహిస్తున్నారు...." అంటూ రాసిన వ్యాఖ్యానాలు మాకు అభ్యంతరకరంగా కనిపిస్తున్నాయి. ఆ వ్యాఖ్యానాలు తెలంగాణ విద్యావంతుల వేదికను ఉద్దేశించి రాసినవని ఎవ్వరికైనా తెలుస్తున్నది. గతంలో కూడా పలు సందర్భాలలో బహిరంగవేదికలమీద భూమయ్య తెలంగాణ విద్యావంతుల వేదికపై ఈ రకమైన వ్యాఖ్యలు చేయడం మా దృష్టికి వచ్చింది. అయితే ఒక ప్రజా సంఘానికి బాధ్యునిగా చెలామణీ అవుతున్న కారణంగా ఆయనపై ఆయన అనుసరించిన పద్ధతిలోనే జవాబు చెప్పడం సమంజసం కాదని భావించాం. విద్యావంతుల వేదిక అనుసరిస్తున్న కార్యాచరణే ఇట్లాంటి విమర్శకులకు జవాబు అవుతుందనే ప్రజాస్వామిక భావనతో ఇంతకాలంగా సంయమనంతో వ్యవహరించాం. అయినా విద్యావంతుల వేదికపై ఇట్లాంటి వారి ధోరణులలో ఎలాంటి మార్పు కనిపించడంలేదు. వీక్షణంలో ఆకుల భూమయ్య చేసిన వ్యాఖ్యలే తాజా ఉదాహరణ.

విద్యావంతుల వేదిక ఎందుకు పుట్టిందో, వేదిక లక్ష్యాలేమిటో, ఇప్పటిదాకా వేదిక ఏం చేసిందో ... వీక్షణం పాఠకులకు చెప్పడం మా బాధ్యతగా భావిస్తున్నాం. వేదిక 2004 మార్చ్ నెలలో ప్రజాస్వామిక పద్ధతుల్లో తెలంగాణ కోసం ఉద్యమించే తటస్థులకు వేదికగా ఆవిర్భవించింది. తెలంగాణ సాధనలో అన్ని వర్గాల ప్రజలను సమీకరించేందుకు అవసరమైన బౌద్ధిక పునాదిని నిర్మించేదిశలో భావప్రచారాన్ని నిర్వహిస్తూవస్తున్నది. ఇందుకోసం వలసపాలనలో తెలంగాణ వనరుల దోపిడీ, తెలంగాణలోని మౌలికసమస్యల పరిష్కారం తదితర అంశాలను ప్రధాన ఎజెండాగా విద్యావంతుల వేదిక భావప్రచారం కొనసాగుతున్నది. వేదిక ఆవిర్భావం సందర్భంగా ప్రకటించిన లక్ష్యాలకు అనుగుణంగానే తెలంగాణ రాష్ట్ర సాధన కోసం పనిచేస్తున్న రాజకీయ పక్షాలతో, సోదర ప్రజాసంఘాలతో కలిసి మెలిసి పనిచేస్తున్నది. ఆవిర్భావం నుండి ఇప్పటివరకూ విద్యావంతుల వేదిక తనవంతు కర్తవ్యాన్ని, పాత్రను నిర్వహించేందుకు ప్రయత్నిస్తున్నది. తెలంగాణలోని అన్ని జిల్లాల్లోనూ గడచిన ఐదు సంవత్సరాల కాలంలో లెక్కలేనన్ని సభలు, సమావేశాలు నిర్వహించింది. మేధావులను, ఉద్యోగులను, ఉపాధ్యాయులను, విద్యార్థి, యువజనులను, రైతులను, కవులను, రచయితలను, కార్మిక వర్గాన్ని తెలంగాణ ఉద్యమంలో తన శక్తిమేరకు సమీకరించగలిగింది. తెలంగాణ ఉద్యమంపట్ల తటస్థంగా ఉంటూవస్తున్న అనేక మంది మేధావులను వేదిక తన కార్యాచరణ ద్వారా తెలంగాణ వాదంవైపు నిలబెట్టగలిగింది. తెలంగాణ సమస్యలపైనా, వనరుల దోపిడీపైనా, తదితర కీలకాంశాలపైనా అనేక కరపత్రాలు, అందుబాటులో ఉన్న ఇతర ప్రచారమాధ్యమాల ద్వారా అవగాహనను పెంపొందించేందుకు ప్రయత్నించింది. పాలకవర్గాలు పదేపదే ఊదరగొడుతున్న అభివృద్ధివాదాన్ని, అభివృద్ధి పేరిట జరుగుతున్న వనరులదోపిడీ, విధ్వంసాలను వివరిస్తూ నిరంతరం సభలు, సమావేశాల ద్వారా ప్రచారాన్ని ఉధృతం చేసింది.

ప్రజాసమస్యలపై ఎప్పటికప్పుడు స్పందిస్తూ సమస్యల పరిష్కారానికి కూడా వేదిక ప్రయత్నించింది. ముఖ్యంగా సింగరేణి ఓపన్ కాస్ట్ ప్రాజెక్టుల విధ్వంసాన్ని నిరసిస్తూ మూడురోజులపాటు కోల్‌బెల్ట్ వ్యాపితంగా 'కాలరీ కవాతు'ను నిర్వహించాం. 'సెజ్'ల ఏర్పాటు, విద్యుత్ షాక్‌లతో రైతుల మరణాలు, నేతకార్మికుల ఆత్మహత్యలు, రైతాంగం ఆత్మహత్యలు, మెట్రోరైలు విధ్వంసం, ఆదిలాబాద్ ఏజెన్సీలో ఆదివాసీల అనారోగ్యంపైనా, సత్యం కంప్యూటర్స్ కుంభకోణం నేపథ్యంపైనా, రింగ్‌రోడ్డు నిర్వాసితుల దుస్థితిపైనా, అంతర్గాం కాందిశీకుల ఆకలిచావులపైనా, ఇట్లా ప్రతి సమస్యపైనా ఎప్పటికప్పుడు వేదిక స్పందించింది. ప్రత్యేక సమావేశాలను నిర్వహించింది. సమస్యలపై ప్రజలను వేదిక తన శక్తిమేరకు కదిలించింది. ర్యాలీలను నిర్వహించింది. ధర్నాలను చేపట్టింది. తెలంగాణ రచయితల వేదిక, తెలంగాణ జర్నలిస్టుల ఫోరం, తెలంగాణ ఉద్యోగుల సంఘం, తెలంగాణ ఐక్య కార్యాచరణ కమిటీ, తెలంగాణ ఐటీ ఫోరం, తెలంగాణ డెవెలప్‌మెంట్ ఫోరం, తెలంగాణ ప్రైవేట్ సెక్టార్ ఎంప్లాయీస్ అసోసియేషన్, తెలంగాణ విశ్వవిద్యాలయాల అధ్యాపకుల సంఘం, తెలంగాణ టీచర్స్ ఫోరం, తెలంగాణ లెక్చరర్స్ ఫోరం, తెలంగాణ హిస్టరీ సొసైటి, తెలంగాణ సింగరేణి ఉద్యోగుల సంఘం, తెలంగాణ సింగరేణి కళాకారుల వేదిక, తదితర ప్రజాసంఘాలతోపాటు రాజకీయపార్టీలతో కూడా కలిసి అనేక కార్యక్రమాలో క్రియాశీలకంగా తన పాత్రను నిర్వర్తించింది. వలసపాలకుల వివక్ష కారణంగా కనుమరుగైన అనేక ప్రజా సమస్యలను

రాజకీయ ఎజెండాలోకి తీసుకురావడంలో విద్యావంతుల వేదిక శక్తివంతమైన పాత్రను నిర్వహించింది. మొత్తంగా వర్ధమాన తెలంగాణ ఉద్యమంలో విద్యావంతుల వేదిక గడచిన ఐదు సంవత్సరాలుగా ఒక ఉధృత ప్రవాహంగా కొనసాగింది. తెలంగాణలోని అన్ని జిల్లాల్లోనూ విద్యావంతుల వేదికకు పటిష్ఠమైన నిర్మాణం ఉన్నది. కొన్ని ప్రాంతాలలో ప్రజలు,స్థానిక విద్యావంతుల చొరవతో డివిజన్ స్థాయిలోనూ, మండలస్థాయిలోనూ, గ్రామస్థాయిలోనూ కమిటీల నిర్మాణం జరిగింది. ప్రతి రెండుసంవత్సరాలకొకసారి జిల్లా మహాసభలు, రాష్ట్ర మహాసభలు, ప్రతి రెండు నెలలకొకసారి కార్యవర్గ సమావేశాలు క్రమం తప్పకుండా నిర్వహించుకుంటూ, భవిష్యత్తు కార్యాచరణను రూపొందించుకునే ప్రజాస్వామిక వాతావరణంలో వేదిక కొనసాగుతున్నది.

తెలంగాణ భావవ్యాప్తిలో భాగంగా తెలంగాణ సమస్యలపై ఎప్పటికప్పుడు పుస్తకాలను ప్రచురిస్తూ ప్రజలకు చేరవేస్తున్నది. తెలంగాణ – వర్తమానం, తెలంగాణ అభివృద్ధి – మిధ్య, వాస్తవం, నీళ్లు–నిజాలు, సింగరేణి సంస్కరణలు– పరిణామాలు, పర్యవసానాలు, బొగ్గుపొరల్లో (కవితాసంకలనం), జమ్మిఆకు (కవితా సంకలనం), తెలంగాణలో చదువు, కమ్యూనిజమా–కోస్తావాదమా!, తెలంగాణం (వట్టికోట ఆళ్వారుస్వామి సంకలం చేసిన రెండు సంపుటాల పునర్ముద్రణ), ఐదేళ్ల కాంగ్రెస్‌పాలన–విద్రోహం, విధ్వంసం, తెలంగాణ (రాజకీయ, ఆర్థిక, సామాజిక వ్యాసాలు), చెదిరిన చెరువులాంటి అనేక పుస్తకాలను ప్రచురించి తెలంగాణ భావవ్యాప్తిలో లోతైన అధ్యయనానికి అవకాశం కల్పించింది. తెలంగాణ ఉద్యమ క్రమాన్ని రికార్డు చేయడంతోపాటు, వర్తమాన అంశాలను, తెలంగాణ చారిత్రక నేపథ్యాన్ని వివరిస్తూ, చర్చిస్తూ 'తెలంగాణ టైమ్స్' పత్రిక కూడా విద్యావంతుల వేదిక నిర్వహణలోనే 22 సంచికలుగా వెలువడింది. అంతేకాకుండా తెలంగాణ వర్తమాన సమస్యలపైనా, పరిణామాలపైనా విద్యావంతుల వేదిక బాధ్యులు వ్యక్తిగతంగానూ, సమిష్టిగానూ పత్రికల్లో, మీడియాలో నిరంతరం ప్రతిస్పందిస్తూనే ఉన్నారు. వర్తమాన తెలంగాణ ఉద్యమంలో పైన వివరించిన కార్యక్రమాల ద్వారా నిరంతర కార్యాచరణతో ముందుకుపోతున్న తెలంగాణ విద్యావంతుల వేదిక సభ్యులను, బాధ్యులను ఆకుల భూమయ్య తన వ్యాసంలో (అప్రస్తుత ప్రస్తావనగా, అనవసర సందర్భంలో) 'విద్యావంతుల పేరిట చెలామణీ అవుతున్న అవిద్యావంతులను'గా చిత్రీకరిస్తుంటే... ఆయనను ఏమనాలి !? "విద్యావంతులుగా చెలామణి అవుతున్న ఇట్లాంటి అవిద్యావంతులను ఉద్యమం నుండి దూరం చేయకపోతే తెలంగాణ ఉద్యమం ముందుకు పోదని ప్రజలంతా గ్రహిస్తున్నారని భూమయ్య గ్రహించినట్లు తన వ్యాసంలో వెల్లడించడం ఆయన సంకుచిత వైఖరికి నిదర్శనంగానే మేము భావిస్తున్నాం. నిరంతరం ప్రజలతో మమేకమై, ప్రజాసమస్యలను తెలంగాణ ఉద్యమంతో సమన్వయం చేస్తూ ముందుకు సాగుతున్న తెలంగాణ విద్యావంతుల వేదికను ప్రజలనుండి విడదీయాలని భూమయ్య లాంటి వాళ్లు చేసే ప్రయత్నాలు ప్రజలు గ్రహించకపోరు.

తెలంగాణ విద్యావంతుల వేదికపై భూమయ్యతో పాటు మరికొంతమంది పదేపదే చేస్తున్న విమర్శ తెలంగాణ రాష్ట్ర సమితికి అనుబంధంగా పనిచేస్తున్నామని, తోకసంస్థలాగా మారిందని, కొమ్ము కాస్తున్నారని, భుజాన మోస్తున్నామని. తెలంగాణ విద్యావంతుల వేదిక ఆవిర్భావం నుండి తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఏర్పాటుపట్ల అనుకూలంగా ఉన్న ప్రతి రాజకీయ పార్టీతోనూ సన్నిహితంగానే ఉన్నది. తెలంగాణపట్ల వైరుధ్యంతో వ్యవహరిస్తున్న రాజకీయపార్టీలతో కూడా నిరంతరంగా సంభాషిస్తూనే ఉన్నది. 2004 ఎన్నికల తర్వాత కాంగ్రెస్ పార్టీకి చెందిన రాష్ట్ర, కేంద్రస్థాయి సీనియర్ నాయకులపై ఒత్తిడిని పెంచేందుకు వేదిక చేయని ప్రయత్నం లేదు. కలవని నాయకుడు లేడు. సోనియాగాంధీతో పాటుగా కాంగ్రెస్‌పార్టీకి చెందిన సీనియర్ నాయకులు దిగ్విజయ్‌సింగ్, వీరప్పమొయిలీలతోపాటు మరికొంతమంది నాయకులను సైతం పలు సందర్భాలలో కలసి తెలంగాణపట్ల సానుకూల వైఖరిని తీసుకోవాలని కోరడం జరిగింది. పార్టీలో తెలంగాణవాదాన్ని వినిపిస్తున్న రాష్ట్రానికి చెందిన జి. వెంకటస్వామి, పిజెఆర్, మధుయాష్కీ తదితరులలో మనోధైర్యాన్ని నింపేందుకు కూడా అనేక విధాలుగా వేదిక ప్రయత్నించింది. భారతీయ జనతా పార్టీ జాతీయ నాయకత్వాన్ని స్వయంగా కలిసి తెలంగాణపై అనుకూల వైఖరిని ప్రకటించాలని వేదిక కోరింది. పార్టీ జాతీయ నాయకులు రాజ్‌నాథ్‌సింగ్, వెంకయ్యనాయుడు. ప్రకాశ్ జవదేకర్‌లాంటి నాయకులను కలవడం జరిగింది. కాలం చెల్లిన భాషారాష్ట్రాల సిద్ధాంతాన్ని ఇంకా పట్టుకుని వేళ్లాడుతూ, తెలంగాణ వ్యతిరేక వైఖరిని ప్రదర్శిస్తున్న సిపిఎం రాష్ట్ర కార్యదర్శి రాఘవులుతోకూడా వేదిక చర్చించింది. సిపిఐ నాయకత్వంతోనూ చర్చించాం. ఈ క్రమంలోనే తెలంగాణ రాష్ట్ర సాధనే ఏకైక లక్ష్యంగా ఆవిర్భవించిన కారణంగా తెలంగాణ రాష్ట్ర సమితితో వేదిక మరింత సన్నిహితంగా, స్నేహపూర్వకంగా వ్యవహరిస్తున్నది. అట్లా వ్యవహరించడం తప్పనికూడా మేము ఎప్పుడూ భావించలేదు. ఇప్పుడు కూడా అట్లా భావించడంలేదు. అయితే టిఆర్ఎస్ తీసుకుంటున్న నిర్ణయాలపట్లగానీ, వ్యవహారశైలిపట్ల గానీ, పార్టీ నిర్మాణం విషయంలోగానీ, అంతర్గత వ్యవహారాలపైగానీ వేదికకు పూర్తి సమ్మతి ఉన్నట్లు మేము ఏ సందర్భంలోనూ ప్రకటించలేదు. చాలా సందర్భాలలో టిఆర్ఎస్‌పట్ల విమర్శనాత్మకంగానే వ్యవహరించాం.

ఉదాహరణకు 2004 ఎన్నికల తర్వాత టిఆర్ఎస్ కేంద్రంలోనూ, రాష్ట్రంలోనూ మంత్రివర్గంలో చేరడాన్ని తీవ్రంగానూ, బహిరంగంగానూ వ్యతిరేకించాం. వారు రాజీనామాలు చేసి ప్రజల్లోకి రావాలని, తెలంగాణ సాధనకోసం ఉద్యమబాటపట్టాలని వరంగల్లులో జరిగిన రాష్ట్ర కార్యవర్గంలో తీర్మానించి, పార్టీకి బహిరంగ లేఖను కూడా రాయడం జరిగింది. ఇదే క్రమంలో ఐక్య కార్యాచరణ కమిటీతో కలిసి ర్యాలీని, బహిరంగసభను నిర్వహించడంలో క్రియాశీలంగా వ్యవహరించింది. 2008 ఉపఎన్నికల్లో టిఆర్ఎస్ వైఫల్యాలను విశ్లేషిస్తూ నిర్మొహమాటంగా పార్టీ తప్పిదాలను పత్రికల్లోనూ, పార్టీ వేదికపైనా విద్యావంతుల వేదిక వ్యక్తం చేసింది. నవ తెలంగాణపార్టీతో స్నేహపూర్వక వైఖరిని కొనసాగించాలని, తెలంగాణ శక్తుల ఏకీకరణకు కృషిచేయాలని కూడా టిఆర్ఎస్‌కు వేదిక పదేపదే విజ్ఞప్తి చేసింది. అయితే టిఆర్ఎస్ పట్ల మాకు స్పటిక సదృశ్యమైన స్పష్టత ఉన్నది. ఈ పార్టీని కూడా పార్లమెంటరీ పార్టీగానే అంచనా వేస్తున్నాం. పార్లమెంటరీ పార్టీలలో ఉండే అనేక అపసవ్యధోరణులు ఈ పార్టీలోనూ ఉన్నాయన్నది మా అవగాహన.

టిఆర్ఎస్ ఒక పవిత్రమైన ఉద్యమ పార్టీగా, సైద్ధాంతిక నిబద్ధత కలిగిన పార్టీగా ఉంటుందని మాకు ఎలాంటి భ్రమలు లేవు. అయినప్పటికీ తెలంగాణ ప్రజల ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్షకు రాజకీయ వ్యక్తీకరణను ఇస్తున్న టిఆర్ఎస్‌ను, కేవలం రాజకీయ లబ్ధికోసం మాత్రమే సానుకూలంగా వ్యవహరిస్తున్న ఇతర పార్టీలను ఒకే దృష్టితో చూడటం సరికాదన్నది మా నిశ్చితాభిప్రాయం. అట్లానే టిఆర్ఎస్ పార్టీ

*దండోరా ఉద్యమ స్ఫూర్తితో ప్రారంభమైన మాదిగ సాహిత్యం మొత్తంగా తెలుగు సాహిత్యానికే కొత్త నడకలు నేర్పిందంటున్నారు* **సాంబయ్య గుండిమెడ**

# మాదిగ సాహిత్యం : తెలుగు సాహితీ ఫలకంపై కొత్త దరువు

*(...గత సంచిక తరువాయి)*

**ఈ** ఉపశమనాల ఫలితంగా :

1) వీటినే ఆసరా చేసుకుని ఎదగాలని దళితులలో ఒక వర్గం ఆరాటపడుతుండడం వల్ల అలాంటి వాళ్లు వ్యవస్థలోని అవినీతితో సర్దుబాటు చేసుకోనడానికీ;

2) దళితులలో వివిధ స్థాయిలు (ముఖ్యంగా ఉపశమనాలను పొందినవారు, పొందలేకున్నవారు లేదా ఉపశమనాలకు దూరంగా ఉంచబడినవారు) తయారుకావడానికీ;

3) పాలకవర్గాలు దళితులను ఓటు బ్యాంకులుగా రూపాంతరం చెందించుకుని వారిని తమ రాజకీయాలలో పావులుగా ఉపయోగించు కొనడానికి దారి తీస్తున్నదనే ప్రజాసాహితి విశ్లేషణకు దార్ల తన పూర్తి సమ్మతాన్ని తెలియజేస్తారు.

అయితే, దళిత రిజర్వేషన్ల మొత్తానికి అనువర్తించే ఈ విశ్లేషణను మాదిగ దండోరా వర్గీకరణ డిమాండ్ కి కూడా ప్రజాసాహితి అనువర్తింప జేయడాన్ని దార్ల ఒక స్పష్టతతో, బలమైన కారణాల ప్రాతిపదికతో ఆక్షేపిస్తారు.

ప్రజాసాహితి తన నవంబర్, 1998, 202వ సంచికలో ప్రచురించిన కరపత్రంలో: 'ఎబిసిడిల విభజనలో మెరుగైన న్యాయం ఉండినా పాలక గ్రూపులూ, రకరకాల సంస్కరణవాదులూ, రిజర్వేషన్ల విభజనే కాక దళిత ప్రజల విభజనకు కూడా దాన్ని వినియోగిస్తున్నారు' అని చెప్పడం జరిగింది. ఈ పత్రాన్ని తయారు చేసిన వారు ఎస్.ఆర్.శంకరన్. ఈ అభిప్రాయాన్ని జాగ్రత్తగా పరిశీలిస్తే రెండు విషయాలు సుస్పష్టం. వర్గీకరణ డిమాండ్‌లో న్యాయం ఉంది. ఆ న్యాయం కూడా సాదా సీదాది కాదు. అది సమాజానికి మెరుగైన న్యాయం; రిజర్వేషన్‌లను విభజించడమనే మిషతో పాలకవర్గాలు దళిత ప్రజలను విభజిస్తున్నారు. వర్గీకరణలో మెరుగైన న్యాయం ఉందని వంతలు పలుకుతూనే దళిత సమాజాన్ని విభజించడానికి పాలక వర్గాల చేతిలో అది సాధనమవుతుందనే వంకర పలుకులు దేనికి? తమ చేతిలో పాలనా పగ్గాలు ఉంచుకోవడమే పాలకవర్గాల పరమావధి. అందుకోసం ప్రజలను విభజిస్తారు, లేదా ప్రజలలోని విభజనలను ఉపయోగించు కుంటారు. వర్గీకరణ కూడా ఏదో ఒకరకంగా ఆ పరమావధికి దోహదపడితే దానిని ఉపయోగించుకొనడానికి కూడా ముందుంటారు; లేదు ఏకీకరణ అందుకోసం అక్కరకొస్తే దాని జపం జపిస్తారు. అసలు

---

నాయకునిగా ఉన్న కెసిఆర్‌ను, ఆంధ్రా సంపన్నవర్గాల ఏజెంట్లుగా పనిచేస్తున్న వైఎస్, చంద్రబాబు, చిరంజీవి లాంటి వారితో కలిపి ఒకే దృష్టితో చూడటం మా వైఖరికాదు. కెసిఆర్‌తో విద్యావంతుల వేదిక కొనసాగిస్తున్న సంబంధం మిత్రవైరుధ్యంతో కూడుకున్నది. వైఎస్, చంద్రబాబు, చిరంజీవిలాంటివారిపట్ల మా అవగాహన ఇందుకు పూర్తిగా భిన్నమైనది. ఆంధ్రా పాలకవర్గాల ప్రతినిధులతో కెసిఆర్‌ను పోల్చడం, తెలంగాణ ఆకాంక్షలను నెరవేర్చేందుకు సహకరించే వైఖరి కాదని మా అభిప్రాయం.

తెలంగాణ ఆకాంక్ష దృష్టికోణం నుండి విశ్లేషించినప్పుడు సీమాంధ్రపాలకవర్గాలు, తెలంగాణ పాలకవర్గాలు ఒకటికావు. సీమాంధ్ర పాలకవర్గాలను నిలువరించేందుకు తెలంగాణ పాలకవర్గాల మద్దతు, సహకారం కూడా అవసరమే. ఈ అవగాహనతోనే వేదిక టిఆర్ఎస్‌తో వ్యవహరిస్తున్నది. టిఆర్ఎస్ అనుసరిస్తున్న వైఖరుల్లోనూ, ఎత్తుగడల్లోనూ, రాజకీయ కార్యాచరణలోనూ విద్యావంతుల ప్రమేయం ఉండి ఉంటుందని, టిఆర్ఎస్ పనివిధానాన్ని తెలంగాణ విద్యావంతుల వేదిక ప్రభావితం చేయగలగుతుందని భూమయ్యలాంటి అనేకమంది అపోహ పడటం వల్లనే వేదికపై ఇట్లాంటి భ్రమలకు తావిస్తున్నది. అయితే ప్రజల నుండి వ్యక్తమవుతున్న అభిప్రాయాలను పార్టీ నాయకత్వానికి తెలియజెప్పడంలో వేదిక తన కర్తవ్యాన్ని నిర్వహిస్తున్నప్పటికీ, ఈ అభిప్రాయాలకు అనుగుణంగా పార్టీ తన విధానాలను సవరించు కోవడమన్నది ఆ పార్టీ అంతర్గత వ్యవహారమేగానీ, విద్యావంతుల వేదిక బాధ్యతగా పరిగణించడం సమంజసం కాదని స్పష్టం చేయదలుచుకున్నాం.

టిఆర్ఎస్ ఎంచుకున్న పొలిటికల్ లాబీయింగ్ ద్వారా తెలంగాణ సాధించడం వీలుకాదన్న అభిప్రాయం ఉండటం తప్పుకాదు. ఉద్యమం ద్వారానే తెలంగాణ వస్తుందని నమ్మడం కూడా తప్పేమీకాదు. అయితే తాము నమ్ముతున్న మార్గాలద్వారా తెలంగాణా సాధించుకునేందుకు అనుసరిస్తున్న కార్యచరణ ఏమిటో, చేస్తున్న ప్రయత్నాలు ఏమిటో భూమయ్యలాంటివాళ్లు వివరించగలిగితే ... ఇతరులను విమర్శించడానికి మాత్రమే పరిమితమయ్యే స్వీయమానసిక ధోరణులనుండి బయట పడగలుగుతారు. తెలంగాణ ఉద్యమ కార్యాచరణను పెంపొందించడానికి తోడ్పడగలుగుతారు. వీ

వర్గీకరణ పాలకవర్గాల చేతిలో ఏ విధంగా వినియోగించబడుతుంది అన్నది ఇక్కడ అధమ విషయం. వర్గీకరణ ద్వారా మాదిగ ఇత్యాది కులాలకు సామాజిక న్యాయం జరుగుతుందా లేదా అన్నదే ప్రధాన విషయం. వర్గీకరణలో మెరుగైన న్యాయం ఉంది అని అంగీకరించడం అంటే ఆయా కులాలకు వర్గీకరణ ద్వారా సామాజిక న్యాయం జరుగుతుంది అని అంగీకరించినట్లే కదా? ఒకవేళ అలా వర్గీకరణ జరగకుంటే ఆ కులాలకు అన్యాయం జరుగుతుంది అని కూడా (పరోక్షంగా) అంగీకరించినట్లే కదా?

ఇక ఈ వాదనలోనే రెండవ విషయం / అభిప్రాయం గురించి చెప్పుకోవాలంటే, అసలు అటువంటి అభిప్రాయాన్ని వ్యక్తపరచిన వ్యక్తి/ పత్రికకు గల సామాజిక అవగాహనపైన అనుమానం కలుగుతుంది. మనుధర్మ శాస్త్రం భారతీయులను ఐదు వర్ణాలుగా విభజిస్తే, ఐదు కాదు ఐదు వందల యాభై ఐదు కులాలుగా వీరు తమను తాము విభజించుకుని పరిపాలించుకుంటున్నారు. అంటే విభజన అనే ఒక సూత్రాన్ని మూల సూత్రంగా చేసుకుని నిర్మించబడిందే భారతీయ కుల సమాజం. ఇది భారతీయ సమాజ కనీస అవగాహన కలిగిన ఏ వ్యక్తైనా అంగీకరించే సత్యం. ఈ ప్రాథమిక నిర్మాణ సూత్ర దృష్టికోణం నుండి గమనిస్తే దళిత ప్రజల విభజనకు కూడా వర్గీకరణను వినియోగిస్తున్నారు, కాబట్టి వర్గీకరణ వద్దు అని అనడం నాకైతే కొంత వెర్రితనంగా, మూర్ఖపు వాదంగా అనిపిస్తుంది. నేను అలా అనడం వ్యంగ్యమనో, అహంకారమనో చాలామంది అభిప్రాయపడవచ్చు. అట్టివారి కోసం నా అభిప్రాయాన్ని మార్చుకునే ప్రసక్తేలేదు.

దళిత సమాజాన్ని విభజించడానికి అసలు ఆ సమాజం ఎప్పుడు ఐక్యంగా ఉంది? 'చిన్న కత్తి పెద్ద కత్తి నాదేనయా, చిందేసే వీరబాహుడు నేనేనయా' - అని మాదిగలు సాంస్కృతికంగా మాలవారిపై ఆధిపత్యం వహించాలని చూడలేదా? మాల కులానికి చెందిన మాదరి బాగయ్య (భాగ్యారెడ్డి వర్మ) నాయకత్వంలో 1930వ దశకంలో హైదరాబాద్‌లో నడిచిన ఆది-హిందూ ఉద్యమంలో మాదిగ వారిని దూరంగా ఉంచడమేగాక, మాల-మాదిగల మధ్య కులాంతర వివాహాలకు అడ్డుగోడలు కట్టలేదా?[8] కాంగ్రెస్ పార్టీలో మాల కులానికి చెందిన దామోదరం సంజీవయ్య - మాదిగ కులానికి చెందిన సదాలక్ష్మిల మధ్య అధికార పోరాటంలో మాల కులం సంజీవయ్య పక్షాన, మాదిగ కులం సదాలక్ష్మి పక్షాన నిలబడలేదా? కాన్షీరాం చమార్ కులస్తుడనీ, ఉత్తర భారతదేశంలో చమార్‌లు అంటే ఇక్కడ మాదిగలు అని, కాబట్టి మాదిగల పార్టీకి ఓటు వేసేదేమిటని 1994 అసెంబ్లీ ఎన్నికలలో మాలలు బహుజన సమాజ్ పార్టీకి దూరంగా ఉండలేదా?[9] మాల ఉద్యోగస్తుల సంఘాలుగా, మాదిగ ఉద్యోగస్తుల సంఘాలుగా మాల-మాదిగ కులాలకు చెందిన ఉద్యోగస్తులు తమను తాము విభజించుకోలేదా? ప్రతి విద్యా సంస్థలో మాదిగ విద్యార్థి సంఘాలు, మాల విద్యార్థి సంఘాలు ఉండడం కనపడడం లేదా? మరి ఇన్ని రకాల విభజనలు కళ్లకు కట్టినట్టుగా, స్పష్టంగా కనబడుతున్నప్పటికీ రిజర్వేషన్ల వర్గీకరణ దళితుల విభజనకు దారితీస్తుంది అనడం ఎంతవరకు సబబు? ఇంకో రకంగా అడగాలంటే ఇటువంటి చొప్పదంటు వాదాలు ఎవరిని మాయ పుచ్చడానికి? ఎవరిని మోసం చెయ్యడానికి?

దళిత సమాజ ఐక్యతను నిజంగా కాంక్షించే వారు అది ప్రజాసాహితి లాంటి పత్రికలైనా లేదా ఎస్ఆర్ శంకరన్ లాంటి పెద్దలైనా ముందుగా దళిత సమాజం పట్ల, వర్గీకరణ విషయం పట్ల కొంత ఆత్మశోధన చేసుకుని ఆత్మశుద్ధి చేసుకోవడం అత్యావశ్యకం. వారు నిజాయితీగా అలా చేసుకోవడం జరిగితే రెండు విషయాలను నిర్భయంగా అంగీకరిస్తారు. అవి : ఒకటి, దళిత సమాజం ఇతర వర్ణ సమాజాల మాదిరే విభజనలమయం; రెండు, వర్గీకరణ సమస్యను సామరస్యంగా పరిష్కరించుకోకుండా ఉంటే ఇప్పటికే దళిత సమాజంలో ఉన్న విభజనలు మరింతగా విజృంభిస్తాయేగాని మట్టుపడే అవకాశం ఇసుమంతైనా ఉండదు. ఇలా అంగీకరించిన తరువాత పాయలు పాయలుగా విడివడి ఉన్న దళిత కులాలను అనుసంధానం చేయడానికి వారు చేపట్టవలసిన ప్రప్రథమ కార్యక్రమం ఏ ఇసుక మేటలు ఆ అనుసంధానానికి అడ్డుగా ఉన్నాయో వాటిని గుర్తించి, చదును చేసే పాయల మధ్య తెన్నులు తీయాలి. అలా జరిగిన రోజున పాయలన్నీ కలిసి ప్రవాహ ఒరవడిని పెంచుతాయి. పోను పోను ఆ ఒరవడి ఉధృతమై దళిత సమాజ శక్తిని ఉద్వేగం చేస్తుంది. ఇప్పుడు మాల-మాదిగ కులాల మధ్య పేరుకుపోయిన పెద్ద ఇసుక మేట - వర్గీకరణ. ఈ మేటను తియ్యకుండా దళిత సమాజ ఐక్యత గురించి ఆలోచన చెయ్యడం అవివేకులు చేసే పని.

నాలుగు, మహారాష్ట్రలో జరిగిన ఖైర్లాంజీ దురాగతం అగ్రకులాలలో నిబిడీకృతమైన రాక్షసత్వానికీ, పాశవికతకూ, దళితులపై వారిలో పేరుకుపోయిన ఏహ్యభావానికి నిలువెత్తు దర్పణం పడుతుంది. కుల సమాజం భౌతికంగా, మానసికంగా తమపై విధించిన పరిమితులను అధిగమించి, గీచిన సరిహద్దులను దాటి దళితులు మనుష్యులుగా ఎదగడానికి, స్వతంత్రంగా - ఆత్మగౌరవంతో బతకడానికి ప్రయత్నిస్తే ఏమి జరుగుతుందో, అగ్రకులాలు ఎంత దారుణానికి వడికట్టగలవో మరోసారి తేల్చి చెప్పిన ఖైర్లాంజీ అమానుషత మరో కారంచేడు, ఇంకో చుండూరు. ఈ దుస్సంఘటన జరిగిన తరువాత ప్రజాసాహితి వారు తమ 289వ సంచికలో (డిసెంబర్, 2006) 'ఖైర్లాంజీ అవమానాల దురాగతాల జీవితాలింకెన్నాళ్లు' అనే సంపాదకీయాన్ని ప్రచురించారు. ఇందులో ఖైర్లాంజీ గ్రామ అగ్రకులాలన్నీ ఏకమై భయ్యాలాల్ బోత్మాంగ్ కుటుంబంపై మూకుమ్మడిగా దాడి చేసిన సంఘటనను వివరిస్తూనే ఆ సంఘటన వెనుక దాగిన, అందుకు దారితీసిన సామాజిక - ఆర్థిక పరిస్థితులను, స్వాతంత్ర్యానంతరం భారత ప్రభుత్వం దళితుల సామాజిక, ఆర్థిక స్థితిగతుల అభివృద్ధికి రాజ్యాంగ బద్ధంగా చేపట్టిన పాలసీ - పథకాలు, అంబేద్కర్ చూపెట్టిన మార్గం - వీటన్నిటినీ క్లుప్తంగానే చర్చించినప్పటికీ, సూక్ష్మంగా విశ్లేషించడం చేశారు. ఈ విశ్లేషణనుండి దార్ల తన వ్యాసంలో తీసుకున్నవి, మన చర్చకు ఉపయోగపడేవి రెండు విషయాలు : 1) దళితులను సామాజిక విముక్తులను చేయడంలో మతానికున్న పరిమితులు; 2) దళితుల వైయక్తిక విముక్తి / అభివృద్ధి పీడిత జన సమిష్టి విముక్తి / అభివృద్ధి జరిగినప్పుడే.

మనిషి మనుగడకు మతం అవసరమా, కాదా? అవసరమైతే ఏ మేరకు దాన్ని మనిషి తన జీవితంలో ఆహ్వానించాలి? అవసరం లేకుంటే మనిషికవసరమైన ఆధ్యాత్మిక దాహాన్ని ఏ విచారధారతో తీర్చవచ్చు - మున్నగు ప్రశ్నలపై సమాధానం కోసం మనిషి నిరంతరం అన్వేషిస్తూనే ఉన్నాడు. ఆ ప్రశ్నలపైననే తాత్వికుల మధ్య, ఆస్తిక - నాస్తిక వాదుల మధ్య నిరంతర వాద-వివాదాలు చెలరేగుతూనే ఉన్నాయి. ఒక మత విచారధార చెరసాలలో బందీలు గావించబడిన ఒక కూటమిని మరో మత విచారధార సహాయంతో విముక్తులను చెయ్యవచ్చా, లేదా? -

అనేది కూడా పైన పేర్కొన్న ప్రశ్నల పరంపర కిందికే వస్తుంది. ఈ ప్రశ్నలను అటుంచి, అంబేద్కర్ మత మార్పిడి చర్యను గమనిస్తే, వేరే మత సహాయంతో దళితులను విముక్తం గావించవచ్చు అని అతను భావించాడని స్పష్టంగా తెలుస్తోంది.[10] కుల సామాజిక వ్యవస్థ పునాదిపై నిర్మితమైన హిందూ మత ధర్మం తన కబంధ హస్తాలలో దళితులను చిక్కించుకుని భౌతికంగా, మానసికంగా వారిని తరతరాలుగా శక్తి విహీనులు చేసుకుంటూ వస్తుంది. అట్టి ధర్మం నుండి, దాని కుల వ్యవస్థ నుండి దళితులను విముక్తులను గావించి 'సమానత' అనే సూత్రంపై నిర్మితమైన బౌద్ధ ధర్మానికే ఉందని అంబేద్కర్ మనస్ఫూర్తిగా విశ్వసించాడు. ఎందరో వివిధ మత ధర్మ పెద్దలు తమ తమ మతాలలో చేరమని అంబేద్కర్‌ని ఎన్నో రకాలుగా ప్రలోభ పెట్టినా ఎట్టి ప్రలోభానికి లొంగక తన విశ్వాసానికి అనుగుణంగా, కొంత ఆలస్యంగానైనా, తన మరణానికి ముందు తాను విశ్వసించిన బౌద్ధ ధర్మాన్నే స్వీకరిస్తాడు. మిగిలిన దళితులను కూడా అట్టి మార్గాన్ని అనుసరించమని ప్రభోదిస్తాడు. ఆ ప్రభోదానికి ప్రభావితులైన భయ్యాలాల్ బోత్మాంగ్ లాంటి దళితులెందరో బౌద్ధాన్ని స్వీకరించి ఆ ధర్మం సూత్రాలకు అనుగుణంగా తమ జీవితాలను మలచుకుని నడుచుకుంటున్నారు. అలా నడుచుకున్నప్పటికీ కుల రక్కసి రక్త కౌగిలి నుండి దళితులను ఆ ధర్మం విముక్తి చెయ్యలేక పోవడం విచారకరం. ఇదే విషయాన్ని ప్రజాసాహితి వారు తమ సంపాదకీయంలో ప్రముఖంగా పేర్కొన్నారు.

ఆచరణలో బౌద్ధ ధర్మం దళితులను విముక్తం చెయ్యలేకపోయింది అన్న విషయం మనకందరికీ తెలిసిందే. సరే, ఎందుకు అలా జరగలేదు? ఈ ప్రశ్నకు సమాధానాన్ని లోతుగా పరిశోధించి చెప్పవలసి ఉన్నా, నాకు ఇందుకు రెండు బలమైన కారణాలు కనిపిస్తున్నాయి. హిందూ మతాన్ని వీడి బౌద్ధాన్ని స్వీకరించిన దళితులు ఆ స్వీకరణను హిందూ మతం నుండి తమను తాము విముక్తం చేసుకొనడానికి, దూరంగా జరుగడానికి ఉపయోగించుకునే విధంగా కాకుండా బౌద్ధ ధర్మాన్ని స్వీకరించని ఇతర దళితులతో, దళిత కులాలతో తమను తాము దూరంగా జరుపుకుని, అలా జరుపుకున్నట్లు చూపించుకోవడానికి ఉపయోగించుకున్నారు. ఉదాహరణకు, బౌద్ధాన్ని స్వీకరించిన దళితులలో మహారాష్ట్రలోని మహార్లది అగ్రస్థానం. అంబేద్కర్ తమ కులానికి చెందినవాడు కావడం వల్లనే మహార్లు అతని మార్గాన్ని అవలంబించారు అన్న విషయాన్ని అటుంచితే, నయా బౌద్ధులు (బౌద్ధాన్ని స్వీకరించిన మహార్లు), మహార్లు (బౌద్ధాన్ని స్వీకరించని వారు) అనే రెండు కూటములుగా వీరు తమను తాము విభజించుకున్నారు. ఈ రెండు కూటముల మధ్య వివాహ సంబంధాలు కూడా ఉండవు. ఒకవేళ అలా జరిగినా ఆ జరగడం అనేది చాలా అరుదు అని కూడా తెలుస్తుంది. వివరణలో ఏ కుల నిర్మూలన ప్రయోజనాన్ని ఆశించి అంబేద్కర్ బౌద్ధాన్ని స్వీకరించాడో, మహార్లు నయా బౌద్ధులుగా అవతారమెత్తి ఆ ఆశయాన్ని తుంగలో తొక్కడం చారిత్రకంగా జరిగిన ఒక పరిణామం. ఈ అనుభవం ఒక్క బౌద్ధానికే పరిమితం కాదు. క్రైస్తవ, సిక్కు, ఇస్లాం – లాంటి మతాలను స్వీకరించిన దళితులలో కూడా ఇదే మాదిరి అనుభవాన్ని గమనించవచ్చు. మతం మార్చుకున్నా హిందూ మతం తమ చుట్టూ కట్టిన కుల గోడలను కూలగొట్టుకోకుండా ఉండడం అటుంచి ఆ గోడల సమీపానికి సైతం ఇతరులు రాకుండా దళితులు తామే స్వయంగా నయా కులాల రూపంలో కందకాలు తవ్వుకోవడం అంబేద్కర్ మార్గ విఫలానికి ఒక కారణమైతే, ఇలా మతం మార్చుకున్న వారిపై బయటి నుండి విధించిన/వచ్చి పడిన పరిమితులు రెండవ కారణం.

రాజ్యాంగబద్ధంగా దళితులకు కల్పించిన రిజర్వేషన్ వసతులను క్రైస్తవం, ఇస్లాం లాంటి మతాలలోకి మారిన దళితులకు వర్తించకుండా చట్టం చేశారు. మతం మారినంత మాత్రాన కులం మారుతుందా? వారి ఆర్థిక స్థితి బాగుపడుతుందా? ఈ చట్టాన్ని ఏ ఆధారంతో చేశారో అంతుపట్టదు. క్రైస్తవం పుచ్చుకున్న దళితులకు క్రైస్తవ మిషనరీలు కొంత విద్యాబుద్ధులు నేర్పి ఉద్యోగాలు ఇచ్చిన మాట వాస్తవం. అయితే ఇది బ్రిటిష్ వలస ప్రభుత్వ హయాంలో, స్వాతంత్ర్యానికి ముందు, స్వాతంత్ర్యం తరువాత అగ్ర కులాలు మన రాష్ట్రంలో ముఖ్యంగా కమ్మలు – రెడ్లు క్రైస్తవ విద్యాలయాల్లో సీట్ల కొరకు, వారి సంస్థలలో ఉద్యోగాల కొరకు పెద్ద మొత్తంలో క్రైస్తవ మతంలోకి వచ్చి పడటం జరిగింది. ముఖ్యంగా రోమన్ కాథలిక్ సంఘంలోకి. అంతవరకు ఫారిన్ మిషనరీల హయాంలో దళితులు కొంత సమానత్వాన్ని చవిచూడటం జరిగింది. ఎప్పుడైతే ఈ అగ్రకులాల ప్రవేశం జరిగిందో అప్పుడే ఆ మతంలో సమానత్వానికి సిలువ వేయడం, అగ్రకులతత్వానికి బీజాలు పడటం వెంట వెంటనే జరిగిపోయాయి. కాథలిక్ సమాజంలో అగ్రకుల హేరోదులు, ఆ రంగంతోనే సృష్టించిన వీరంగాన్ని ఎదిరించే శక్తి లేని దళిత శిశువులు ప్రొటెస్టెంటుల పశువుల పాకలలో తలదాచుకున్నారు. గుంటూరు, ప్రకాశం జిల్లాలలో కాథలిక్ సమాజంలో అగ్రకులాలు ఎందుకు ఎక్కువగా నున్నారో? ప్రొటెస్టెంటు (బాప్టిస్టులు, పెంటెకోస్తులు మున్నగువారు) సమాజాలలో నూటికి తొంభై ఎనిమిది మంది దళితులే ఎందుకు ఉన్నారనే విషయాన్ని పరిశీలిస్తే కాథలిక్ సమాజం నుండి దళితుల మహాభినిష్క్రమణలో అగ్రకుల పరిసయ్యుల పాత్ర బోధపడుతుంది.

పోయినవారు పోగా ఉన్న కొద్దిమంది దళితుల పట్లనైనా 'నీ వలే నీ పొరుగువారిని ప్రేమించు' అన్న క్రీస్తు బోధనను ఆచరించారా? అటువంటిదేమీ జరగలేదు. ఇంగ్లిష్ మీడియం స్కూళ్లల్లో కాథలిక్‌ల కోటాను అచ్చంగా అగ్రకుల కాథలిక్ పిల్లలకిచ్చి, అడపాదడపా ఏర్పాటు చేసిన తెలుగు మీడియం బళ్లల్లో దళిత క్రైస్తవులను చేర్చుకోవడం జరిగింది. స్కూళ్లల్లో, కళాశాలల్లో టీచర్ల, లెక్చరర్ల పోస్టులు అగ్రకుల కాథలిక్‌లకు రిజర్వ్ చేసి, చప్రాసి పనులకో, పాకీపనులకో దళిత క్రైస్తవులకు ఉపాధి పేరుతో కూలిపని కల్పించారు. కన్యల ఆసుపత్రులలో అగ్రకుల కాథలిక్‌లకు స్టెతస్కోపులిచ్చి దళిత క్రైస్తవులకు చీపుర్లందించారు. సాధారణ దళిత క్రైస్తవులు సరే గురువులుగా, కన్యాస్త్రీలుగా మారిన దళిత క్రైస్తవులనన్న సమానత్వంతో చూసారా? అటువంటిది కూడా జరగలేదు. చార్లెస్ చౌదరీలు, స్టనిస్లాస్ సుబ్బారెడ్లు సుపీరియర్ ఫాదర్లు, రెక్టర్‌లయితే; యేసుపాదం, జోజప్పల్లాంటి ఎందరో దళిత గురువులు పచారీ సరుకుల కొనుగోలుదారులు; రూములన్నీ శుభ్రంగా ఊడ్చారా? బిల్డింగ్ మరమ్మత్తులను జాగ్రత్తగా చేస్తున్నారా, లేదా అని సూపర్‌వైజ్ చేసే బేలుదారీ మేస్త్రీలు. గోపి రాసిన 'గుడిసె ఏసోపు' కథలు ఈ సత్యాలకు అద్దం పడతాయి.[11] వివరణలో మతం మార్చుకున్నందుకు దళితులు రిజర్వేషన్ వసతులకు చట్టపరంగా దూరం కాబడి, మత సంస్థలలోని అవకాశాలకు కులపరంగా దూరం గావించబడి రెంటికి చెడ్డ రేవడులయ్యారు. ఆచరణలో దళితులకు ఎదురవుతున్న ఎన్నో సామాజిక, ఆర్థిక సమస్యలను పరిగణనలోకి తీసుకోకుండా కేవలం 'మతం అనేది ఒక మత్తు మందు' అన్న మార్క్స్ దృక్పథాన్ని ప్రాతిపదికగా చేసుకుని 'భయ్యాలాల్ హిందూ సామాజిక వ్యవస్థ నుండి విముక్తి

కావడానికి బౌద్ధాన్ని స్వీకరించాడు. ఏ సంస్కృతిక ధర్మమూ అతన్ని కాపాడలేదు' అని ప్రజాసాహితి వారు అంటూ మనిషి కట్టుబాట్లపై, ఆలోచనా రీతులపై ఆర్థిక స్థితిగతులపై మత ప్రభావాన్ని ఒక్క ఉదుటున కొట్టిపారేయటం సరికాదు.

ఇక దళితుల వైయక్తిక విముక్తి / అభివృద్ధి సమస్త పీడిత జన సమిష్టి విముక్తి / అభివృద్ధి జరిగినప్పుడే అన్న ప్రజాసాహితి వాదన గురించి కొంత చర్చించవలసి ఉంది. దళిత కూటమిలోని వ్యక్తుల వైయక్తిక సమస్యలేమైనాగాని, అవి ఏ కోవకు చెందినప్పటివైనాగాని ఆ కూటమిలోని వ్యక్తులందరూ సామూహికంగా అనుభవించే కొన్ని ఉమ్మడి సమస్యలు నాలుగు కోవలకు చెందుతాయి. సామాజిక / సాంస్కృతిక గుర్తింపు లేకపోవడం, సాంఘిక అసమానత్వం, ఆర్థిక పీడన, రాజకీయ నిర్బంధనం. ఈ సమస్యల పరిష్కారాలుగా అంటరానితనం పాటింపు నిషేధం, విద్యా, ఉద్యోగ, రాజకీయ అవకాశాలలో దళితులకు దేశ జనాభాలో వారి జనాభా నిష్పత్తి ప్రాతిపదికన సీట్ల కేటాయింపులను రాజ్యాంగ బద్ధంగా గైకొనడం జరిగింది. వీటిని విడమరిచి చూస్తే ఒక్క అంటరానితనం పాటింపు నిషేధం తప్ప మిగిలిన పరిష్కార మార్గాలన్నీ దళిత కూటమిలోని కొద్దిమంది వ్యక్తుల వైయక్తిక అభివృద్ధి మార్గాలు మాత్రమే గాని, కూటమి సామూహిక విముక్తికి, అభివృద్ధికి సాధనాలుకాదు. ఉదాహరణకు, విద్యా, ఉద్యోగాలలో దళితులకు కేటాయించిన 15 శాతం సీట్లను వినియోగించుకొని విద్యాపరంగా, తద్వారా ఆర్థికపరంగా అభివృద్ధికి నోచుకునేది వారిలో 15 శాతం మంది మాత్రమే. మరి వారిలో మిగిలిన 85 శాతం జనాభా సంగతేమిటి? దళిత కూటమి సామూహిక విముక్తి జరగనందువలననే ఖైర్లాంజీ, కారంచేడు, చుండూరు లాంటి అగ్రకుల అమానుష దురాగతాలు జరిగాయి, ఇంకా జరుగుతూనే ఉంటాయి. ఈ మేరకు ప్రజాసాహితి వారి దృక్పథంతో అంగీకరించక తప్పదు. సరే, దళిత కూటమిని భారత రాజ్యాంగం కల్పించిన వసతులు విముక్తం చెయ్యలేకపోయాయి. మరి ప్రజాసాహితి వారు ఆ కూటమి ప్రజల సామూహిక విముక్తికి చూపిస్తున్న మార్గం ఏమిటి?

బొల్లిముంత నాగేశ్వరరావు రాసిన 'ఓ రిజర్వు పంచాయితీ కథ' (ప్రజాసాహితి, 1981: 43వ సంచిక) ద్వారా ప్రజాసాహితి వారు చెప్పిన విషయంలోగాని, 'ఖైర్లాంజీ అవమానాల దురాగతాల జీవితాలింకెన్నాళ్లు' అన్న సంపాదకీయంలో చెప్పినదాన్లో గాని రెండు అంశాలలో వారి సందేశం స్పష్టం: 1) భూమిపై హక్కు సాధించకుండా దళితుల విముక్తి సాధ్యం కాదు; 2) భూమిలేనివారు దళితులలో అధికంగా ఉన్నప్పటికీ అలా లేనివారు దళితేతరులలో కూడా ఉన్నారు. ఈ పీడితులంతా (భూమిలేని దళితులు – దళితేతరులు) సంఘటితమై, ఐక్యంగా భూపోరాటం ద్వారా భూమిని సాధించుకోవాలి. వర్గమార్గం మంచి మార్గమే. అయితే కుల సమాజంలో ఈ మార్గ ఆచరణ సాధ్యమేనా? అన్నది అసలు ప్రశ్న. ఈ మార్గంలోని కొన్ని పరిమితులను వామపక్ష ఆలోచన విధానానికి కట్టుబడినవారికి అంబేద్కర్ ఆలోచనకు కట్టుబడిన దళితులు దళితేతరులు మొదటినుండి చెబుతూనే ఉన్నారు. వాటిలో ముఖ్యంగా: 1) కులవ్యవస్థ – ఫ్యూడల్ వ్యవస్థ ఒకదానికొకటి పెనవేసుకున్న కాలంలో అగ్రకులాల అధికారానికి, నిమ్నకులాల బానిసత్వానికి మూలం పై కులాలకు భూమిపై అధికారం, కింది వారికి అలా అధికారం లేకపోవడం. ఫ్యూడల్ వ్యవస్థ పెట్టుబడిదారీ వ్యవస్థగా రూపాంతరం చెందిన తరువాత అగ్రకులాల అధికార మూలం కూడా మారింది. అప్పుడు భూమి మూలమైతే, ఇప్పుడు విద్య మూలంగా మారింది. ఈ మార్పును గమనించకుండా గతించిన కాలానికి చెందిన సమస్య పరిష్కారాన్ని నడుస్తున్న కాలంలో వర్తింపజేయాలని చూడటం, మే సెవెంటీంత్ కామ్రేడ్స్ మాటలలో 'జబ్బుకు పొంతనలేని మందును ఇవ్వడం'[12] లాంటిది అవుతుంది. 2) దళితులలో దళితేతరులలో భూమిలేని వారున్నారు. సరే, ఈ ఉమ్మడి సమస్య ప్రాతిపదకన వీరిరువురిని ఉమ్మడి వేదికపైకి తీసుకురాగలరా? తీసుకురాలేరని ఇన్నేళ్ల వామపక్ష ఉద్యమం-రాజకీయాలు, నక్సలైట్లు ఉద్యమ వైఫల్యాలు చెబుతూనే ఉన్నాయి. ఈ పరిమితులను అధిగమించేది, దళిత-దళితేతరులలో ఉన్న పీడిత సమాజాన్ని ఆర్థిక – సామాజిక బంధ విముక్తులను గావించేది కేవలం మార్క్స్ వర్గదృక్పథాన్ని అంబేద్కర్ కులదృక్పథానికి జతచేసి కుల పోరాటాలను, వర్గ పోరాటాలను జతగా, ఏక కాలంలో చేపట్టినప్పుడే. ఇది దళిత కుల- వర్గదృక్పథం అనీ, దీనిలో వర్గీకరణ వంటి అంశాలను కూడా భాగస్వామ్యం చేయాలనీ, అంతే తప్ప భూమికోసం దళితులంతా కలిసి ఉమ్మడి పోరాటాలు చేయడం ద్వారానే తమ సమస్యలు తీరిపోతాయని మాదిగలు నమ్మే స్థితిలో లేరని చాలా సున్నితంగానే దార్ల ప్రజాసాహితి వ్యాసాల్లోని భావజాలాన్ని తిరస్కరిస్తున్నారు. సమాజం అంతటినీ చూసినప్పుడు వర్గ దృక్పథం, దళితుల్ని కూడా కలుపుకొని చూసినప్పుడు వర్గ – కుల దృక్పథం, మాదిగల్ని కలుపుకున్నప్పుడు వర్గ, కుల, వర్గీకరణ దృక్పథంతో భూమి కోసం జరిగే పోరాటాలు జరగాలని ఆశించడంలో ఎంతో స్పష్టత కనిపిస్తుంది.

మొత్తానికి మాదిగల కులంలో పుట్టినప్పటికీ మాదిగలు వేసిందే దరువు, రాసిందే సాహిత్యం అని తన కుల వకాల్తా పుచ్చుకోక మాదిగ సాహిత్యం ఆరంభంలో ఆవేశం హద్దు దాటిందని ఒప్పుకునే నిజాయితీ దార్లలో ఉండడం అభినందించదగిన విషయం. తెలుగు సాహిత్యంలో దళిత కథకు గల ప్రాముఖ్యతను తెలియజేయడంలో మొదలయిన దార్ల కలం మాదిగ సాహిత్యం పలికించిన ప్రతి సాహిత్య ప్రక్రియను తడుతూ మార్క్సిస్టులను, అంబేద్కరిస్టులను దగ్గరకు చేర్చే ఒక మంచి ప్రయత్నం పై దృష్టి కేంద్రీకరించడం రాబోయే కాలంలో ఆ కలం చేపట్టబోయే నూతన ప్రయాణానికి నాంది ప్రస్తావన.

**పాదసూచికలు**

7. చంద్రశేఖర రెడ్డి, రాచపాళెం, 2002. ఆధునికాంధ్ర కవిత్వం: ఉద్యమాలు – సందర్భాలు, హైదరాబాద్, అనుపమ ప్రింటర్స్, పే. 72&74
8. చూడండి, వెంకటస్వామి, పి.ఆర్. 1955. అవర్ స్ట్రగుల్ ఫర్ ఎమాన్సిపేషన్, సికింద్రాబాద్, యూనివర్సల్ ఆర్ట్ ప్రింటర్స్
9. జానయ్య, మంద 1999, దళిత్ పొలిటిక్స్ ఇన్ ఆంధ్రప్రదేశ్: ఎ కేస్ స్టడీ ఆఫ్ బహుజన సమాజ్ పార్టీ (బిఎస్‌పి), అముద్రిత ఎం.ఫిల్. థీసిస్, హైదరాబాద్, రాజనీతి శాస్త్ర విభాగం, యూనివర్సిటీ ఆఫ్ హైదరాబాద్
10. అంబేద్కర్, బి.ఆర్. 2004, కన్వర్షన్ యాజ్ ఎమాన్సిపేషన్, న్యూ ఢిల్లీ : క్రిటికల్ క్వస్ట్
11. గోపి, డి. 1996. గుడిసె ఏసోబు – దళిత కథలు, విజయవాడ, దళిత స్త్రీ సాహిత్య పరిషత్
12. చూడండి, మే సెవెంటీంత్ కామ్రేడ్స్, సిపియుఎస్ఐ 2001, ఇండియాలో ఏం చేయాలి (కా.వీరన్న సారథ్యంలో కులంపై, అంబేద్కర్ సిద్ధాంత చర్చ), దళిత బహుజన శ్రామిక విముక్తి, ఆంధ్రప్రదేశ్

(ముగింపు)

**శ్రామిక వర్గ దృక్పథం నుంచి చరిత్రను చూడదలచుకునే వారందరూ తప్పక చదవాల్సిన పుస్తకంగా పేర్కొంటూ 'ద్రావిడ ఉద్యమం కథ - కె.ఎస్. చలం' పుస్తకాన్ని పరిచయం చేస్తున్నారు ఆకుల భూమయ్య**

# పరిశోధకులకు ఉపయోగపడే వ్యాసాలు




**భా**రతదేశ చరిత్రను మూల వాసుల చరిత్రగా మరో కోణం నుండి పరిశీలించిన ఒక సామాజిక శాస్త్రవేత్త కె.ఎస్. చలం. ఆయా సందర్భాలలో చలం రచించిన వ్యాసాల సంకలనంగా ద్రవిడ విశ్వవిద్యాలయం వారు ప్రచురించడం ప్రాసంగికతను సంతరించు కుంది. ద్రవిడ ఉద్యమం పెరియార్ ఇ.వి. రామస్వామి నాయకర్ నుండి విస్తృత ప్రాచుర్యం పొందినప్పటికీ, 19వ శతాబ్ద ప్రారంభంలోనే జ్యోతిరావు పూలే ప్రారంభించిన మూల వాసుల ఉద్యమంతోనే పునాది పడిందని భావించవచ్చు. మాంధిత, శిఖ, రాతిదేవుడు లాంటి మహాపురుషులకు వారసుడుగా బలిచక్రవర్తిని ఆర్యవామనుడు కుటిలబుద్ధితో పొట్టన పెట్టుకున్న తర్వాత చివరిగా రావణుడితో ఆర్యుల విజయ పరంపర దక్షిణా పథంపై పూర్తయిందని మహాత్మా జ్యోతిరావుపూలే తన రచనల్లో స్పష్టపరిచారు.

కె.ఎస్. చలం తన వ్యాసాలలో ఇండియా మూల వాసుల చరిత్రను 1978లో ఎడ్వర్డ్ సయిద్ అనే అనార్కిస్టు తన 'ఓరియంటలిజమ్' అనే గ్రంథంలో తృతీయ ప్రపంచ దేశాల చరిత్రల వక్రీకరణ అంశాన్ని ముందుకు తెచ్చిన ప్రస్తావనతో ప్రారంభించడం ప్రత్యామ్నాయ చారిత్రక దృక్పథం అవసరాన్ని, పరిశోధనల ప్రాముఖ్యతని నొక్కిచెప్పింది. ఆర్.ఎస్. శర్మ, దేవీప్రసాద్ చటోపాధ్యాయ, కోశాంబి, గార్డన్ చైల్డ్‌లను మనం ఇప్పటిదాకా సాంఘిక, ఆర్థిక అంశాలు ముఖ్యంగా ఉత్పత్తి శక్తులు, సంబంధాలు, నాటి జీవన విధానాల ఆధారంగా చరిత్ర రాసిన వాళ్ళుగా గుర్తించి గౌరవిస్తున్నాం. ఈ చరిత్రకారుల రచనల్లో కూడ ఆంగ్లో సాంక్సన్, ఇండో ఆర్యన్ అంటే సాంప్రదాయ మార్క్సిస్టు చరిత్రకారుల్లో ఆధిక్యత భావాలు చోటు చేసుకొన్నాయని, రచనలక్కూడా పరిమితులేర్పడ్డాయనే విషయం, ఇంకా లోతుగా పరిశోధించవలసిన అవసరం యువ చరిత్రకారుల్లో, పరిశోధకుల్లో ఆసక్తిని కలిగించక మానవు. ఈ వ్యాసాల పరంపరలో కె.ఎస్. చలం ఇచ్చిన ప్రాక్ చరిత్రకు సంబంధించిన డాటా అందరికీ ఉపయోపడేదిగా ఉంది. మానవజాతుల పుట్టుకతో పాటు ప్రాచీన నాగరికతలుగా భాసిల్లిన ఈజిప్ట్, మెసపొటేమియాలతో పాటు సింధూ - (ద్రవిడ) నాగరికత అధ్యయనంలో నేటి పాలకవర్గాలు, సాంస్కృతిక రంగంలోని ఆధిపత్య వర్గాలు శ్రద్ధ చూపడం లేదనే వాస్తవాన్ని గట్టిగా చెప్పడంలో చలం ఆవేదన స్పష్టంగా కనబడుతోంది. మన చరిత్రను మనమే రాసుకోవాలి. కొత్త కోణాల్లో పరిశోధించాలి. ప్రపంచంలో గాని, దేశంలో గాని ఆధిపత్య వర్గాల దృక్పథాలు కాకుండా ప్రజల, నిమ్నవర్గాల దృక్పథాల ఆధారంగా చరిత్ర పునర్‌నిర్మాణం జరగాలని కోరుకునే వారికి కె.ఎస్. చలం వ్యాసాల సంకలనం ఇతోధికంగా ఉపయోగపడగలదు.

ప్రధానంగా ద్రావిడ మూలవాసుల ఉద్యమాలు, చరిత్రతో పాటు సమకాలీన విద్య విషయక ప్రాంతీయ ఉద్యమాలు, వాటి సమస్యల పై కూడా వ్యాసాలున్నాయి. లౌకికవాదం - ప్రత్యేకించి భారతదేశంలో మొదటి నుండి ప్రాచుర్యంలోనున్న లౌకికవాద భావనల గురించిన వ్యాసం కూడా ఉంది. లౌకికవాదాన్ని భారతదేశంలో సర్వమత సమభావంగా మొదటి నుండి నిర్వచించడం, ఆచరించడం ప్రాథమికంగానే తప్పుడు ధోరణిగా ఉందని కె.ఎస్. చలం చాలా చక్కగా వివరించారు. సామ్రాజ్యవాదం - ఆధిపత్యవాదం - ప్రపంచీకరణల నేపథ్యంలో వెనుకబడిన దేశాలపై రుద్దబడుతున్న భావజాలాన్ని అర్థం చేసుకొని, సామాన్య ప్రజానీకం తమ అవసరాలకు అనుగుణంగా ఉండే సంస్కృతీ, సాంప్రదాయాలను నిర్మాణం చేసుకోవాలనే పిలుపు కూడ వీరి వ్యాసాల్లో చూడగలం.

గతంలో లాగా ఉత్తర-దక్షిణ విభేదాలు, ఆర్య-ద్రవిడ వైషమ్యాలు నేటి కాలంలో కనిపించకపోయినా వాటి మూలాలను అర్థం చేసుకోవడానికి 'ద్రావిడ ఉద్యమం కథ' వ్యాస సంకలనం బాగా ఉపయోగపడుతుంది. సామ్రాజ్యవాదం, ప్రపంచీకరణ, ప్రైవేటీకరణల నేపథ్యంలో దేశ వ్యాప్తంగా కార్మికవర్గం, రైతాంగం ఐక్యంకావాల్సిన సందర్భంలో, వివిధ జాతుల, వెనుకబడిన ప్రాంతాల విముక్తి కోసం ఆ ప్రాంతంలోని పేదలంతా ఏకం కావాల్సిన సందర్భంలో - చరిత్రలోని ఈ అంశాలు కొంత గందరగోళ పరుస్తాయేమోననే పరిమితి మినహాయిస్తే కె.ఎస్.చలం వ్యాస సంకలనం అన్నికాలాలుగా పాఠకులకు ఉపయోగపడుతుందనడంలో ఎలాంటి సందేహం లేదు. ముఖ్యంగా యువ చరిత్రకారులకు, పరిశోధకులకు ఈ వ్యాసాలు బాగా ఉపయోగపడతాయి.

27 భాషల సముదాయంగా ఉన్న ద్రవిడ భాషీయుల భావ సమైక్యత సాధనలో, భారతీయ సంస్కృతికి సమాంతరంగా ఉండే ద్రవిడ సంస్కృతిని అర్థం చేసుకోవడంలో ఈ వ్యాస సంకలనం ఉపయోగపడుతుంది. డా.కె.ఎస్. చలం కొంతకాలం ద్రవిడ విశ్వవిద్యాలయం ఉపకులపతిగా పనిచేశారు. దేశంలో, రాష్ట్రంలో లెక్కించదగిన మేధావుల్లో చలం ఒకరు. పుస్తకం చదవడం ప్రారంభించితే పూర్తయే దాకా చదివించుతుంది. వీ

**ద్రావిడ ఉద్యమం కథ -** కె.ఎస్. చలం
103 పేజీలు, వెల **రు. 50**
**ప్రతులకు :** ది రిజిస్ట్రార్, ద్రావిడ విశ్వవిద్యాలయం, శ్రీనివాసవనం, కుప్పం - 517 425

## పార్లమెంట్ ఎన్నికల ఫలితాలు

పదిహేనవ లోక్‌సభకు ఏప్రిల్ 16 నుంచి మే 13 వరకు ఐదు విడతలుగా ఎన్నికలు జరిగాయి. మే 16న ఓట్లలెక్కింపు జరిగి ఫలితాలు వెలువడ్డాయి. ఫలితాలు ప్రకటించిన 543 లోక్‌సభ స్థానాలలో గెలుపొందిన అభ్యర్థుల సంఖ్య పార్టీల వారిగా కాంగ్రెస్-206; బిజెపి-116; ఎస్‌పి-23; బిఎస్‌పి-21; జెడి(యు)-20; తృణముల్ కాంగ్రెస్-19; డిఎంకె-18; సిపిఎం-16; బిజెడి-13; శివసేన-11; ఎన్‌సిపి-9; అన్నాడిఎంకె-9; టిడిపి-6; అకాలీదళ్-4; సిపిఐ-4; ఆర్‌జెడి-4; ఎన్‌సి- 3; జెఎంఎం-2; టిఆర్‌ఎస్-2; ఫార్వర్డ్ బ్లాక్-2; ఆర్‌ఎస్‌పి-2; మజ్లిస్-1; ఎజిపి-1; హెచ్‌జెసి(బిఎల్)-1; ఎండిఎంకె-1; ఇతరులు-20; స్వతంత్రులు-9.

## నీరివ్వకుంటే పాలించే హక్కులేదు

దేశంలో జరుగుతున్న సేద్యపు భూముల దురాక్రమణలపై ఫిర్యాదు చేస్తూ న్యాయవాది ఎం.కె. బాలక్రిష్ణ దాఖలు చేసిన ప్రజాహిత వ్యాజ్యంపై సుప్రీంకోర్టు ఏప్రిల్ 28న స్పందిస్తూ ప్రజలకు నీరు కూడా అందించలేకపోతే ప్రభుత్వానికి పదవిలో ఉండే హక్కులేదని ఆగ్రహం వ్యక్తం చేసింది. దేశం ఎదుర్కొంటున్న నీటి సమస్య పరిష్కారానికి యుద్ధ ప్రాతిపదికన వైజ్ఞానిక పరిశోధన జరిపేందుకు అత్యున్నత అధికార కమిటీని ఏర్పాటు చేసింది. ఈ పరిశోధన ప్రధానంగా సముద్రపు నీటిని తక్కువ వ్యయంతో మంచినీరుగా మార్చే పద్ధతులపై కేంద్రీకరించాలని ఆదేశించింది. జస్టిస్ మార్కండేయకట్టు, జస్టిస్ ఎచ్.ఎల్. దత్తులతో కూడిన సుప్రీంకోర్టు ధర్మాసనం నీటి సమస్య పరిష్కారంపై ప్రభుత్వ తీరు పట్ల తీవ్ర ఆక్షేపణ వ్యక్తంచేసింది.

## ర్యాగింగ్ పై సుప్రీంకోర్టు కొరడా

ర్యాగింగ్‌ని కళాశాలల నుండి దూరం చేయడానికి తీసుకోవాల్సిన చర్యలపై సలహాలు, సూచనల కోసం కేంద్ర మానవ వనరుల మంత్రిత్వ శాఖ 2006 డిసెంబర్‌లో ఎంకె రాఘవన్ నేతృత్వంలో కమిటీని నియమించింది. కమిటీ నివేదికను పరిశీలించిన సుప్రీంకోర్టు ర్యాగింగ్ నిరోధానికి కాలేజీల్లో కమిటీలను ఏర్పాటు చేయాలనీ, విద్యార్థులకు కౌన్సలింగ్ ఇచ్చేందుకు ప్రతి కాలేజీలోనూ ఒక మానసిక వైద్యుడిని నియమించాలనీ ఆదేశించింది. మద్యం సేవించే విద్యార్థులను వ్యసనానికి దూరం చేసేలా డీ-అడిక్షన్ సెంటర్లను నెలకొల్పాలని స్పష్టంచేసింది. న్యాయమూర్తి అరిజిత్ పసాయత్ నేతృత్వంలోని ధర్మాసనం మే 8న ఈ ఆదేశాలు జారీచేసింది.

## ప్రభాకరన్ మరణంపై తమిళుల ఆందోళన

ఎల్.టి.టి.ఇ. నేత ప్రభాకరన్ మృతి చెందినట్లు శ్రీలంక ప్రభుత్వం మే 19న అధికారికంగా ప్రకటించడంతో తమిళనాడులోని ఎల్.టి.టి.ఇ. సానుభూతిపరులు పలు వాహనాలను ధ్వంసం చేసి, ధర్నాలు, రాస్తారోకోలు చేపట్టారు. పలుచోట్ల దుకాణాలు మూసివేసారు. కోయంబత్తూరు కేంద్ర కారాగారంలో సుమారు 200 మంది పెరియార్ ద్రావిడ కళగం కార్యకర్తలు నిరాహార దీక్ష చేపట్టారు. శ్రీలంక అధ్యక్షుడు మహింద రాజపక్షే దిష్టిబొమ్మను దగ్ధం చేశారు. వీ

## దళితుల బహిష్కరణ

హర్యానలోని గుహనా సబ్‌డివిజన్‌కు చెందిన కతువ గ్రామంలోని దళితులు బిఎస్‌పి కి ఓటు వేసి కట్టుబాటు తప్పారంటూ గ్రామంలోని అనేక దళిత కుటుంబాలపై అగ్రకులస్తులు మే 10న గ్రామపంచాయితీని సమావేశపరచి సంఘ బహిష్కరణ శిక్ష విధించారని బాధితులు తెలిపారు. ఈ ప్రాంతంలో జాట్ల ప్రభావం ఎక్కువగా ఉంది. బి.ఎస్.పి. కి సహాయం చేసి, ఓటు వేసి, ప్రచారం చేసినందుకు వారిపై గ్రామ పంచాయితీ రు.1100 జరిమానా విధించిందని బాధితులు చెప్పారు. ఈ ఆరోపణలను గ్రామ పంచాయితీ ఖండించింది.

## బోఫోర్స్ శతఘ్నులు...

సిబిఐ విజ్ఞప్తి మేరకు బోఫోర్స్ కేసులో అనుమానితుడిగా ఉన్న కత్రోచి పేరును ఇంటర్ పోల్ తన మోస్ట్ వాంటెడ్ జాబితానుండి తొలగించింది. ఇంటర్‌పోల్ ఈ చర్య తీసుకుంది. 1999 నుంచి ఈ కేసుపై కోర్టుల్లో విచారణ జరుగుతోంది. ఈ కేసులో తదుపరి విచారణ జరగనున్న సమయంలో (ఏప్రిల్ 30న 2009) సంబంధిత కోర్టుకు తెలియజేస్తాం అని సిబిఐ ప్రతినిధి హర్ష్ బహల్ చెప్పారు.

## బూటు తో నిరసన

ఇరాక్‌లో బుష్‌పై అల్‌జైదీ, చిదంబరంపై జర్నైల్ సింగ్, ఆ తరువాత ఎం.పి. నవీన్ జిందాల్, బిజెపి అధ్యక్షుడు ఎల్.కె. అద్వానీలు బూటు నిరసనలు ఎదుర్కొన్నారు. అదే క్రమంలో అహ్మదాబాద్‌లో ఏప్రిల్ 26న ప్రధాని మన్మోహన్ సింగ్‌పై హితేష్ చౌహాన్ అనే యువకుడు బూటు విసిరి తన నిరసనను వ్యక్తం చేశాడు. ఎన్నికల ప్రచారంలో భాగంగా ప్రధాని యు.పి.ఎ. ప్రభుత్వం చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాలు గురించి ప్రస్తావిస్తూ ప్రసంగం మొదలుపెట్టగానే హితేష్ 'అబద్ధాలు చెప్పడం ఆపు' అంటూ కుర్చీపై నిలబడి కాలికున్న బూటు తీసి ప్రధానిపైకి విసిరాడు. ఆ బూటు వేదికకు ఇరవై అడుగుల దూరంలోనే పడిపోయింది. పోలీసులు ఆ యువకుడిని అదుపులోకి తీసుకున్నారు. ప్రధాని ఆ యువకుడిని క్షమించి విడిచిపెట్టమని పోలీసులకు తెలిపారు.

## దేశాన్ని ఏలడానికి పోటీపడుతున్నవారు

లోక్‌సభకు జరిగిన ఎన్నికల్లో పోటీ చేసిన వారిలో 1,140 మందిపై క్రిమినల్ కేసులున్నాయని 'అసోసియేషన్ ఆఫ్ డెమొక్రటిక్ రీఫార్మ్స్ అండ్ నేషనల్ ఎలక్షన్ వాచ్' సంస్థ జరిపిన సర్వేలో తేలింది. క్రిమినల్ కేసులున్న అభ్యర్థుల జాబితాలో 114 మందితో కాంగ్రెస్ మొదటి స్థానంలో ఉండగా, బిజెపి 113 మందితో, బిఎస్‌పి 105 మందితో రెండూ, మూడూ స్థానాల్లో ఉన్నాయి. సమాజ్‌వాది పార్టీ 55 మందితో, సిపిఐ (ఎం) 20 మందితో, సిపిఐ 7 మందితో తరువాతి స్థానాల్లో ఉన్నాయి. వీరిలో అతిక్రూరమైన నేరాలకు పాల్పడ్డవారు కాంగ్రెస్, బిఎస్‌పిల్లో చెరి 43 మంది కాగా, బిజెపిలో 41మంది, ఎస్‌పిలో 33 మంది ఉన్నారు. పోటీచేసిన ముగ్గురు లేక నలుగురు అభ్యర్థులు క్రిమినల్ కేసులు కలిగి ఉన్న నియోజకవర్గాలు 188 ఉన్నాయి. లోక్‌సభకు పోటీచేసిన వారిలో 1,205 మంది కోటీశ్వరులు నిలిచినట్టు అధ్యయనంలో వెల్లడైంది.

## ప్రబలుతున్న స్వైన్ ఫ్లూ

ఏప్రిల్ ఆఖరివారం మెక్సికోలో మొదలైన స్వైన్ ఫ్లూ వ్యాధి ప్రపంచ వ్యాప్తంగా శరవేగంగా విస్తరిస్తోంది. ఈ వ్యాధితో ఇప్పటి వరకు ప్రపంచ వ్యాప్తంగా 70 మందికి పైగా మరణించారు. 39 దేశాల్లో 8480 మందికి సోకింది. ఒక్క అమెరికాలోనే అత్యధికంగా 4714 మంది ఈ వ్యాధి బారిన పడ్డారు. ఇది ప్రధానంగా పందులు, ఇతర పశుపక్ష్యాదుల నుంచి మానవునికి సంక్రమిస్తుంది. ఇది మనిషి నుంచి మనిషికి వ్యాప్తి చెందుతుంది.

## నేపాల్ లో సంక్షోభం

నేపాల్‌లో రాజకీయ సంక్షోభం ముదిరి ప్రధాని పుష్పకమల్ దహాల్ (ప్రచండ) మే 4న రాజీనామా చేశారు. మే 3న నేపాల్ కమ్యూనిస్ట్ పార్టీ (మావోయిస్ట్) సారథ్యంలోని సంకీర్ణ ప్రభుత్వం ఆర్మీ చీఫ్ జనరల్ రుక్మాంగద కతావల్‌ను తొలగించింది. కేబినెట్ తీసుకున్న ఈ నిర్ణయాన్ని ప్రభుత్వ ప్రధాన భాగస్వామ్య పార్టీ అయిన సిపిఎన్ (యుఎంఎల్) వ్యతిరేకించి, నిరసనగా ఆ పార్టీ ప్రభుత్వం నుంచి వైదొలిగింది. దీంతో మావోయిస్ట్ పార్టీ ప్రభుత్వం మైనారిటీలో పడిపోయింది. ఆర్మీ చీఫ్ జనరల్ ను తొలగించడం రాజ్యాంగబద్ధమైనది కాదని, అందుకే దీనిని ఆమోదించడం లేదని అధ్యక్షుడు రామ్‌బరణ్ యాదవ్ ప్రకటించారు. ఆర్మీ చీఫ్ జనరల్‌గా కతావల్‌ను కొనసాగాల్సిందిగా అధ్యక్షుడు ఆదేశించడంతో ప్రచండ ఈ నిర్ణయం తీసుకున్నారు. 'విదేశీ శక్తుల ఆదేశాలకు తలవంచి పనిచేయడం కంటే రాజీనామా చేయడమే మేల'ని ప్రచండ వ్యాఖ్యానించారు. సి.పి.ఎన్.- యు.ఎం.ఎల్. నేత మాధవ్‌కుమార్ తనకు మద్దతునిస్తున్న 20 పార్టీలకు చెందిన 346 మంది పార్లమెంట్ సభ్యుల సంతకాలను రాజ్యాంగ సభ (సిఎ) చైర్మన్ సుభాష్ సేమ్‌వాంగ్‌కు సమర్పించారు. దీంతో నేపాల్ కొత్త ప్రధానిగా మాధవ్‌కుమార్ బాధ్యతలు స్వీకరించనున్నారు.

## దక్షిణాఫ్రికా అధ్యక్షుడిగా జుమా

దక్షిణాఫ్రికాలో ఇటీవల జరిగిన పార్లమెంట్ ఎన్నికల్లో ఆఫ్రికన్ నేషనల్ కాంగ్రెస్ (ఎఎన్‌సి) ఘనవిజయం సాధించింది. మే 6న సమావేశమైన నూతన పార్లమెంట్‌లో జరిగిన ఓటింగ్‌లో ఎఎన్‌సి అధ్యక్షుడు జాకబ్ జుమాకు 277 ఓట్లు లభించగా, ప్రత్యర్థి కాంగ్రెస్ ఆఫ్ ది పీపుల్ నేత మజిమా షిల్లోవాకు 47 ఓట్లు లభించాయి. అరవై ఏడు సంవత్సరాల జాకబ్ జుమా మే 9న దక్షిణాఫ్రికా నాల్గవ అధ్యక్షుడిగా ప్రమాణ స్వీకారం చేశారు. నిబద్ధత, క్రమశిక్షణ, అంకితభావంతో దేశానికి సేవచేస్తానని జుమా తెలిపారు.

## తాలిబన్లపై పాక్ యుద్ధం

తాలిబన్ రాజ్యాంగా మారిన స్వాత్ లోయను తిరిగి స్వాధీనం చేసుకోవాలన్న లక్ష్యంతో పాకిస్థాన్ పెద్ద ఎత్తున దాడులు నిర్వహిస్తోంది. ఈ పోరులో ఇప్పటివరకు 700 మందికి పైగా తాలిబన్లు మరణించారు. పాకిస్థాన్ ప్రభుత్వం తాలిబన్లపై పోరుని స్వాత్ లోయకు విస్తరించడంతో స్వాత్ ఒప్పందం రద్దయిపోయినట్లేనని తాలిబన్ అధికార ప్రతినిధి ప్రకటించారు. ఇక యుద్ధం అనివార్యమన్న భయంతో పెద్ద ఎత్తున జనం స్వాత్‌ను వీడి పారిపోతున్నారు. దిర్, స్వాత్, బునేర్ ప్రాంతాల నుంచి పారిపోయి దాదాపు 3.60 లక్షల మంది సురక్షిత ప్రాంతాలకు చేరుకున్నట్లు ఐక్యరాజ్య సమితి అంచనా వేస్తోంది. తాలిబన్ స్థావరాలపై సైన్యం హెలికాప్టర్ గన్‌షిప్స్, ట్యాంకులతో భారీ ఎత్తున దాడులు చేస్తోంది. దేశంలోని ఉగ్రవాదులను నిర్మూలించాలని పాకిస్థాన్‌కు అమెరికా ఆదేశాలు జారీ చేసింది. ఈ నేపథ్యంలోనే సైన్యం స్వాత్ లోయలో తాలిబన్లపై దాడులు ప్రారంభించింది. స్వాత్‌లోయలో సాధారణ పరిస్థితులు నెలకొల్పేందుకు తాలిబన్లని మట్టుబెట్టాలని పాకిస్థాన్ ప్రభుత్వం నిర్ణయించిందన్నారు.

## ఐస్‌ల్యాండ్‌లో వామపక్ష ప్రభుత్వం

ఐస్‌ల్యాండ్ పార్లమెంట్‌కు జరిగిన ఎన్నికల్లో వామపక్ష కూటమి ఘన విజయం సాధించింది. 63 సభ్యులున్న పార్లమెంట్‌కు జరిగిన మధ్యంతర ఎన్నికల్లో సోషల్ డెమొక్రటిక్ పార్టీకి 20, వామపక్ష గ్రీన్ ఉద్యమానికి 14 పార్లమెంట్ సీట్లు లభించాయి. 97.9 శాతం ఓట్లు లెక్కించగా సోషల్ డెమోక్రాట్లకు 30.5 శాతం, వామపక్ష గ్రీన్ ఉద్యమానికి 21.5 శాతం ఓట్లు వచ్చాయి. 18 ఏళ్లు అధికారంలో ఉన్న మితవాద ఇండిపెండెన్స్ పార్టీకి 23.4 శాతం ఓట్లు మాత్రమే లభించాయి. 3.19 లక్షల జనాభా కలిగిన ఈ యూరప్ దేశంలో వామపక్ష విజయం సాధించడం ఇదే మొదటిసారి.

## ఎల్.టి.టి.ఇ. నేత ప్రభాకరన్ మృతి

ఎల్.టి.టి.ఇ. నేత ప్రభాకరన్ మరణించారు. శ్రీలంక ప్రభుత్వం మే 18న అధికారికంగా ప్రభాకరన్ మరణించినట్లు ప్రకటించింది. దాదాపు నాలుగు దశాబ్దాలుగా సాగుతున్న తమిళ జాతిపోరాటంపై శ్రీలంక ప్రభుత్వ సైన్యాలు పైచేయి సాధించాయి. ప్రభాకరన్ అగ్రనేతలు, అనుచరులతో సహా వ్యానులో తప్పించుకునే ప్రయత్నంలో ఉండగా కాల్పులు జరపడంతో చనిపోయినట్లు శ్రీలంక సైన్యం ప్రకటించింది. అతని మృతదేహాన్ని నోఫైర్ జోన్‌లోని నందికదల్‌లో కనుగొన్నారు. ప్రభాకరన్ మృతిపై పలు అనుమానాలు, ప్రశ్నలు తలెత్తాయి. ప్రపంచ వ్యాప్తంగా ఈ మారణహోమం పట్ల తీవ్ర నిరసన వ్యక్తమైంది. తమిళులపై అమలవుతున్న హత్యాకాండను వెంటనే నిలిపివేయాలని పలు దేశాలు, మానవ హక్కుల సంస్థలూ కోరాయి.

## సూకీపై మళ్లీ విచారణ

మయన్మార్ ప్రజాస్వామిక నాయకురాలు ఆంగ్‌సాన్ సూకీపై సైనిక ప్రభుత్వం న్యాయ విచారణ చేపట్టింది. సూకీ ఇంట్లోకి అమెరికన్ పౌరుడు ఒకరు చొరబడ్డారన్న నెపంతో ఆమెపై విచారణ ప్రారంభించింది. సూకీ నిర్బంధం మే 27న ముగుస్తుంది. తాజా ఆరోపణలతో సూకీకి ఏడేళ్ల జైలు శిక్ష పడే అవకాశాలు ఉన్నాయి. తమ పాలనకు పెద్ద ముప్పుగా పరిగణిస్తున్న సూకీని మయన్మార్ సైనిక ప్రభుత్వం ఏదో ఒక నెపంతో నిర్బంధంలో ఉంచుతోంది. ఇంట్లోకి చొరబడ్డ అమెరికన్ వ్యక్తిని సూకీ ఆహ్వానించలేదని ఆమె తరఫు న్యాయవాది వాదిస్తున్నారు. సూకీపై జరుగుతున్న విచారణ విషయంపై సర్వత్రా ఆందోళన వ్యక్తమౌతోంది. ☐

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్థాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగానూ, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(21 ఏప్రిల్ 2009 నుండి 20 మే 2009 వరకు)**

| జిల్లా | ఆత్మహత్యలు | | | హత్యలు | | | | గుర్తు తెలియని | ఆకలి | ప్రమాదాలు | | | చికిత్స అందక, అనారోగ్యం | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | ఫ్యాక్షన్ | కులం | మతం | తగాదాలు | | | పనిచేసే స్థలంలో | రహదారి | ఇతరాలు | | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) |
| ఆదిలాబాద్ | 3 | – | 33 | – | – | – | 12 | 8 | – | 2 | 26 | 25 | 11 | – | – | – | 2 | 33* |
| హైదరాబాద్ | – | – | 24 | – | – | – | 11 | 28 | – | – | 40 | 24 | 1 | – | – | – | 16 | – |
| కరీంనగర్ | 10 | 4 | 59 | – | – | – | 3 | 11 | 2 | 10 | 36 | 30 | 12 | – | – | – | 10 | 58 |
| ఖమ్మం | – | – | 24 | – | – | – | 8 | 9 | – | 4 | 47 | 32 | 13 | – | – | 1 | 2 | 63 |
| మహబూబ్‌నగర్ | | | | | | | | | | | | | | | | | | |
| మెదక్ | 11 | – | 24 | – | – | – | 8 | 4 | – | 2 | 45 | 36 | 3 | – | – | – | – | 20 |
| నలగొండ | వివరాలు అందలేదు | | | | | | | | | | | | | | | | | |
| నిజామాబాద్ | – | – | 25 | – | – | – | 14 | 2 | – | 7 | 21 | 27 | – | – | – | – | – | 1 |
| రంగారెడ్డి | 6 | – | 33 | – | – | – | 6 | 15 | – | 1 | 44 | 13 | 29 | – | – | – | – | 11 |
| వరంగల్ | 8 | 1 | 22 | – | – | – | – | 5 | – | 4 | 25 | 23 | 10 | – | – | – | – | 36 |
| అనంతపురం | 6 | 3 | 25 | 3 | – | – | 4 | 4 | – | 8 | 24 | 19 | – | – | – | – | – | – |
| చిత్తూరు | 1 | – | 20 | – | – | – | 4 | 3 | – | 6 | 46 | – | 2 | – | – | – | – | 5 |
| కడప | 3 | – | 17 | – | – | – | 4 | 10 | – | 5 | 14 | 13 | 4 | – | – | – | – | 5 |
| కర్నూలు | 5 | – | 47 | – | – | – | 6 | 13 | – | 6 | 41 | 44 | 20 | – | – | – | – | 30 |
| తూర్పు గోదావరి | 1 | 1 | 38 | – | – | – | 6 | 3 | – | 1 | 54 | 37 | 6 | – | – | – | 4 | 11 |
| గుంటూరు | – | – | 5 | – | – | – | 10 | 3 | – | 5 | 43 | 18 | 3 | – | – | – | 1 | 16 |
| కృష్ణా | 2 | – | 19 | – | – | – | 22 | 4 | 3 | 2 | 34 | 27 | 3 | – | – | – | – | 5 |
| ప్రకాశం | – | – | 5 | – | – | – | 2 | 3 | – | 2 | 37 | 10 | 1 | – | – | – | – | 3 |
| శ్రీకాకుళం | – | – | 9 | – | – | – | 6 | – | – | – | 26 | 10 | 9 | – | – | – | – | 4 |
| విశాఖపట్నం | – | – | 7 | – | – | – | 2 | 3 | – | – | 27 | 18 | 8 | – | – | – | 3 | 5 |
| విజయనగరం | 1 | – | 5 | – | – | – | 1 | 2 | – | 3 | 26 | 2 | 3 | – | – | – | – | 4 |
| **మొత్తం** | **57** | **9** | **441** | **3** | **–** | **–** | **129** | **130** | **5** | **68** | **656** | **408** | **138** | **–** | **–** | **1** | **38** | **310** |

అందిస్తున్నవారు : ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎల్. సంతోష్; ఖమ్మం – సి.ఎచ్. కృష్ణ; మహబూబ్‌నగర్ – ఏసురత్నం; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; నలగొండ – డి. మహేష్; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – శంకరయ్య, వరంగల్ – ఎ.కుమార్; అనంతపురం – ఎం. ఆదిశేషయ్య; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – బి. దస్తగిరి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్; గుంటూరు – బి. అంజమ్మ ; కృష్ణా – బి. రమేష్‌బాబు; నెల్లూరు – శ్యాంసుందర్ రావు; ప్రకాశం – కె. మల్లికార్జున్; శ్రీకాకుళం – జి. సుధీర్; విశాఖపట్నం – కె.వి. రమణ; విజయనగరం – డి. సుధాకర్;

*31 వడదెబ్బ తగిలి చనిపోయినవారు

## త్వరలో వెలువడనున్న వీక్షణం ప్రచురణలు

వ్యవసాయం, పరిశ్రమలు, సేవారంగం, ఆర్థిక వ్యవహారాలు, ఉపాధి, పాలన,
ప్రాంతీయ అసమానతలు, ప్రజా ఉద్యమాలు, తదితర అంశాలపై

# మీరు - నేను - ఆర్థికం

## వి. హనుమంతరావు

### వ్యాసాల సంకలనం



సామాజిక అధ్యయనం ఎలా చేయాలి? గ్రామీణ ప్రాంతాల పరిశీలనలో ముఖ్యమైన అంశాలేమిటి?
సాహిత్యం ద్వారా సమాజ పరిణామాలను గుర్తించడం ఎట్లా? వంటి అనేక మౌలిక అంశాలపై
లోతయిన ఆలోచనలను రేకెత్తించే

## ముదునూరి భారతి

### వ్యాసాల సంకలనం



భారత రాజకీయార్థిక పరిణామాలు, ప్రణాళికలు, ప్రజల చరిత్ర, ప్రజా ఉద్యమాలు మొదలయిన
అనేక కోణాలలో తాత్విక ప్రశ్నలు సంధించి, కొత్త ఆలోచనలు రగిలించే

## ఆర్.ఎస్. రావు

### వ్యాసాల సంకలనం



110 ఏళ్ల అమెరికా దురాక్రమణల చరిత్ర
**స్టీఫెన్ కింజెర్** రచన 'ఓవర్ త్రో' కు **కొణతం దిలీప్** తెలుగు అనువాదం

## కుట్రాజకీయం

• RNI Regn.No.APTEL/2003/11482• Published on 29/5/2009 • Postal Regn. No. LII/RNP/HD/1100/2008-10

వీక్షణంకు రాష్ట్రంలోనేకాదు, దేశమంతటా, విదేశాలలోనూ విస్తృతంగా పాఠకులున్నారు

మా పాఠకులలో మేధావులు, విద్యార్థులు, పరిశోధకులు, ఉపాధ్యాయులు,
పత్రికా రచయితలు, ఉద్యమాల కార్యకర్తలు, సామాజిక, రాజకీయ కార్యకర్తలు,
ప్రజా నాయకులు, విధానకర్తలు... ఒకరేమిటి తెలుగు సమాజంలో ప్రభావశీల
వ్యక్తులందరికీ కరదీపిక వీక్షణం

# ప్రపంచానికి మీ మాట అందాలంటే
# వీక్షణంలో ప్రకటించక తప్పదు

## వీక్షణంలో మీ ప్రకటనలకై చెల్లించాల్సిన రుసుం

| | | | |
|---|---|---|---|
| చివరి కవర్ (కలర్‌లో ఫుల్ పేజీ) | : | రు. | 20,000 |
| రెండవ కవర్ (కలర్‌లో ఫుల్ పేజీ) | : | రు. | 15,000 |
| మూడవ కవర్ (కలర్‌లో ఫుల్ పేజీ) | : | రు. | 15,000 |
| లోపల పేజీ (బ్లాక్ అండ్ వైట్‌లో ఫుల్ పేజీ) | : | రు. | 12,000 |
| లోపల పేజీ (బ్లాక్ అండ్ వైడ్‌లో హాఫ్ పేజీ) | : | రు. | 7,500 |

### వివరాలకు సంప్రదించవలసిన చిరునామా

**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495,
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, reachcdrc@yahoo.com
సర్క్యులేషన్ మేనేజర్ : 9949391028

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Charitha Impressions, 1-9-1126/B, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao